

# భారతి

వ్యవస్థాపకులు
దేశోద్ధారక నాగేశ్వరరావుపంతులు

జూన్ 1982 వెల: రూ. 4/-

# భారతి

మాసపత్రిక

❀

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు

(1938-1972)

❀

జూన్ 1982

సంపుటము : 59 సంచిక : 6

---

విడిపత్రిక వెల నాలుగు రూపాయలు

# విషయానుక్రమణిక

## జూన్ 1982





# స్నేహ గీతం

## శ్రీ సూర్యదేవర రవికుమార్

నిజంగానే నువ్వూ నేనూ
నేస్తం! మళ్ళీ కలిసి బ్రతికే రోజు వస్తే
కాలంకాని కాలమయినా
ఎదకోయిల ఎలుగెత్తి కూస్తుంది.
అమావాస్య చీకటయినా
సిరివెన్నెల విరబూస్తుంది
అక్షరాలలో తెలపలేని ఆనందం మన
అంతరంగాలలో విలాసంగా తాండవిస్తుంది.

జీవితపు ప్రమిదలలో
ఆత్మీయతా తైలము నింపి
విరిలా నెమలి పురిలా విరిసిన స్నేహబంధపు
మెత్తని నూలిపింజలు వత్తులుగా వేసి
గుండెకు గుండెను ఒరపిడి చేసి
అగ్ని రేఖలు సృష్టిద్దాం
ప్రేమజ్యోతులు వెలిగిద్దాం
ఆనందదీపావళి నహరహమూ జరుపుకొందాం.

నిజంగానే నువ్వూ నేనూ
నేస్తం! మళ్ళీ కలిసి బ్రతికే రోజువస్తే
కాలదేవత కాలిక్రింద ఛిత్రమైన గతంలోని
బంగారం లాంటి రోజులు
స్మృతి పథంలో తొలకరి మెరుపులై మెరుస్తాయి
విరిసిన తలపుల మొయిళులు
ఉత్సాహపు ఉరుములతో
ఆనందవర్షధారలు ప్రసవిస్తాయి
ఏనాడో ఎదచేనిలో వెదజల్లిన స్నేహబీజాలు
మొలకలెత్తి పిలకలేసి
మళ్ళీ యిన్నాళ్ళకు
మమతల ధాన్యపురాసులతో
మనసు బండ్లను నింపుతాయి
ఆ శుభవేళ
తాండవించే హర్షంతో
సంక్రాంతిని జరుపుకొందాం
సరదాల రంగుల రాట్నంపై
సవ్వాలు వేద్దాం
చిరకాలం వేధించిన చలికి
చింతనిప్పుల చితి పేర్చుదాం.
నిజంగానే నువ్వూ నేనూ
నేస్తం! మళ్ళీ కలిసి బ్రతికే రోజువస్తే

గతంలోని సుఖాలతీపిని నెమరువేసికొంటూ
దాని మాటున తొంగిచూచే వెతలచేదును వెక్కిరిస్తూ
పండని రసాలంలా పుల్లనైన బ్రతుకుకు
పూర్ణత్వం సమకూర్చుకొందాం
జీవిత చక్రపు వివిధగతులు
ఉగాది పచ్చడి రుచులులా
వింత అనుభూతిని సంతరించగా
వేడుకల ఉగాదిని జరుపుకొందాం
చిగురువేసి వృద్ధిపొందిన

చెలిమి మామిడి చెట్ల రెమ్మలు
మన జీవితప్రాసాద ద్వారబంధాలకు
మాయని పచ్చతోరణాలుగా కట్టి
పండుగలు జరుపుకొందాం
ఆ పచ్చదనాన్ని, ఆ పండుగదినాన్ని
అలాగే పదికాలాలు నిలుపమని
ఆ పరమాత్ముని వేడుకొందాం

నిజంగానే నువ్వూ నేనూ
నేస్తం! మళ్ళీ కలిసి బ్రతికేరోజువస్తే....

అవును. ఇంతకీ ఆరోజు వస్తుందంటావా?
ఆకాశానమళ్ళీ అందాల హరివిల్లు
అగుపిస్తుందంటావా?
నాకేమో ఏదో నమ్మకం
మనసులో ఒకమారుమూల
అలా, అరుణుని అడ్డుకోవాలని
ఆకాశానికి పెరిగే వింధ్యగిరిలా
ఆశఒకటి బయలుదేరిన జ్ఞాపకం
అదే నిజమైతే నేస్తం!
అడ్డువచ్చిన బంధాలను అవలీలగా దాటుకొంటూ
ఎంతదూరమేగినా
ఎడంకాని ఎదురుపడని
చెలిమిబండి చక్రాలమై చివరిమజిలీ చేరుకొందాం
స్నేహానికి చెరిగిపోని చిహ్నంగా మిగిలి ఉందాం.



# శి శ యి ష*

## శ్రీ మేడవరపు సంపత్ కుమార్

ప్రాచీన కాలపు ఫాసిల్స్ అడుగుపొరల
అంతః తమస్సులో
గాథలు లేని అగాధాల్లో
మేధ చొరని మరుగుల్లో
శయనించాలని నా కోరిక
అపుడు
నా దేహంలోని ధమనుల్లో ప్రశాంతశతానందాలు
ఉద్భవిస్తాయి.
ఈ సిరులు, మరులు నా మజ్జలో పరిమార్జితాలు
కళలు, కాంతులు నా అస్థితో భూస్థాపితాలు
నీతులు, చేతలు నా రుధిరంలో ఆవిరి కాబోయే
అంధః కణాలు
జగతి జంఝాటంలో
ఎందుకీ జాగరణ
కాదు ఇది మృతావస్థ,
అందరికీ అందని
చ్యుతి లేని అమృతావస్థ!

*శిశయిష = శయితుమిచ్ఛా



డాక్టర్ కొర్లపాటి శ్రీరామమూర్తి

# కవిజనాశ్రయము - కర్తృకాలము

తెలుగు లక్షణ గ్రంథము అందు లభించినంత వఱకు కవిజనాశ్రయము తొలిగ్రంథము. ఇది సర్వసమ్మతము. కాని, కవిజనాశ్రయము కర్తృత్వము సమస్య. రచనా కాలము రగడ. 1917వ-సంవత్సరమునందు "పది ప్రాంత పుస్తకముల శోధించి" ప్రథమతః జయంతి రామయ్య పంతులు గారు ప్రకటించిన ముద్రిత గ్రంథము నందు, 1951వ సంవత్సరము నందు మఱొక వ్రాత ప్రతిని సాధించి వావిళ్ళ రామస్వామి శాస్త్రులుగారు ప్రకటించిన ముద్రిత గ్రంథము నందును "ఇది శ్రీ వాదీంద్ర చూడామణి చరణ సరసీరుహ మధుకరాయమాణ కవిజనాశ్రయ శ్రావకాభరణాంక విరచితంబైన కవిజనాశ్రయంబను ఛందంబు నందు" అని కలదు. అంతే కాదు. సంజ్ఞాధికారము నందు "కవిజనాశ్రయుండు మల్లియ రేచన సుకవి కవిజనాశ్రయ మను ఛందముఁ దెనుఁగుబాస నరుదుగఁ జెప్పెన్" అని కలదు. ఉపరి, కవిజనాశ్రయ పద్యము అందు "మల్లియ రేచా!" అను మకుటము కలదు. ఇవి కవిజనాశ్రయము మల్లియరేచనకృత మనుటకు సాధకములు. ఒక "మిక్కిలి ప్రాఁతప్రతి" యందు "వేముల వాడను వెలసిన భీమేశ్వరు కరుణఁగల్గు భీమసుకవినేఁ గోమటి రేచనమీఁదను సీమహిఁ గవులెన్న ఛంద మెలమి రచింతున్" అని కలదు. అంతే కాదు. లింగమగుంట తిమ్మకవి మొదలైన లాక్షణికులు "భీమనఛందము" నుండి ఉదహరించిన పద్యములు కవిజనాశ్రయము నందు కలవు. ఉపరి, కాకునూరిఅప్పకవి "భీమన పదిచెప్పె" నన్నటుల ఛదియతుల నిర్దేశము కవిజనాశ్రయము నందు కలవు. ఇవి కవిజనాశ్రయము మల్లియ రేచన కృత మనుటకు బాధకములు.

మల్లియ రేచన జినేంద్ర భక్తుడు (సంజ్ఞాధికారము.) వేములవాడ భీమన భీమేశ్వర భక్తుడు (చాటు పద్యము). కవిజనాశ్రయము నందు జినవిషయముతోపాటు శివవిషయమును కలదు.

"అమరఁగ వేల్పులచేఁ గ
బ్బము సెప్పియకాదె వరము వడసిరి మును బా
ణ మయూరాదులు సత్కా
వ్యము సెప్పినఁ బడయరాని వస్తువు గలదే"-సం. అ.

శివభక్తుల మహిమను ప్రకటించుటకు బాణమయూర కాళిదాసులు శివుని గుఱించి గద్యకృతులు చెప్పి వరములు వడసినట్లు పాలకుఱికి సోమనాథుని పండితారాధ్య చరితము నందు వివరముగ కలదు. అందు మయూరుడు సూర్యుని గుఱించి శతకము రచించి వరము వడసినట్లును కలదు. ఇది జినేంద్ర భక్తుడైన మల్లియ రేచన కంటె, భీమేశ్వర భక్తుడైన వేములవాడ భీమన రచించుట సహజము. అంతే కాదు. కవిజనాశ్రయము ప్రాతప్రతులందు గణములకు వర్ణవివక్ష కలదు. ఇదియును జినేంద్ర భక్తుడైన మల్లియరేచన కంటె భీమేశ్వర భక్తుడైన వేములవాడ భీమన రచించుట సహజము. ఉపరి, మల్లియ రేచనకు ఎక్కటిపడియందు "కమలా ధీశా!" అని, భూనుత వృత్తము నందు "శ్రీనివాస!" అని, శిఖరిణీవృత్తమునందు "పురారాతి స్పర్థి" అని, విచికిలస్తబకవృత్తము నందు "శబర వికృతిధర! పురహర!" అని సంబుద్ధులు కలవు. ఇట్టి వింకను కలవు. ఇది కూడ జినేంద్రభక్తుడైన మల్లియ రేచన కంటె, భీమేశ్వరభక్తుడైన వేములవాడ భీమనయే రచించుట సహజము. మల్లియ రేచనకు అక్కిలివడి సీసము నందు "సత్కవి" అనియేగాక, చంద్రశ్రీవృత్తము నందు "కవీంద్రేంద్రక్ష్మాజా!" అనియు, దోషాధికారము

నందు "కవీంద్రకల్ప మహీజా!" అనియు సంభావనములు కలవు. కనుక మల్లియ రేచన వేములవాడ భీమకవికి కల్పతరువు కావచ్చును. అది కారణముగ మల్లియ రేచన రచించినట్లు వేములవాడ భీమన కవిజనాశ్రయమును రచించుట సంభవము. అతి రహస్యము బట్టబయలు గనుక లాక్షణికులు "భీమన ఛందము" అనుట సంగతము.

మల్లియ రేచన కాలము తెలియుటకు నిర్ధారక సాధనము లేదు. వేములవాడ భీమకవి కాలమునకు ఇంతవరకు నిర్వివాద సమన్వయము లేదు. మల్లియ రేచన మాట మఱొక గ్రంథము నందు కానరాదు. వేములవాడ భీమన ప్రసక్తి ప్రథమతః శ్రీనాథుని కాశీఖండము నందు కలదు (ప. 13, ఆ. 1). కవిజనాశ్రయములోని "అమరంగ" అను పద్యము ప్రథమతః మడికి సింగన సకల నీతి సమ్మతము నందు కలదు (ప. 24, ఆ. 1). అది మల్లియ రేచన కవిజనాశ్రయము నుండి అని గాని, భీమన ఛందము నుండి అని గాని లేదు. పద్యము మాత్రము కలదు. శ్రీనాథుని కాశీ ఖండము రచనాకాలము 1433వ సంవత్సరము.[1] మడికి సింగన సకల నీతి సమ్మతము రచనా కాలము పదునైదవ శతాబ్ది పూర్వార్ధము కావచ్చును.[2] కనుక, కవిజనాశ్రయము రచనా కాలము పదునైదవ శతాబ్దికంటె పూర్వము. పదునైదవశతాబ్ది పూర్వార్ధములోని విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణి, అనంతామాత్యుని ఛందోదర్పణము అను లక్షణ గ్రంథము లందు కవిజనాశ్రయము ప్రసక్తి లేదు. కనుక కవిజనాశ్రయము రచనా కాలము పదునైదవ శతాబ్దికిబహు పూర్వము కాకపోవచ్చును. కాగ,

వేటూరి ప్రభాకర శాస్త్రిగారి అభిప్రాయమిది[3]:

"ద్రావిడ భాషలో "యాప్పెరంగలమ్" అను ఛందో గ్రంథము పదునొకండవ శతాబ్దిదికలదు. అందు సంస్కృత కర్ణాటాంధ్ర ఛందస్సుల ప్రస్తావ మున్నది. "వాంచియార్ శెయిద వడఘుచందవుం" అని యందున్నది. అనగా వాంచియ రచించిన తెలుగు ఛందమును" జూచి తానా గ్రంథమును రచించినట్లు గ్రంథకర్త చెప్పుకొనుటలో గలదు. ద్రావిడ నిఘంటుకార్యాలయమున విద్వాంసులుగా నున్న శ్రీ మూ. రాఘవయ్యం గారిది గుర్తించిరి. శ్రీరంగ సామి సరస్వతిగారి వలన నిది విని శ్రీ రాఘవయ్యంగారిని గలిసికొని సరిగా విచారించితిని. వాంచియ యను నాంధ్ర ఛందః ప్రణేత మనకు దెలియరాకున్నాడు. ప్రాచీన ప్రతుల లిపిరీతిని బరిశీలించినారు వాంచియార్ అను పదము రేచియార్‌గా నుండదగు ననిరి. కొన్ని సంస్కృత శబ్దములు గూడ నందిట్లే వికృతిని బొరసియున్నవి. రేచియార్ అని యగునేని యా గ్రంథము రేచియ (రేచన) రచియించిన కవిజనాశ్రయమగును. ఆ ద్రవిడ గ్రంథకర్త జైనుడు. ఈ రేచియయును జైనుడే. ఇది యొక పొందిక యగును. ఇట్లగునేని కవిజనాశ్రయము పదునొకండవ శతాబ్దికి దర్వాతిది కాకపోవును. కవిజనాశ్రయము కాకున్నచో మఱి యేదో వాంచియ రచియించిన ఛందో గ్రంథ మొకటి యా కాలమున నుండె నని యా ద్రావిడ ఛందో గ్రంథము చెప్పుచున్నది. ఆ ద్రవిడ గ్రంథ రచనా కాలము నన్నయకు బూర్వమో పరమో స్పష్టముగా నాకు దెలియ రాలేదు. అతడు నన్నయ కంటె ప్రాచీనుడగునేమో!"

ఇందు తమిళ గ్రంథమైన "యాప్పెరంగలమ్" లోని "వాంచియార్ శెయిదవడఘు చందవుం" కవిజనాశ్రయము కావచ్చునని కలదు. "కవిజనాశ్రయము కాకున్నచో మఱి యేదో వాంచియ రచించిన ఛందో గ్రంథము"ను కావచ్చునని కూడ కలదు కాని,

నిడుదవోలు వేంకటరావుగారి నిర్ణయమిది :

"అఱవ భాషలో బండ్రెండవ శతాబ్దికి పూర్వము వెలసిన ఛందో గ్రంథములలో "యాప్పెరుంగలమ్ కారికై" అనునది చాల ప్రసిద్ధమైనది. ఇదికారికారూపముగ నున్నది. దీనికి నొక వృత్తి గూడ గలదు. అందు అఱవభాషాఛందో లక్షణ గ్రంథములేగాక కర్ణాటాంధ్రచ్ఛందో గ్రంథములుకూడ పేర్కొనబడి యున్నవి. అందుండి మనకు గావలసిన భాగము నిందుదాహరించుచున్నాడను. "వీని నంతయు చరణాశ్రయ మను జయదేవమును మిశ్రాకృతి యను (మిధ్యాకృతియును) పింగళమును, మాపింగళము, రణమా మంజూషా చంద్రకోటిచ్ఛందస్సును, గుణహాంకి యనెడి కర్ణాటక ఛందమును, రేచి (కొ) యారు శెయ్‌ద వడుగచ్ఛందమును అయిన వానిలోను మా. పురాణము మొదలైన అఱవ గ్రంథములలోను ప్రవేశముగల వారి

నడిగి తెలుసుకొనునది. వీని నంతయు వివరించి చెప్పిన యెడల విస్తారమగును.

యాప్పరుంగళమ్, వృత్తి

యాప్పరుంగలమ్ కారిక — పు. 490

* పై వానిలో రేంచియారు తెలుగు వడుగచ్చందము, అనునదియే రేచన కవిజనాశ్రయము వడుగచ్చందము అనఁగా తెనుఁగు ఛందము. కాఁబట్టి ఈ ఛందస్సు క్రీ. శ. 12వ శతాబ్దికి ముందే రచితమైనదని చెప్ప నొప్పును.''

ఇందు "యాప్పరుంగలమ్ కారిక" యందుఁగాక "యాప్పరుంగళమ్ వృత్తి" యందు, "వాంచియార్" అని కాక "రేచి (కొ) యార్" అని ఉన్నదని, అది "రేంచి యార్" అని, కనుక రేచన కవిజనాశ్రయ మని కలదు. అంతేకాదు. "యాప్పరుంగలమ్ కారిక" వెలసిన కాలము పండ్రెండవ శతాబ్దికి పూర్వ మని కలదు. "యాప్పరుంగళమ్ వృత్తి" వెలసిన కాలము లేదు. "యప్పరుంగలకారికై" అను ఛందోగ్రంథమును రచించిన అమృత సాగరుడు "యాప్పరుంగల విరుత్తి" కూడ రచించినట్లు ప్రసిద్ధి కెక్కెనని జె. యమ్ సోమసుందరంపిళ్లెగారి అభిప్రాయము.[5] అనగా నిర్ధారకము కాదని అర్థము. కనుక, ''యాప్పరుంగల-విరుత్తి" రచనాకాలము పండ్రెండవ శతాబ్ది కంటె తర్వాతను కావచ్చును. కర్తృ కాలములు నిశ్చయముగ తెలియని "యాప్పరుంగల విరుత్తి" ని బట్టి కవిజనాశ్రయము కర్తృ కాలములు నిర్ణయించుట కేవలము కల్పనా గౌరమునకు తావలము.

మఱి కవిజనాశ్రయము రచనా కాలము నిర్ణయించుటకు మార్గాంతరము లేకపోలేదు. అది కవిజనాశ్రయము లోని అంతరంగిక ప్రమాణముల అనుశీలనము. బలహీనమైన బహిస్సాక్ష్యము కంటె అంతస్సాక్ష్యము బలీయము.

జయంతి రామయ్య పంతులుగారి అభిప్రాయ మిది:

"గ్రంథ నిర్మాణ కాలమును నిర్ణయించుటకుఁ గొంత వఱ కనుకూలపడు నంశములు రెండు కవిజనాశ్రయము నందే కలవు. ఈ గ్రంథము నందుఁ బదివిధములగు యతులు చెప్పఁబడినవి. కావ్యాలంకారచూడామణి యందుఁ బదిరెండు వళ్ళు చెప్పఁబడినవి. "అనంతుఁడిరువది నాల్గు విశ్రమములు నా మీఁదఁ గొందరు కవిగ్రామణు లిరువది యేడును" విశ్రమములఁ జెప్పినట్లప్పకవిచెప్పియున్నాఁడు. యతుల సంఖ్య కాలక్రమమున వృద్ధియైనట్లు దీనివలనఁ దెలుచున్నది. కవిజనాశ్రయములోఁ జెప్పఁబడిన యతుల సంఖ్య యన్నింటికంటెఁ దక్కువది, కావున, నా గ్రంథమే యన్నింటిలోఁ బ్రాచీన మైనదని యూహింపవచ్చును.

మఱియు నీ గ్రంథమున మధ్యాక్కరకు బ్రతిపాదము నందు నాల్గవ గణము మొదట యతి విధింపఁబడినది (ఇది లక్ష్యమునుబట్టి గ్రహింపఁదగు) ఇది యాధునిక మతము నన్నయభట్టు కాలమున యతి యయిదవగణము మొదట నుండినట్లు భారతము వలన విశదమగును. తిక్కన సోమయాజి కవిత్వములో మధ్యాక్కరలు నాకుఁ గనఁబడ లేదు. కాని, యెఱ్ఱాప్రెగడ కృతమగు నారణ్య పర్వశేష మందు యతి చతుర్థ గణాది యందెయున్నది. ఈ మార్పు నన్నయభట్టునకు నెఱ్ఱాప్రెగ్గడకును మధ్య కాలములోఁ గలిగి యుండ వలయును. ఈ రెండు హేతువులంబట్టి భీమన నన్నయ భట్టు తరువాతి వాఁడును, విన్నకోట పెద్దనకుఁ బూర్వుఁడును నైనట్లు తేలుచున్నది".

ఇందు మొదటి హేతువునుబట్టి కవిజనాశ్రయము తెలుగు లక్షణ గ్రంథము లన్నిటిలో ప్రాచీనమైన దనుట నిర్వివాదము. రెండవ హేతువును బట్టి కవిజనాశ్రయకర్త (భీమన) నన్నయభట్టు తర్వాతివాడును, విన్నకోట పెద్దనకు పూర్వుడును అగుట కూడ నిర్వివాదము.

వజ్ఝల చినసీతారామశాస్త్రి గారి అభిప్రాయమిది[7]:

"మహాకవుల లక్ష్యములను బట్టియే లక్షణములు చెప్పఁబడుట లక్షణశాస్త్ర సంప్రదాయమగుటంజేసి నన్నయాక్కరలకు విలక్షణముగాఁ జతుర్థ గణాదిని యతిని నిల్పవలెనని చెప్పుచున్న కావ్యాలంకార చూడామణి చతుర్థగణాదిని యతిని బ్రయోగించి యున్న యెఱ్ఱాప్రెగడకుఁ దర్వాతిదె యని నొక్కి వక్కాణింపఁ దగియున్నది."

ఇందు "కావ్యాలంకార చూడామణి" అనునది కవిజనాశ్రయమునకు ప్రమాణ పతితము కావలయును. కావ్యాలంకార చూడామణి ఎట్లును ఎఱ్ఱనకు తర్వాతి గ్రంథమే. మధ్యాక్కర పద్యము నందు చతుర్థగణాదిని యతిమైత్రిని ఉపదేశించిన కవిజనాశ్రయము కూడ ఎఱ్ఱనకు తర్వాతి గ్రంథము కావలయును. కాని,

జయంతి రామయ్య పంతులుగారి అభిప్రాయమిది[8]:

"లక్ష్యములనుబట్టి లక్షణమేర్పడుటశాస్త్ర సంప్రదాయమనుట నిర్వివాదాంశమే. కాని యీ లక్షణమున కాధారము లయిన లక్ష్యము లేవియై యుండునో యనునది మిక్కిలి జాగరూకతతోఁ బరిశీలింపవలసినవిషయము. ఏదియో యొక్క పద్యమును బట్టి లక్షణ కర్తలు లక్షణ మేర్పరచియుందురనుట సాహసము. సుప్రతిష్ఠిత మైన లక్ష్యసంప్రదాయమేర్పడియుండినఁ గాని యది లక్షణమున కాధారము కానేరదు. ఎఱ్ఱాప్రెగడ పద్యము తప్ప వేఱు పద్యములు మన కిప్పుడు కనఁబడకుండుటచేఁ బూర్వము లేవని నిర్ణయించుట సముచితముకాదు. యుద్ధమల్లుని శాసనముదొరకకపూర్వము ప్రాచీన సంప్రదాయమునకు నన్నయ భట్టారకు పద్యములే కద యాధారముగా గణింపఁ బడుచుండెను?

మఱియు లక్ష్యములే యొకటి లక్షణమున కాధారము లయి యుండినను నా లక్షణము పుట్టిన పిదప బయలుదేఱు లక్ష్యముల కాలక్షణమే విధాయకమగు ననుమాట యనుభవ సిద్ధము. శ్రీ శాస్త్రిలుగారు పద్యములు చెప్పినప్పు డప్పక వ్యాధి లక్షణ గ్రంథముల ననుసరింతురు గాని పూర్వకవి ప్రయోగముల వెదకరుగదా! అలాగుననే తన కాల మందుఁ బ్రచారములోనున్న లక్షణము ననుసరించియే యెఱ్ఱాప్రెగ్గడ పద్యము చెప్పెనని యేల యూహింపరాదు?"

ఇట్లు కూడ ఊహింప వచ్చును. కాని,

ఎనిమిదవ లేక తొమ్మిదవ శతాబ్ది యుద్ధమల్లుని బెజవాడ శాసనమునందు అయిదుమధ్యాక్కరలుకలవు.అయిదు మధ్యాక్కర లందును అయిదవ గణాదినే యతిమైత్రి కలదు. నన్నయ భారతము నందు సుమారు నలభై (39) మధ్యాక్కరలు కలవు. అన్ని మధ్యాక్కర లందును అయిదవ గణాదినే యతిమైత్రి కలదు. నన్నయ తర్వాత కావ్యము లందే కాదు, శాసనము లందును మధ్యాక్కర పద్యము మచ్చునకు కానరాదు. అంతే కాదు. ఎఱ్ఱన ఇతర కృతు లందును మధ్యాక్కర పద్యములేదు. ఉపరి, ఎఱ్ఱన తర్వాతి ప్రాచీన కావ్యము లందును మధ్యాక్కర పద్యము లేదు. అనగా మధ్యాక్కర పద్య రచన నన్నయ అనంతరమే ఆగిపోయినదని అవగాహన మగును. ఎఱ్ఱన అరణ్యపర్వశేషము నందు మాత్రము మధ్యాక్కర పద్యరచన కలదు. అందుకు హేతువు కలదు. "నన్నయభట్ట మహాకవీంద్రు సరస సారస్వతాంశ ప్రశస్తి దన్నుఁ జెందుటయు సాధుజనహర్షసిద్ధిఁ గోరి, ధీరవిచారుఁడు దత్కవితా రీతియుఁ గొంత దోఁపఁ ద్రచనయుగా నారణ్య పర్వశేషము పూరించెను" (వ 469, 70, అ.7) నన్నయ రచన అగునట్లు ఎఱ్ఱన అరణ్యపర్వ శేషమును రచించెను గనుక, అరణ్య పర్వశేషము నందు మధ్యాక్కర పద్య రచన అవశ్యకము. ఎఱ్ఱన "ధీరవిశారదుడు" గనుక మధ్యాక్కర పద్యమధ్యమునకు యతిమైత్రిని మార్చుట సంభవము. యతిమైత్రిని మార్చినను మధ్యాక్కర పద్యరచన "కొంత" నన్నయ కవితారీతి తోచునట్లు చేయును. అరణ్య పర్వశేషములోని ఎఱ్ఱన మధ్యాక్కర పద్య రచన జీర్ణోద్ధారము, అరణ్య పర్వశేషము నందు ఒక్క మధ్యాక్కర ఉన్నను, అందలి చతుర్థ గణాది యతిమైత్రి అనగా మొదటి దళము మొదటి అక్షరమునకు,రెండవ దళము మొదటి అక్షరమునకు యతిమైత్రి సరసము, అది చూచిన లాక్షణికుడు చతుర్థ గణాది యతిమైత్రిని నిర్దేశించుట సహజము. కనుక, నన్నయ మధ్యాక్కరలలోని అయిదవగణాది యతిమైత్రిని గాక, ఎఱ్ఱన మధ్యాక్కరలోని చతుర్థ గణాది యతిమైత్రిని నిర్దేశించిన కవిజనాశ్రయము ఎఱ్ఱన అరణ్య పర్వ శేషము కంటె అనంతర గ్రంథ మగుటయే సంభవము. అంతేకాదు.

నన్నయ భారతము నందు క్రౌంచ పద వృత్తము లేదు. "నన్నె చోడుని కుమార సంభవము" నకుంచి, పాల్కుతికి సోమనాథుని అనుభవ సారము నందు క్రౌంచ పద వృత్తము కలదు. తిక్కన భారతము నందును క్రౌంచ పద వృత్తము కలదు. పాలకుతికి సోమనాథుని అనుభవ సారములోని క్రౌంచ పదవృత్తమిది :

భక్తివినీతుల్ యుక్తిసమేతుల్ భవభయ విగళిత పశు
గణపూతుల్
వ్యక్తసుబుద్ధుల్ శక్తిసమృద్ధుల్ వ్యపగత కులచయ
వరసుఖ సిద్ధుల్
సూక్తి రసజ్ఞుల్ భక్తివిధిజ్ఞుల్ సురుచిరశుభకర సుకృత
మనోజ్ఞుల్
భుక్తివిరక్తుల్ ముక్తినియుక్తుల్ పురహరభక్తుల్ బుధ
వినుత మతుల్" -197

ఇందు అయిదవ అక్షరము తర్వాత ప్రాసయతి, పదవ, పదుసెన్మిదవ అక్షరముల తర్వాత యతిమైత్రి కలదు.

తిక్కన భారతములోని క్రౌంచపదవృత్తమిది-

కౌరవ సేనావీరులు లావుం గడిమియుఁజలమును గడఁక
యెలర్పన్
ధీరత సొంపుఁ గ్రూరత పెంపుం దెగువయు సెలఁగఁగ
దెరలక వీఁకన్
ఘోరనఁ ద్రోవంగా రథసంబేపును గలితనమును బాలుపు
వహింపన్
వారుభ...ంబుం గూరటకుం గావలసెను రుధిరము వద
...ము సేర్పన్ [- స్త్రీ ప. ఆ. 1, ప. 166]

ఇందు అయిదవ అక్షరము తర్వాత ప్రాసయతి, ... క్షరము తర్వాత యతిమైత్రికలదు.

కవిజనాశ్రయములోని క్రౌంచపదవృత్త లక్షణమిది:
"పంచశరాభా ! సంచితపుణ్యా ! భమసభననననయ పరి
మిళిమైనన్
గ్రౌంచపదాఖ్యంబంచితమయ్యెన్ గ్రమయతి దశవసు
కవితముగాఁగన్"

ఇందుగూడ అయిదవఅక్షరము తర్వాత ప్రాసయతి, పదవ, పదుసెన్మిదప అక్షరముల తర్వాత యతిమైత్రి లదు. యతిమైత్రికి లక్షణనిర్దేశము కలదు. ప్రాసయతికి లక్ష్య ప్రదర్శనము కలదు.

ఎఱ్ఱన హరి వంశములోని క్రౌంచపదవృత్త మిది:

సారవివేకా సౌఖ్యవిలోకా సకలరిపుభయద సముదసమీకా-
భాగమణీయా బంధువిధేయా పరహితకరుణా ఫలసదు
పాయా
ధీరచరిత్రా దీపితగోత్రా దివిజనగసదృశ ధృతియుత
గాత్రా
వీరవరేణ్యా విశ్రుతపుణ్యా వినయగుణ విజయవిలసన
గణ్యా

[- ఉ. భా. - ప. 259, ఆ. 9]

ఇందు అయిదవ, పదవ, పదుసెన్మిదవ అక్షరముల మీద, అనగా సర్వత్ర, యతిమైత్రియే కలదు. ప్రాసయతి ఎంత మాత్రమునులేదు. ఇది నన్నయ మధ్యాక్కరలకు వలె, తిక్కన సోమనాథుల క్రౌంచపదములకు ఎఱ్ఱన కావించిన మార్పు. ఇట్లు కవిజనాశ్రయములోని క్రౌంచపదవృత్త లక్షణములేదు. అందువలన కవిజనాశ్రయము ఎఱ్ఱన హరి వంశమునకు పూర్వగ్రంథమైనచో, ఎఱ్ఱన లక్షణవిరుద్ధముగ పద్యరచన చేసినవాడగును. అది కేవలము అసంగతము. అంతే కాదు. కవిజనాశ్రయములోని మధ్యాక్కర పద్య లక్షణము వలెనే, కవిజనాశ్రయములోని క్రౌంచపదవృత్త లక్షణమును విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణిలోను (2 ఉల్లా 8), అనంతామాత్యుని ఛందోదర్పణము నందును (ఆ. 2, ప. 111) కలదు. కవిజనాశ్రయకర్త, విన్నకోట పెద్దన, అనంతామాత్యుడు ఎఱ్ఱన అరణ్యపర్వశేషములోని మధ్యాక్కర పద్యమునకు లక్షణనిర్దేశము చేసి, ఆ ఎఱ్ఱన హరివంశములోని క్రౌంచపదవృత్తమునకు లక్షణనిర్దేశము చేయక పోవుటకు హేతువు కలదు. మధ్యాక్కరపద్యము నందు అయిదవగణాది యతిమైత్రి కంటె చతుర్థ గణాది యతిమైత్రి సరసము. క్రౌంచ పద వృత్తమునందు సర్వత్ర యతిమైత్రికంటె ప్రాసయతి తోడి యతిమైత్రి సరసము కనుక, అనంతామాత్యుని ఛందో దర్పణము వలె, విన్నకోట పెద్దన కావ్యాలంకార చూడామణి వలె, మల్లియరేచన పరమైన వేములవాడ భీమన కవిజనాశ్రయము★ ఎఱ్ఱనకు తర్వాతి గ్రంథ మగుట తథ్యము. ఎఱ్ఱన కాలము పదునాల్గవ శతాబ్ది పూర్వార్ధము. కనుక మల్లియరేచన పరమైన వేములవాడ భీమన కవిజనాశ్రయము రచనాకాలము పదునాల్గవ శతాబ్ది పూర్వార్ధము కంటె అనంతరము.

కవిజనాశ్రయము రచనాకాలము సకలనీతిసమ్మతము ను బట్టి పదుమూడవ శతాబ్ది కంటె పూర్వము. కవిజనాశ్రయములోని అంతస్సాక్ష్యమును బట్టి పదునాల్గవ శతాబ్ది పూర్వార్ధము కంటె అనంతరము. కనుక, కవిజనాశ్రయము రచనాకాలము పదునాల్గవ శతాబ్ది ఉత్తరార్ధము.

పదునాల్గవశతాబ్ది ఉత్తరార్ధమునందు మల్లియరేచన, వేములవాడ భీమన కలరా? మల్లియరేచన వణిగ్వంశ చూడామణి (దండకము). అనగా వైశ్యుడు. అంతే కాదు. జినేంద్ర భక్తుడు. అనగా జైనుడు. కనుక వైశ్యజైనుడు. పదునాల్గవశతాబ్ది ఉత్తరార్ధమున ఆంధ్రావనిలో వైశ్య జైనులు అంతర్ధానము కాలేదు. కనుక పదునాల్గవశతాబ్ది ఉత్తరార్ధమునందు మల్లియరేచన ఉండుట సంభవము. ఇక వేములవాడ భీమన భీమేశ్వరభక్తుడు. అనగా శివభక్తుడు. వీరశైవుడు గాడు. పింగళి సూరన రాఘవపాండవీయము నందు "దక్షుండెవ్వాండిల రామ భారతకథల్ జోడింప భాషాకృతిన్. భీమన తొల్లిచెప్పెనను పెద్దలమాటయె కాని యందు నొండేమియునేమొడన్నిలుచుటెవ్వరుఁగానరు" అని కలదు (అ. 1, ప॥లు 10, 11) పింగళి సూరన నాటికే ఖిలమైనను-రామభారత కథలు జోడించిన అనగా రాఘవ పాండవీయమును రచించిన వేములవాడ భీమన వీరశైవ కవి కాడు. కనుక వేములవాడ భీమన పదునాల్గవ శతాబ్ది ఉత్తరార్ధము నందు ఉండుట నిర్బాధకము. పింగళిసూరన తరువాత లింగమగుంట తిమ్మకవి రచించిన సులక్షణసారము నందు వేములవాడ భీమకవి పద్యములు మూడు కలవు.

1 "గరళపు ముద్ద లోహ మవగాఢ మహాశనికొట్లు సమ్మెటల్
హరునయనాగ్ని కొల్మి యురగాధిపుకోఱలు పట్టుకార్లు ది
క్కరటిశిరంబు దాయ లయకాలుఁడు కమ్మరి పైరివీర సం
హరణగుణాభిరాముఁడగు మైలభీమన ఖడ్గసృష్టికిన్" -134

ఇది అప్పకవీయము నందును ఇట్లే కలదు (అ. 3, ప. 77). ఇందలి మైలమ భీమన గురించి అంకను చాటు పద్యములు ఏడు కలవు.9 ఒక్క పద్యమును మైలమ భీమన కాలమును బట్టి యున్నది కాదు. రెండు పద్యములందు మాత్రము "మైలమ భీమభూప" అని కలదు. కనుక మైలమ భీమన పరిపాలకుడు మాత్రమేగాక క్షత్రియుడును కావచ్చును. అదటుంచి "భీమన చాటువు" నందు "పట్టుకార్లు" అను పదము ప్రయుక్తమైనది. ఇది దిక్సూచి కన్నడము నందు పటకారు, తెలుగులో పటకారు, పటుకారు అను పదములు వినా, ఇతర ద్రావిడభాషలందు ఇట్టి పదము లేనట్లు ద్రావిడవ్యుత్పత్తి కోశము నందు కలదు (అనుబంధము -యస్ 603). అంతేకాదు. గుజరాతీ భాషలోను పటకారు శబ్దము వ్యవహారప్రసిద్ధ మని కొంతకాలము అహమ్మదాబాద్ వాసిని అయిన డాక్టర్ కోలవెన్ను మలయవాసిని అందిచ్చిన సమాచారము. ఉపరి, కారుఖానా అను పదమునకు యంత్రాగార మని అర్థము. అందు ఖానా అను పదమునకు అగారమని అర్థము. కనుక కారు అను పదమునకు యంత్రమని అర్థము. పద్యములోని "పట్టుకార్లు" కమ్మరి కారుఖానా లోనివే. ఫత్‌కారు అను పారసీ పదము నుండి పటకారు అను పదము నిష్పన్నము కావచ్చును. అనగా పటకారు అన్యదేశ్యము. అది ఉచ్చారమున పటుకారు అగును. కవుల తెనుగు సేతను పట్టుకారు అగును. తెలుగుభాషలో అన్యదేశ్యములు పదమూడవ శతాబ్ది ఉత్తరార్ధము నుండి ప్రవేశించినవి. పటుకారు శబ్దము పదమూడవ శతాబ్ది ఉత్తరార్ధము నందు ప్రవేశించినను అది పటుకారు అగుటకు కొంతకాలము, పట్టుకారు అగుటకు మఱి కొంతకాలము పట్టును. అందువలన "పట్టుకార్లు" అను పదము ప్రయుక్తమైన పద్యము రచనాకాలము పదునాల్గవ శతాబ్ది కావలయును. కనుక ఖడ్గసృష్టికి పాముకోఱలు పట్టుకార్లు అయిన మైలమ భీమనకాలము, "పట్టుకార్లు" అను పదమును ప్రయోగించిన వేములవాడ భీమన కాలము పదునాల్గవ శతాబ్ది.

పదునాల్గవ శతాబ్దిని మైలమభీముఁ డేకపోలేదు. మైలమ భీమన అనగా మైలమ = మైలమ్మ కొడుకు భీమన. మైలమ్మ తండ్రి కావచ్చును, తల్లి కావచ్చును. నిడుదవోలు రాజధానిగ ఏలిన దేవపమ్మ కొడుకు భీముని తల్లిపేరు. "మయిలాంబ" అని ఒక అర్వాచీన మార్కండేయ పురాణంలోని వంశవృక్ష వర్ణనము నందు కలదు. మయిలాంబ అనగా మైలమ్మ. కనుక మయిలాంబ కొడుకు భీముడు మైలమ భీమన కాఁగలడు. అతడు పరిపాలకుడు మాత్రమే కాదు క్షత్రియుడు కూడ. అంతేకాదు అతడు "ఖడ్గమాత్ర సహాయుఁగరిమ నదరి ఖల్లాణభూధవుని సైన్యములను మడియించె" ననియును వంశవృక్ష వర్ణనము

నందు కలదు. అతడు "మైలమ భీముడై మహిఁ బ్రసిద్ధి వహించె" నని పూసపాటి తమ్మిరాజు కృష్ణ విజయమునందు, "మైలమ భీమాఖ్యమలయు చుండె" నని ఓరుగంటి సోమశేఖరకవి రామకృష్ణార్జునరూప నారాయణీయము నందు కలదు. అతని కాలము పదునాల్గవ శతాబ్ది ఉత్తరార్ధము. అది ముందు వివరింతును. కనుక వేములవాడ భీమకవి కాలము పదునాల్గవ శతాబ్ది ఉత్తరార్ధము.

2. "ఘనుఁడన్ వేములవాడ వంశజుఁడ దాక్షారామభీమేశ నం
దనుఁడన్ దివ్య విషామృత ప్రకటనానాకార్యధుర్యుండ భీ
మన నా పేరు వినంగఁజెప్పితిఁ దెలుంగాధీశ! కస్తూరికా
ఘనసారాది సుగంధ వస్తువులు వేగంబిచ్చి లాలింపురా"
-177

ఇట "నానాకార్య" అనుచోట "నానాకావ్య" అని, "వేగంబిచ్చి" అనుచోట "వేగం దెచ్చి" అని పాఠాంతరములు కలవు. ఇందు "వేములవాడ వంశజుడను, నా పేరు భీమన" అని కలదు. కావున ఇది వేములవాడ భీమ కవి పద్యమే. అంతే కాదు. ఇందు "ఉద్దండలీల" కలదు. ఇట్లు శ్రీనాథుని చాటు పద్యమును కలదు.

"అక్షయ్యంబుగ సోమవరాయుని తెలుంగాధీశ! కస్తూరికా
భిక్షాదానము సేయురా సుకవిరాడ్బృందారకవ్రాతికిన్
దక్షారామ చళుక్య భీమవర గంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయ కుంభికుంభములపై వాసించు దద్వాసనల్"

ఇందు శ్రీనాథుడు కస్తూరి కోరిన సోమవరాయని తెలుఁగాధీశుడు సంబు రాయల కొడుకు తెలుగురాయలు. అతని కాలము పదునైదవశతాబ్ది పూర్వార్ధము.[10] అతనికి పూర్వము మరొక తెలుగు నృపతి కలడు. అతడు మడికి సింగన ఆశ్రయదాత ముప్పయభూనాథుని తండ్రి.

"కూనయ ముప్పనృపాలక
సూనుశ్రీ తెనుఁగునృపతి సుదతీమల్లాం
బానందనుఁడగు ముప్పయ
భూనాథుని సుకవివరుఁడ బుధసన్నుతుఁడన్"
- వా. రా. -ఆ. 1, ప.

ఇందలి ముప్పయభూనాథుని మంత్రి వెలిగందల కందనామాత్యుడు. అతడు మడికి సింగన పద్మపురాణమునకు భాగవత దశమస్కంధమునకు కృతిభర్త.

"తత్కపితామహధామముఖతిలకంబగు వెలిగందల కందనామాత్యుండను నుత్తమరత్నంబున కుపాశ్రయుఁబగు రామగిరి పట్టణాధీశ్వరుండైన ముప్పడిక్షోణిపాలునియన్వయ గుణవిశేషంబు లెట్టివనిన - "
- పద్మ.- ఆ. 1., వ. పు.

ఇందు ముప్పడిక్షోణిపాలుడు రామగిరి పట్టణాధీశ్వరుఁడని కలదు. రామగిరి పట్టణాధీశ్వరుడైన ముప్పభూపతి తండ్రి తెలుగు నృపతి. అతడు "తెలుంగాధిపుడు".

మడికి సింగన కాలము పదునైదవశతాబ్ది పూర్వార్ధము. కనుక, మడికి సింగన ఆశ్రయదాత ముప్పభూపతి కాలము పదునైదవశతాబ్ది పూర్వార్ధము. ముప్పయభూపతి తండ్రి తెలుగు నృపతి కాలము పదునాల్గవ శతాబ్ది ఉత్తరార్ధము. పదునాల్గవ శతాబ్ది ఉత్తరార్ధములోని తెలుగునృపతిని "కస్తూరికాఘనసారాది సుగంధవస్తువులు" కోరిన వేములవాడ భీమకవి కాలము పదునాల్గవశతాబ్ది ఉత్తరార్ధమే.

3. "చక్కఁదనంబు దీవియను సాహిణిమారఁడు మారుకీర్తి వడిన్
బొక్కిపడంగలండు చలమున్ బలముంగల యా చళుక్యపుం
జొక్కన్న సోమ్ము గుఁడయి చూపక్కల మంటలురాలఁజూడుమీ
మిక్కిలి రాజశేఖరనిమీఁదికి వచ్చిన రిత్తపోవునే" 126

ఇది అప్పకవీయములోను ఇట్లు కలదు (ఆ. 2, ప 371)- సులక్షణసారము నందు పద్యమునకు ముందు "వేములవాడ భీమకవి" అని మాత్రమే కలదు. అప్పకవీయము నందు "వేములవాడ భీమకవి పదునొకండవ పోటుహాకారంబు నిలిపి మూఁడు గడియలకు రామగిరి దుర్గమున ముత్తిక దిగిన మారని జావఁదిట్టిన చాటుధార" అని కలదు. ఇందు పద్యములోని సాహిణిమారడు "రామగిరి దుర్గమున ముత్తిక దిగిన మారడు" అను మాట గమనార్హమైన విశేషము. 'ముత్తిక దిగిన" అనగా ముక్తికే దండెత్తి వచ్చిన

అని అర్థము. సాహిణి మారడు దండెత్తి వచ్చిన రామగిరి దుర్గమునకు అధిపతి చాళుక్య చొక్కనృపాలుడు. చొక్క నృపాలునికి వేములవాడ భీమకవికి సంబంధించిన చాటుపద్యములు మరి రెండు కలవు. 11

1. 'ఆ సీతాభ్ర్యవధాన శృంఖల ప్రవాహాభ్యాలంబిత స్తంభమా
నేనే వేములవాడ భీమకవి నేనిం జిత్రకూటంబులో
భూనవ్యాపిత పల్లవోద్భవ మహాపుష్పోపగుచ్ఛంబులన్
నానాపక్వ ఫలప్రదాయివగుమా నాకల్పవృక్షాకృతిన్"

2 "శంభువరప్రసాదకవి సంఘవరేణ్యుఁడనైన నా వచో
గుంభన చేరుసెంతా యనుకూలతనొంది తనూనభావనన్
గుంభినిఁజొక్క నామనృపకుంజరుపందిటి మల్లెసోఁకున్
స్తంభమురీతి నీతనువుఁ దాలిచియొప్పటియట్ల యుండుమా"

ఇందు మొదటిపద్యము నందు "నేనే వేములవాడ భీమకవి నేనిన్" అని కలదు. రెండవ పద్యము నందు "శంభువరప్రసాద కవి సంఘవరేణ్యుఁడనైననా" అని కలదు. "దక్షారామ భీమేశనందను"డైన వేములవాడ భీమకవి "శంభువరప్రసాద కవి సంఘవరేణ్యు" డగుట సహజము. రెండవపద్యమునందు "చొక్కనామ నృప కుంజరు" అని కలదు. అతడు చాళుక్య చొక్కనృపాలుడే అగును. అంతేకాదు, మొదటి పద్యమునందు భీమకవికి చొక్క నృపాలునికి సంబంధించిన కథారంగము చిత్రకూటమని కలదు. చిత్రకూటమున రామగిరియే. "రామ గిరిరితి చిత్ర కూట." అని మల్లినాథసూరి వ్యాఖ్య (మే. సం.-శ్లో 1): కనుక చాళుక్యచొక్కనృపాలుడు రామగిరి దుర్గాధిపతియే.

ఇక సాహిణిమారడు. ఒక సాహిణిమారడు కాకతి ప్రతాపరుద్ర చక్రవర్తి సేనాధిపతి ప్రసిద్ధుడు. అతడు రామగిరి మీద దండెత్తవలసిన అవశ్యకము కానరాదు. కారణము రామగిరి కాకతీయ సామ్రాజ్యము లోనిది అంతేకాదు. సామ్రాజ్యాధిపతి కంటె దుర్గాధిపతి బలవంతుడైన రాజ శేఖరుడు కాజాలడు. కనుక రామగిరి దుర్గము మీద దండెత్తి వచ్చిన సాహిణిమారడు ప్రతాపరుద్రుని సేనాధిపతి కాడు. మఱొకడు కావలయును. అతడైన రామగిరి దుర్గము మీదికి దండెత్తి వచ్చుట కాకతీయ సామ్రాజ్య పతనానంతరమే సంభవము. సాహిణి మారడు సేనాధిపతి. చొక్కనృపాలుడు దుర్గాధిపతి. సేనాధిపతుల, దుర్గాధిపతుల చరిత్ర సర్వస్వము దుర్లభము. అయినను తెలుగు నృపతి రామగిరి పట్టణాధీశ్వరుడగుటకు పూర్వము చాళుక్య చొక్కనృపాలుడు రామగిరి దుర్గాధిపతి అగును. తెలుగు నృపతి కాలము పదునాల్గవ శతాబ్ది ఉత్తరార్ధము కావచ్చును. ఇది కొలిదశ, అది మలిదశ అగును. కనుక వేములవాడ భీమకవి కాలము పదునాల్గవ శతాబ్ది ఉత్తరార్ధమే.

ఇక వేములవాడ భీమకవికి కళింగగంగుకు సంబంధించిన చాటుపద్యము లివి 12 :

1. శాపానుగ్రహ పటువును
బాపాడెడి కవులనెత్తి బంపం బనఁగా
భూపాల సభలఁ బూజ్యుఁడ
నా పేరే భీముఁడండ్రు నరవర వినుమా

2. "వేములవాడ భీమకవి వేగమె చూచి కళింగగంగు తా
సామమువూని కోపమున సందడిదీఱిన రమ్ము పొమ్మనెన్
మోమును జూడ దోషమిఁక ముప్పదిరెండు దినంబులావలన్
జామున కర్థమందతని సంపద శత్రులఁజేరుఁ గావుతన్"

3. "వేయి గజంబులుండఁ బదివేలు తురంగములుండ నాజిలో
రాయలగెల్చి సజ్జనగరంబునఁ బట్టముఁగట్టుకోవడిన్
రాయకళింగగంగు కవిరాజభయంకరమూర్తి చూడఁడా
బోయెను, మీనమాసమునఁ బున్నమపోయిన షష్ఠినాటికిన్"

ఇందు మొదటిపద్యము నందు "నాపేరు భీముఁడండ్రు' అని కలదు. రెండవ పద్యమునందు "వేములవాడ భీమకవి" అని కలదు. అందు "కళింగగంగు" అని కలదు. మూడవ పద్యమునందు "రాయకళింగగంగు" అని కలదు. అంతే కాదు - "రాయలగెల్చి" అని కలదు. శాపానుగ్రహ కథ నటుంచి, వేములవాడ భీమకవి కళింగగంగు దర్శ

నార్థము పోవుట, కళింగగంగు తర్వాత రమ్మనుట, అందుకు భీమకవి తిట్టుకొనుట, అనంతరము కళింగగంగు రాజ్యసంపద శత్రురాజుపాలగుట, తదుపరి కళింగగంగు శత్రురాజైన రాయలను గెలిచి, సజ్జనగరము నందు పట్టము గట్టుకొనుట, అప్పుడు మరల వేములవాడ భీమకవి చూడబోవుటమాత్రము చారిత్రిక సత్యము కావలయును.

కళింగగంగు అనగా కళింగ దేశాధిపతి అయిన గాంగ వంశ రాజు. గాంగ వంశరాజులు కళింగదేశమును ఆరవ శతాబ్ది ఆరంభము నుండి పదునైదవ శతాబ్ది మధ్యకాలము వరకు (610-1435) పరిపాలించుట చరిత్ర ప్రసిద్ధము.[13] వారి రాజధాని కళింగ నగరము అప్పటి ముఖలింగము.[14] ఇక రాయలు - వ్యస్తముగ "రాయలు" అను వ్యవహారము విజయనగర రాజులకు వినా ఇతర రాజులకు చరిత్రప్రసిద్ధము కాదు. ఒక విజయనగర రాజు కళింగదేశాధిపతి అయిన గాంగవంశ రాజును జయించుట, కళింగదేశాధిపతి అయిన గాంగవంశ రాజు మరల విజయనగర రాజును జయించుట చరిత్రకు అందని విషయము కాదు. అందు సజ్జనగరమును అన్యభాషను అలతిగ రూపాంతరమునంది సాక్షాత్కరించును. ఆ చారిత్రాత్మక సంఘటన మిది [15]:

"విజయనగరమునకు సంబంధించిన యాదవ వంశ రాజులు బంగాళాఖాతపు తూరుపుతీరమైన దక్షిణభాగము (కళింగదేశము)నంతటిని జయించిరి. విజయనగర రాజైన మొదటి బుక్కరాయల మేనల్లుడు సంగమయువరాజు 1359 లో గజపతిని జయించెను. ఇది హిందువులైన విజయనగర రాజులకు ఉత్కళరాజులకు మధ్య జరిగిన యుద్ధమునకు మొట్టమొదటి లిఖితపూర్వకమైన సాక్ష్యము కలది. పోర్చుగీసు రచయిత ఫెర్నొన్యూనిజ్ బుకరవు అనగా బుక్కరాయలు, వంగదేశము వరకును వ్యాపించినట్టి, మిక్కిలి గొప్పదైనట్టి ఉత్కళరాజ్యమును ఆక్రమించె"నని తెలుపును. ఫిరోజ్ తుగ్లక్ వంగదేశముమీదికి రెండవసారి దండయాత్ర సాగించిన కాలమునందు ఉత్కళదేశమును ముట్టడించెను. "తారిఖ్-ఇ-ఫిరుజ్-షాహి" లోని దీనికి సంబంధించిన భాగమును షమ్స్-ఇ-సిరజ్ అఫిఫ్ చేత మేజర్‌రావర్టీ తర్జుమా చేయించెను. ఆ భాగము నందు జాజ్‌నగర్ ప్రాంతము సరిగా తెలుపబడినది ... హైహయ రాజు జాజ్‌నగర్ విడిచి పెట్టి తెలంగాణమునకు పారిపోయెను .... ఇది 1361 లో జరిగినది. మూడవభానుదేవుని పరిపాలన తొలిదశలోని శాసనములు మూడు మాత్రమే శ్రీకూర్మము నందు లభించినవి. అతని కొడుకు నాల్గవ నరసింహదేవుని మూడవ అంక 1379 వ సంవత్సర మగుటవలన మూడవ భానుదేవుడు అంతకు ముందు సంవత్సరము 1378 లో మరణించి యుండును.

ఇందు విజయనగర రాజైన మొదటి బుక్కరాయల మేనల్లుడు సంగమ రాయలు 1356వ సంవత్సరము నందు కళింగదేశాధిపతి అయిన గాంగవంశరాజును జయించినట్లు, బహమనీ సుల్తానైన ఫిరోజిషహా దండయాత్ర చేసినపుడు 1361 వ సంవత్సరము నందు జాజ్ నగరపాలకుడైన హైహయరాజు జయింపబడినట్లు, కలదు. అతడు సంగమరాయలే అగును. కళింగదేశము దక్షిణభాగము జాజ్‌నగర ప్రాంతము. జాజ్‌నగరము సజ్జనగరమునకు అన్యభాషలోని రూపాంతర మగుటకు శబ్దసంగతి కలదు. సజ్జనగరము సజ్జానగరమై, చజ్జానగరమై, జజ్జా నగరమై, జాజ్‌నగర్ అగుట సుసంగతము. విజయనగరరాజును జయించుటకు గాంగవంశ రాజు బహమనీ సుల్తాను పక్షము వహించుట సహజము. అది సామాన్యమైన రాజనీతి. 1356లో పోయిన కళింగదేశము దక్షిణభాగము 1361 లో తిరిగి సంక్రమించినపుడు గాంగ వంశ రాజు జాజ్ నగర్‌లో అనగా సజ్జనగరము నందు పట్టము గట్టుకొనుట కూడ సహజము. కళింగ దేశము దక్షిణభాగమునకు సజ్జనగరము విజయనగరరాజు పరిపాలన కాలమున (1356-61) రాజధాని. మొత్తము కళింగ దేశమునకు ముఖ్యనగరము ముఖలింగము. ముఖలింగము పుణ్యక్షేత్రముకూడ. క్షేత్రదైవములు మధుకేశ్వరుడు, అనియంక భీమేశ్వరుడు, సోమేశ్వరుడును. భీమేశ్వర భక్తుడైన వేములవాడభీమకవి ముఖలింగ క్షేత్రమునకు తీర్థయాత్రలు చేయుటసహజము. అప్పుడు, అక్కడి రాజును దర్శించుటకు ప్రయత్నించుట అంతకంటె సహజము. అది విజయనగరరాజు దండయాత్ర సందడికాలము నందు కళింగ నగరమున విఫలమగుట, కళింగదేశ దక్షిణభాగ సంక్రమణ కాలము నందు సజ్జనగరమున సఫలమగుట కూడ సహజము. అందు వలన వేములవాడ భీమకవి సందర్శించిన కళింగగంగు కళింగదేశాధిపతి అయిన గాంగవంశ రాజు మూడవ భానుదేవుడు, కళింగగంగు జయించిన రాయలు విజయనగర రాజైన మొదటి బుక్కరాయల

మేనల్లుడు సంగమరాయలు అగుదురు. కళింగగంగు రాజ్య సంపద శత్రురాజుల పాలై నకాలము 1356వ సంవత్సరము. కళింగగంగు రాయలను గెలిచి సజ్జనగరము నందు పట్టము గట్టుకొన్న కాలము 1361 వ సంవత్సరము. కనుక వేములవాడ భీమకవి కాలము పదునాల్గవ శతాబ్ది ఉత్తరార్ధమే.

మఱి శాపానుగ్రహకథలోని కళింగగంగుదేశాటనము, భిక్షాటనము, రంగస్థల నటనము కేవలము అభూతకల్పనలు. పరసహాయప్రయత్నము దేశాటనము. పరదేశరాజాశ్రయము భిక్షాటనము. రాజనీతిచాతురి రంగస్థల నటనము. మొదటి పద్యములోని ముప్పదిరెండు దినములు కళింగగంగును జయించుటకు పట్టిన కాలము. రెండవ పద్యములోని మిన్న మూస [illegible] కళింగగంగు పట్టణగిరము పట్టము గట్టుకొన్న కాలము. [illegible] పరిగణనము [illegible] [illegible] [illegible] వలె. ఆదరించినచో పొగడుట, ఆదరించనిచో తిట్టుట కవులకు పరిపాటి. తిట్టే శాపము. పొగడ్తే అనుగ్రహము.

ఇక భీమకవి నృసింహపురాణములోనిదను పద్య మిది[16]:

"వాండిమి నల్లసిద్ధి జనవల్లభుఁడోర్చుస రాజు భీరుఁడై
యాంధ్రుడను గానుఁడు నృపఖాండము పెట్టికొనంగఁ జూచితో
నేండిదియేమి నీవనుచు నెచ్చెలులెల్ల హసింప నంతలో
మూండవకంటితోడి దొరమూర్తి వహించిన ప్రమొక్కిరం గనల్"

ఇందు నల్లసిద్ధిరాజు వర్ణన కలదు. ఇది నృసింహపురాణములోని పద్యమైన అవతారికలోని పద్యమగును. అవతారికలోని పద్యము కృతిభర్త వంశవృక్ష వర్ణనములోని పద్యమగును. కనుక నల్లసిద్ధిరాజు వేములవాడ భీమకవి రచించిన నృసింహపురాణమునకు కృతిభర్త అయినవాని వంశవృక్షములోని వాడగును. కృతిభర్తయే కావలసిన ఆవశ్యకము లేదు. కృతిభర్త వంశవృక్షములోనివారెల్లరకును కృతికర్త సమకాలికుడు కాడు. కనుక నల్లసిద్ధిరాజు కాలము వేములవాడ భీమకవి కాలము కావలసిన ఆవశ్యకము లేదు. అనగా నృసింహపురాణములోనిదను పద్యము వేములవాడ భీమకవి కాలము నిర్ణయించుటకుఅసమర్థము.

మఱి వేములవాడ భీమకవి చాటువని ప్రసిద్ధమైన పద్య మిది :

హయమది సీత పోతవసుధాధిపుఁ డారయ రావణుండు ని
శ్చయముగ నేను రాఘవుఁడ జాహ్నవి వారిధి మారుఁ డంజనా
ప్రియతనయుండు సింగన విభీషణుఁడా గుడిమెట్ట లంక నా
జయమును పోతరక్కసుని చావును నేఁడవనాఁడు చూడుఁడీ

ఇది లింగముగుంట తిమ్మకవి సులక్షణసారము నందు వెల్లూరి తిరుమలయ్య పద్యమని కలదు (22). అప్పకవీయము నందు "వెల్లూరి తిరుమలయ్య ఆలప చోటను తకారంబు నిలిపి తన గుఱ్ఱమును దొంగిలించిన శ్రీపతిరాజు పోతరాజును నేడు దినములకుం జావఁదిట్టిన చాటుధార" అని కలదు ( ఆ.2, ప. 376).కనుక వెల్లూరి తిరుమలయ్య పద్యము వేములవాడ భీమకవి కాలము నిర్ణయించుటకు అవిషయము.

ఇంకను భీమకవి శతకంధర రామాయణము నుండి, సుమతీశతకము నుండి, హరవిలాసము నుండి లాక్షణికులు ఉదాహరించిన పద్యములు కలవు.[17] అవియెల్ల వేములవాడ భీమకవి కాలము నిర్ణయించుటకు అనుపయోగము.

ఇతరచాటు పద్యములును కాలనిశ్చాయకములు కావు.

ఇక వేములవాడ భీమన రామగోపాల విలాసము రచించినట్లు పూసపాటివారి సీసమాలిక యందు కలదు.[18] అందు పూసపాటి వంశ మూలపురుషుడై మాధవవర్మ "వసు దిగింద్రియ శకవత్సరంబుల జయవాటికాదుర్గ వైభవముఁ గాంచె" నని కలదు. వసు = 8, దిక్ = 8, ఇంద్రియ = 5. 588 + 78 = 666. కనుక మాధవవర్మ కాలము ఏడవశతాబ్ది కావలయును. కాని కాదు. ఆనందగజపతి ఆస్థానపండితుడు మంగ చిట్టికామేశ్వరశాస్త్రి రచించిన మార్కండేయ పురాణములోని వంశవృక్షము నందు ప్రతాపరుద్ర గజపతికి సమకాలికుడైన తమ్మిరాజునకు మాధవవర్మకు మధ్య ఆరు తరములు కలవు. శ్రీకృష్ణదేవరాయల సమకాలికుడైన ప్రతాప

రుద్రగజపతి కాలము పదునారవశతాబ్ది పూర్వార్ధము. కనుక మాధవవర్మ కాలము పదమూడవ శతాబ్ది. ఉత్తరార్ధము కావచ్చును. ఏడవశతాబ్ది ఎంతమాత్రము కాదు. కనుక పూసపాటివారి సీసమాలికలోని కాలములు సరియైనవి కావు, ఆ సీసమాలిక యందు "వేములవాడ శ్రీభీమునిచే రామగోపాల చరితంబు గొనిన మేటి" అయిన దానరాజు "వత్సవాయిట చంద్రవర్మచే గిరినిధి గగనేందు శకములు గాన్క నొందె" నట్లు కలదు. గిరి = 7, నిధి = 9, గగన = 0, ఇందు = 1 = 1097 + 78 = 1175. కాని ఈ దానరాజు పూసపాటి "వంశభీమనృపాల సచివుండు దండనాథాగ్రణి" అని కూడ సీసమాలిక యందు కలదు. ఈ భీమనృపాలుడు మాధవవర్మ మనుమడు చిక్కభీముడు కాక మఱొకడు కాడు. తాత మాధవవర్మ కాలము పదమూడవశతాబ్ది ఉత్తరార్ధము కనుక మనుమడు భీమనృపాలుని కాలము పదునాల్గవ శతాబ్ది ఉత్తరార్ధము కావలయును. ఈ భీమనృపాలుడు మయిలాంబ కొడుకు. మైలమ భీముడు. కాలము పదునాల్గవశతాబ్ది ఉత్తరార్ధము. కనుక, భీమనృపాలుని సచివుడు, దండనాథుడు అయిన దానరాజు కాలము పదునాల్గవశతాబ్ది ఉత్తరార్ధమే అగును. కనుక దానరాజునకు రామగోపాల విలాసమును అంకిత మిచ్చిన వేములవాడ భీమకవి కాలము పదునాల్గవ శతాబ్ది ఉత్తరార్ధమే.

మఱి వేములవాడ భీమకవి సంస్కృతము నందు జ్యోతిషగ్రంథమును రచించినట్లు తెనిగించినజ్యోతిష గ్రంథము కలదు[19] అందు వేములవాడ భీమకవి "ప్రభవ వర్షంబున శ్రావణమాసంబు శుక్లపక్షంబున శోభనంబు మీఱ బంచమి శుక్రవారంబునను హస్తమందు గన్యాలగ్న మందు" జన్మించినట్లు కలదు. ప్రభవ నామసంవత్సర శ్రావణశుక్ల పంచమీ శుక్రవారము 1327వ సంవత్సరమునందు మాత్రమే కలదు. కాని నక్షత్రము హస్తకాదు. చిత్త. కనుక ప్రమాణము కాదనవచ్చును. కాని, పద్యము నందు శుక్రవారము హస్త అనిలేదు." శుక్రవారంబునను యందు "అనికలదు. ప్రభవనామసంవత్సర శ్రావణశుద్ధ హస్త చతుర్థి గురువారము నాడుఅనగా 26-7-1327 వ తేదిని సూర్యోదయము మొదలు "96" వఱకును హస్త కలదు. 20 96 = 24 గంటలు. అనగా ప్రభవనామ సంవత్సర శ్రావణశుక్ల పంచమీ శుక్రవారము అనగా 27-7-1327 వ తేదిని సూర్యోదయము వఱకు హస్త కలదని అర్థము. జననము సూర్యోదయాత్పూర్వమైన "హస్తయందు" అనియే చెప్పవలయును. "శుక్రవారంబునను హస్తమందు" అను తెలుగు జ్యోతిషగ్రంథములోని మాట అర్థవంతము. తెలుగు జ్యోతిషగ్రంథములోని వేములవాడ భీమకవి జనన కాలమునకు మూలము వేములవాడ భీమకవి రచించిన సంస్కృతజ్యోతిషగ్రంథము కావచ్చును. కనుక వేములవాడ భీమకవి జనన కాలము ప్రభవ శ్రావణశుక్ల పంచమీ శుక్రవారమే. 27-7-1327 వ తేదియే.

సమష్టిపై వేములవాడ భీమకవి కాలము 1327-1400.

పదునాల్గవ శతాబ్ది ఉత్తరార్ధము నందు వేములవాడ భీమకవి కలడు. మల్లియరేచన ఉండును. కనుక మల్లియరేచన రచించినట్లు కవిజనాశ్రయమును వేములవాడ భీమకవి రచించుట నిరాఘాటము.

వేములవాడ భీమకవి తెలుగులో 1. రాఘవ పాండవీయము, 2. నృసింహ పురాణము, 3. శతకంధరరామాయణము, 4. సుమతీశతకము, 5. హరవిలాసము, 6. రామగోపాలవిలాసము రచించినట్లు కలదు. కనుక వీరశైవుడు కాడు. విష్ణు ద్వేషములేని శివభక్తుడు. కనుక జనద్వేషమును లేకుండ కవిజనాశ్రయమును రచించుట కష్టము కాదు. అంతేకాదు. మల్లియరేచన పట్టి జైనుడు కాడు. వైశ్యజైనుడు. అవచితిప్పయసెట్టి వలె వ్యాపారి అగును. అవచితిప్పయసెట్టి కృతిభర్తృ గౌరవ పరితృప్తుడు. మల్లియరేచన కృతికర్తృ గౌరవ ప్రలోభుడు కావచ్చును. వేములవాడ భీమకవి ధనప్రలోభుడు కావచ్చును. కనుక మల్లియరేచన రచించినట్లు వేములవాడ భీమకవి కవిజనాశ్రయమును రచించుట నిరాతంకము.

పయి విచారణకు ఫలితాంశము లివి :

1. కవిజనాశ్రయము కర్త వేములవాడ భీమకవి
2. వేములవాడ భీమకవి కాలము 1327-1400
3. కవిజనాశ్రయము రచనాకాలము పదునాల్గవ శతాబ్ది ఉత్తరార్ధము

## అనుబంధము

"ఘనుడన్ వేములవాడ" అను భీమన చాటువు నందు "వేములవాడ వంశజుడ దక్షారామ భీమేశ నంద

నుండన్......భీమన నాపేరు" అని కలదు. కనుక వేములవాడ వంశనామము అనగా ఇంటిపేరు. దక్షారామ భీమేశుడు అనగా దక్షిణకాశి అయిన, తూర్పుగోదావరి మండలములోని భీమేశ్వరుడే. వేములవాడలోని రాజేశ్వరుడు, భీమేశ్వరుడు కాడు. వేములవాడలోని రాజేశ్వరుడు దక్షవాటి యందు భీమలింగమని / దక్షవాట్యాం భీమలింగం యత్ర రాజేశ్వర శివః కలభవిష్యోత్తర పురాణాంతర్గత రాజేశ్వర మహాత్మ్యములోని విషయము పురాణ విషయము. పురాణ విషయము పూజ్యము. ప్రమాణాంతర సంవాదము లేనిచో, అన్యథా బాధకమైనచో త్యాజ్యము. శ్రీనాథుని భీమఖండములోని కృత్యవతరణికను కృతిభర్త బెండపూడి అన్నయామాత్యునితల్లిదండ్రులు "రామాంబకుదేవమంత్రికిని దక్షారామ భీమేశ్వర స్ఫార ప్రాంకృపాగుణోదయమునంజన్మించిరాత్మోద్భవుల్" అని/ అ. 1, వ. 51 / కలదు అట్లు వేములవాడ భీమకవి అతని తల్లిదండ్రులకు "దక్షారామ భీమేశ్వరకృపాగుణోదయమున" జన్మించుట సహజము. కనుక "దక్షారామ భీమేశ నందనుండన్" అనుట కవి అతిశయోక్తి కాదు. అది సహజోక్తి అనుకొని కాలాంతరము నందు వితంతు సంతాన వృత్తాంతమును కల్పించుట సంభవము. దక్షారామభీమేశ్వర కృపావిశేషమున జన్మించిన వేములవాడ భీమకవి జన్మస్థలము దక్షారామ పరిసరమగుట సంగతము. కవిజనాశ్రయము "మిక్కిలి ప్రాంతప్రతి" యందు "వేములవాడ వెలసిన భీమేశ్వరు కరుణగల్గు భీమ సుకవి" అని కలదు. వేమనవాడ వేములవాడ అగును. వేములవాడ కావలసిన అవశ్యకము లేదు. దక్షారామ పరిసరము నందు వేములవాడ కలదు (రామచంద్రపురం తాలూకా, తూర్పుగోదావరిజిల్లా) అట వెలసిన భీమేశ్వరుడు దక్షారామ భీమేశ్వరుడే అగును, కనుక వేములవాడ భీమకవి జన్మస్థలము వేములవాడ. తూర్పుగోదావరి మండలములోని వేములవాడ భీమకవి, పశ్చిమగోదావరి మండలములోని (నిడుదవోలు) మైలమ భీమనకు సంబంధించినవాడగుటసంగతము. అంతేకాదు. అనంతరకాలములోని మడికి సింగన జన్మస్థలము మడికి (రామచంద్రపురం తాలూకా, తూర్పుగోదావరి జిల్లా). మడికి జన్మస్థలమైన మడికి సింగన రామగిరి పట్టణాధీశ్వరుడైన ముప్పభూపతికి సంబంధించినవాడయినట్లు, వేములవాడ జన్మస్థలమైన వేములవాడ భీమకవి రామగిరి దుర్గాధిపతియైన చాళుక్య చొక్క నృపాలునికి సంబంధించినవాడగుట కూడ సంగతము. ఉపరి ఆద్యులైన నన్నయ, తిక్కన, ఎఱ్ఱనలను కాదని, ఆ ప్రాంతీయుడు. అవ్యవహిత పూర్వుడు అయిన వేములవాడ భీమకవికి రాజమహేంద్రవర రాజ్యాధిపతి ఆగ్రహాంబులు మిచ్చుట కూడ సంగతము. "శబ్దశాసనుసన్నపాచార్యుం దలంచి, సత్కవిశ్రేష్ఠుం దిక్కయజ్వను భజించి, సత్ప్రబంధమాహేశ్వరు శంభుదాసు నధిక సద్భక్తి సంయుక్తి నాదరించి" అని మాత్రమే శ్రీనాథుని పూర్వ కవిస్తుతి (కా. ఖం. - అ. 1, వ 19) వచియింతు (వు) వేములవాడ భీమనభంగి నుగ్దండలీల నొక్కొక్కమాటు" అని అల్లాడ వేమారెడ్డి శతపత్రము.

వేములవాడ భీమకవి జన్మస్థలము దాక్షారామము దగ్గఱి వేములవాడ అని, చొక్కనృపాలుడు రామగిరి దుర్గాధిపతి అని. మైలమ భీమన పూసపాటి రాజవంశ పూర్వుడని 1892 వ సంవత్సరము నందు ప్రకటితమైన కవిజీవితము అందు కలదు గాని, నిరూపణము లేదు. అంతే కాదు. మైలమ భీమన కాలము సరిగా నిర్ణయము కాలేదు. ప్రకృత నిర్ణయమునకు ప్రమాణీకరించిన మార్కండేయ పురాణములోని పూసపాటి రాజవంశవృక్ష వర్ణనము తత్పూర్వ కావ్య గ్రంథములలోని వర్ణనముల కంటె చరిత్రకు సన్నిహితము. అది కేవలము పూర్వ కావ్యముల పునశ్చరణము కాదు. 1836-38 వ సంవత్సరము లందు అడయపు సంస్థానాధిపతి విజయనగర సంస్థానాధిపతికి పంపిన వంశావళి, లేఖలు, విజయనగర సంస్థానాధిపతుల జన్మపత్రికలు, విజయనగర సంస్థానము నందు జ్ఞాపకార్థ ముంచబడిన ప్రాతప్రతులు మొదలైనవి సంప్రదించిన ఆనంద గజపతి ఆమోదముద్ర నందిన వంశవృక్ష వర్ణనమును అగును.

1865 వ సంవత్సరము నందు డి. యఫ్. కార్మిక్ల్ రూపొందించిన "విశాఖపట్నం డిస్ట్రిక్టు మాన్యుయల్"కు 1886 వ సంవత్సరము నందు ఆనంద గజపతి ఆదేశానుసారము విజాపువపు వెంకట కోదండరావు తెనిగించిన గ్రంథము నందు వేములవాడ భీమకవి విశాఖమండలమునకు చెందిన కవి అని, పదమూడవ శతాబ్ద ప్రారంభ కాలములో ప్రసిద్ధుడని కలదు (పు. 131), కాలము పదమూడవ శతాబ్ది కాదు గానీ, వేములవాడ భీమకవికి విశాఖమండలమునకు సంబంధము కలదు.

కళింగ గంగు - అనగా కళింగ దేశాధిపతి అయిన గాంగవంశరాజు - పట్టము గట్టుకొన్న పజ్జనగతము-అనగా

జాజ్ నగర్ - బంగాళాఖాతము తీరము నందలి దక్షిణ భాగములోనిది. అనగా కళింగదేశములోనిది అది ఈ కళ దేశములోని జాజ్‌పూర్ కాదు. కళింగ దేశమునందు విశాఖ. మండలము కలదు. విశాఖ మండలమునందు సజ్జనగరము కలదని కళింగ సంచిక యందు కరరుగాని, అది పూర్వ కాల నిర్ణయమునకు అనుగుణము కాదని సరిపడదనిరి ప్రస్తుతకాల నిర్ణయమునకు సరిపడునది కనుక, కళింగగంగు పట్టము గట్టుకొన్న సజ్జనగరము విశాఖమండలములోని సజ్జ నగరమే. అది విజయనగర రాజుల కళింగదేశజైత్రయాత్ర కును అనుకూలము. కాని బుక్కరాయల మేనల్లుడు సంగమ రాయలు కళింగ దేశమును జయించినట్లు శాసన ప్రమా ణము కనరాదు. అయినను లిఖిత పూర్వకమైన సాక్ష్యము నిరర్థకము కాదు. అంతేకాదు. సమకాలికులైన వేముల వాడ భీమకవి చాటు పద్యార్థము, ఫిరోజ్‌షహా చెలికాని తారీఖ్-ఇ-ఫిరుజ్-షాహి గ్రంథార్థమును సంపదించుట గమ నార్హము. ఇంతకు, వేములవాడ భీమకవి విశాఖమండలము లోని సజ్జనగరమునకు వచ్చినపుడు, అచట కొంతకాలము న్నచో, విశాఖమండలమునకు వేములవాడ భీమకవికి సంబం ధము ఏర్పడును. అది గత శతాబ్దిలో వేములవాడ భీమకవి విశాఖమండలమునకు చెందిన కవి అని గ్రంథస్థమగుట సహజము.

ఇక పూనిపాటి వారి సీసమాలికలోని కర్తృకాలములు ఎంతమాత్రమును ప్రామాణికము కాదు. అది మరొక వ్యాసము.

## సూచికలు


1 శ్రీనాథుడు, పుటలు 166-9

2 ఎ. హిస్టరీ ఆఫ్ రెడ్డి కింగ్‌డమ్స్, పే. 519-4
బి సకలనీతి సమ్మతము, అకాడమి ప్రచురణ, పీఠిక, పుటలు 5-13

3. శ్రీ రాజరాజనరేంద్ర పట్టాభిషేక సంచిక, పుటలు 30

4. తెలుగు కవుల చరిత్ర, పుటలు 172-3

5. ఎ హిస్టరీ ఆఫ్ తమిళ్ లిటరేచర్, పే. 81

6. కవిజనాశ్రయము- ఆంధ్రసాహిత్య పరిషత్ప్రకాశితము, పీఠిక, పుటలు 20_1

7 పైది, పు. 34

8 పైది, పుటలు 51-5

9. చాటుపద్య మణిమంజరి-ద్వితీయ భాగము, పుటలు 58-61

10. శ్రీనాథుడు, పుటలు 53-5

11. ఎ. కవిజీవితములు/1892/.పు.9
బి. ఆంధ్రకవుల చరిత్ర - మొదటిభాగము, ద్వితీయ ప్రచురణ, పుటలు 349-50
సి ఆంధ్రకవితరంగిణి - మొదటి సంపుటము, పు. 241

12 ఎ. కవిజీవితములు (1892), పుటలు 10.2
బి. చాటుపద్య మణిమంజరి,ప్రథమభాగము, పుటలు 76-7
సి. కవిజనాశ్రయము - ఆంధ్రసాహిత్య పరిషత్ప్రకాశితము, పీఠిక, పు. 18
డి. ఆంధ్రకవుల చరిత్ర - మొదటిభాగము, ద్వితీయ ప్రచురణ, పుటలు 345 6
ఇ. ఆంధ్ర కవితరంగిణి- మొదటి సంపుటము. పుటలు 248 - 9
ఎఫ్. సమగ్ర ఆంధ్ర సాహిత్యం - మొదటిసంపుటం,పుటలు 191-5

13. హిస్టరీ ఆఫ్ రెడ్డి కింగ్‌డమ్స్

14. బిడ్

15. హిస్టరీ ఆఫ్ ఒరిస్సా, వాల్. 1, పే. 200-1

16. కుమార సంభవము-ప్రథమ భాగము,పీఠిక, పు.6

17. ఆంధ్రకవితరంగిణి - మొదటి సంపుటము, పుటలు 2 9, 228, 234

18. ఎ. భారతి, సంపుటము26, సంచిక 3, పుటలు 137-9
బి. ఆంధ్రకవితరంగిణి - ఎనిమిదవ సంపుటము, పుటలు 62-5
సి. సమగ్ర ఆంధ్రసాహిత్యం- మొదటి సంపుటం, పుటలు 205.9

19 ఎ ఆంధ్ర ప్రపంచ చరిత్రము - మొదటి భాగము, ద్వితీ ప్రచురణ పుటలు 0-2
బి. ఆంధ్రకవితరంగ మొదటిసంపుటము. పుటలు 211-3

20. ఎన్ ఇండియన్ ఎఫిమెరిస్ వాల్ 111 పే 257




# "షెల్లీ మళ్ళీ మరణించాడు"

బ్రతుకు బ్రతుకెల్ల కవితకే బలి యొసంగి
యాపుకోలేని గానమహాపిపాస
పాయ మరియొకసారి ప్రవాసభరము
మోయ వచ్చిన నాటి షెల్లీ యతండు!

అతడు స్వేచ్ఛాకుమారకుడతడు గగన
పథవిహారవిహంగమపతి-యతండు
మోహనవినీలజలధరమూర్తి-యతడు
దివినె విహరించు భువికిని దిగ్గిరాడు!

అతని శోకాంబునిధి మథనైకదీక్ష
నమృతకలశప్రపంచములవతరించె-
భావుకసుపర్వులకె కాని పరమ శుష్క
మందహృదయదైతేయుల కందవవ్వి!

ఇంత చిరుగీతి యెదవేగిరించి నేని
పాడు కొనుచు తాండవనృత్యమాడుకొనును-
మాటలేటికి నింకిట్టి పాటగాని
కనివిని యెరుంగమెన్నడంచనిరి బుధులు.

మురళితో బాటె యడుగులు మోపిపుడమి
మురళితో బాటె విహరించి మొన్న మొన్న
మరల మరణించె షెల్లీకుమారుడవని
తిరిగి జనియింపదెప్పుడు మరచియైన.

# వసంతం వాడి పోయింది

మోడులై పోయి సిగ్గులో మునిగితరులు
శిశిరమే కాని రాదే మొత్రవసంత
మీ వనమ్మున కనుచు వాపోవుచుండ
వచ్చె మధుదేవుడొక సుప్రభాతవేళ.

కంతుడో జయంతుడో నిశాకాంతుడో మరి
యక్షతనయుడో యాతడంచబ్బురపడి
చిగురుటాకుల వన్నెల చీరదాల్చి
యిచ్చె వనలక్ష్మి యాతిథ్యమెచ్చగించి.

స్వాదుమకరందమయ్యె పాదోదకమ్ము
అర్ఘ్యమయ్యెను వికచలతాంతచయము
ఆసవంబయ్యె సుమధూళి రాసులెల్ల
చిలుకపలుకులె వలపుల పలుకులయ్యె.

సొగసు గలవాడు గిరిజాలజుట్టువాడు
ధవళవసనాలవాడు క్రొందళుకువాడు
సరసభణితులవాడు రాచరికపు మరి
యాదలెరిగినవాడు ప్రాయంబువాడు.

వచ్చె దివినుండి-యెక్కడివాడో నేడు
చొచ్చె మత్ప్రాంగణంబును సుకృతరేఖ
అంచు రోమాంచ కంచుకి తాంగయౌచు
జాణ వనలక్ష్మి కోకిలక్వణమీనె-

క్షణము క్షణమున కొకవింత చక్కదనము
దినము దినమున కొక వింత తెలివిమీర-
హృద్యనైపథ్యమును సవరించుకొనుచు
చైత్రు నర్చించె గహనసంసారరాజ్ఞి.

ఎట్టులది దాపురించెనో యే మొకాని-
ఆకు సందుల త్రోవల నల్లదిగియె-
నొక్క క్రూరార్క కిరణమ్ము; ఉర్వి వ్రాలి
కేళి వనలక్ష్మి శుష్కించి సోలితూలె-

ఆగిపోయెను చంచరీకారవములు
నిలిచిపోయెను పరభృత నిస్వనములు

చెదరిపోయిన వనరమా సిద్ధశోభ
చూడలేక వసంతము వాడిపోయె.

అపుడు వనివైపు జూచి యాయలరులేని
శూన్యమౌ మోడు మ్రాకుల జూచియొక్క
కోకిలమ్ము కోయని యేడ్చి గొంతునెత్తి
దారిబోవుచు నున్న నైదాఘపవను
డొకడు జాలిగ నొక్క నిట్టూర్పు విసరె!

# తెలుగుదేశపు నిలువుటద్దం బ్రద్దలయ్యింది

వాణి కరుణించి నిత్యనై పథ్యరచన
కెప్పుడో నీకు కానుకగా నిచ్చినట్టి
యా నిలువుటద్దమే బ్రద్దలయ్యె తెలుగు
తల్లి! నిన్నింక నెవ్వరో దార్పగలరు?

దిద్దుకొంటివి నొసటను తిలకరేఖ
అలకలను దువ్వికై శికమల్లుకొంటి
చెక్కు కొంటివి క్రొంగ్రొత్త చికిలివిరులు
చూచుకొంటివి కనులార సొగసులెల్ల.

రంభ గదిలోన నిట్టి దర్పణముగలదె?
యున్నె యాగర్వమిట్టిదా యూర్వశి కడ
ఈ దృశానర్ఘ మణిమయ హేమముకుర
చంద్రబింబమ్ము దొరకునే జన్మలోన?

[శ్రీశ్రీకి కృతజ్ఞతాభివాదములతో]

[శ్రీదేవులపల్లి కృష్ణశాస్త్రిగారి మరణవార్త విని "షెల్లీ మళ్లీ మరణించాడు;" "వసంతం వాడిపోయింది;" "తెలుగు దేశం నిలువుటద్దం బ్రద్దలయ్యింది;" అని శ్రీశ్రీ వాపోయారు. ఆ మూడు పరితాప వాక్యాలను శీర్షికలుగా గ్రహించి; శ్రీ దేవులపల్లి ప్రథమ వర్ధంతి సందర్భంగా సంఘటించిన కవితా ఖండికలివి.]

శ్రీ శనగన నరసింహస్వామి



శ్రీ ఆర్. ఎస్. సుదర్శనం

# రేగుపండు రుచి

ప్రొద్దున యిడ్లీ తింటూ కిటికీలోంచి కనిపించే ఆకాశంలో తెల్లని మబ్బుని చూస్తుంటే, తాను మబ్బునే తింటూన్నట్లుగా ఉంది. ఏదో మైమరపు. ఒళ్ళు తేలిపోయింది. అసలు ఉన్నట్లే లేదు.

కాఫీ త్రాగి, వెళ్ళి వరండాలో పడక కుర్చీలో నడుం వాల్చి ఎదురుగుండా ఉన్న వేప చెట్టుని చూస్తూంటే, దాని ఆకుల పచ్చదనం లేత ఎండలో మరీ పచ్చగా మెరుస్తూ నవ్వుతూ కనిపిస్తోంది. మధ్య మధ్య చిరుగాలి కితకితలకు చెట్టు ఊగుతోంది.

చిట్టి, నాలుగేళ్ళ మనుమరాలు, "తాతయ్యా" అంటూ ఒళ్ళో ఎక్కి కూర్చుంది. దాని బుల్లి కుడిచేతిలో పట్టీ పట్టకుండా నాలుగు రేగుపళ్ళు. ఎడంచేత్తో గౌను లాగి సరిచేసుకుని, ఆ పళ్ళని ఒళ్ళో పోసుకుని, ఒక దాన్ని తాతయ్య కిచ్చింది. "తిను తాతయ్యా!"

ఒకవైపు ఆకుపచ్చరంగు పసిమిగా మారుతూ, మరోవైపు దోర ఎరుపుగా మారిన పండీ పండని గుండ్రని ఆ పండు, చిన్న తొడిమతో ఎంతో అందంగా ఉంది. పరిపూర్ణత అంటే యిదీ. పండిన వాటిల్లాగా మెత్తగా యిది వ్రేళ్ళతో చిదుమటానికి వీలుకాని పండు. ముందరి పళ్ళతో కొరికిచూచి తినవలసిన పండు. దీని రుచే వేరు....

తనకు ముందరి పన్ను ఒకటి ఊడిపోయింది. రెండోది ఊగులాడుతోంది. దాని కేదైనా తగిలితే జివ్వుమని సలుపుతుంది.

"అమ్మా. నువ్వే దీన్ని కొరికి పెట్టు. బావుందో లేదో చూడాలి!"

నిజానికి అల్లాంటి పచ్చి ఉన్న దోరరేగుపళ్ళు మోసం చెయ్యవు. ఎక్కడో ఒకటి తప్ప లోపల పుచ్చు ఉండదు. పండిన రేగుపళ్ళ పులుపుకంటే పండీ పండని వాటి తీపి-వగరు ఎంతో బావుంటుంది. అది ఈనాటి రుచి కాదు, అనుభవం కాదు, ఎన్నాళ్ళయిందో రేగుపండు రుచిచూచి! అసలు రేగుపండు తిందామనుకోవడానికి టైము ఏదీ!

చిన్నతనంలో ఎదుటి వీధిలో తనతో ఆడుకునే స్నేహితురాలు లీల....వాళ్ళ యింట్లో పెరట్లో రేగుచెట్టు ఉండేది. అప్పటికింకా తాను బళ్ళో చేరలేదు. ప్రయివేటు మాష్టారు దగ్గర అక్షరాభ్యాసం అయింది. మధ్యాహ్నాలు స్వేచ్ఛ. ఇంట్లో నిశ్శబ్దం. లీలతో వాళ్ళ పెరట్లో చేరి, రేగుపళ్ళు ఏరుకుని, ముని పళ్ళతో కొరికి చూచి తింటూ ఉంటే ఎంత బావుండేదో!

"తాతయ్యా, ఇదుగో" అంటోంది చిట్టి కొరికి చూచి బావుందని పండు అందిస్తోంది. పండు తీసి నోట్లో వేసుకున్నాడు. సాక్షాత్తూ లీల....వాళ్ళ పెరట్లో....యిలాగే. ఒకరు కొరికిన పండు మరొకరు తినడం....అది యిద్దరి మధ్యా ఏర్పాటు.

రేగుపండు రుచిలో ఉన్న అనుభూతిలో లీలముఖం' మధ్యాహ్నపు ఎండలో ఆమె నుదుటిమీద అదిరు చెమటలు, ఆ పలు వరుస, ఆ నవ్వూ ఆ కోపం, అన్నీ కళ్ళకు కట్టినట్లున్నాయి.

చిట్టి ముంగురుల్ని సరిచేసి, తల నిమురుతున్నాడు. చిట్టికి ఎవరైనా తన తల ముట్టుకుంటే యిష్టం ఉండదు. చిట్టి ఒళ్ళోనుంచి దిగి వెళ్ళిపోయింది. అప్పటికి తన పళ్ళు తినేసి, విత్తనాలూ ఊమ్మేసింది.

కాని తాతయ్య నోట్లో విత్తనం, రాయిమల్లే, పక్క పళ్ళమధ్య తన గట్టితనాన్ని నిరూపించుకుంటూ, తన రుచిని పల్చన చేసుకుంటూ, నోరంతా విహరిస్తూ అలానే ఉంది.

రేగుపండు రుచిలో తన్మయతలో కన్నులు మూసిన తాతయ్యకు నిద్రరాలేదు. బాల్యం తిరిగివచ్చిం

మధ్యాహ్నాలు ఆ ఎండలో స్వేచ్ఛ, అగాలిలో ఆప్యాయత, ఆ వచ్చదనంలో స్నేహం, పెచ్చులూడిన ఆ పెరటి గోడ పత్యేకత, ఆ రేగుచెట్టు అందం, లీల అగ్రహానుగ్రహాలూ - అబ్బ, జీవించడంలో ఎంత తియ్యదనం. ఎంత ఆనందం! ఏమైంది ఈ అనుభూతి యిన్నాళ్ళూ?

"ఏమండీ, పదిగంటలు దాటుతోంది, బ్యాంక్‌కి వెళ్ళరా ఏమిటి? ఆ "లోన్" సంగతి యివ్వాళ తేల్చుకుంటే తప్ప రేపు వాళ్ళకి సొమ్మివ్వడం ఎలా కుదురుతుందీ? ఎందుకలా సోమరిగా, మగతగా కళ్ళు మూసుకున్నారు? రిటైరై మూడు నెలలు కాలేదు, మీలో యింత పరాకు వచ్చేసిం దేమిటి? ఆరోగ్యం బాగుండలేక పోతే డాక్టరుని సంప్రదించ రాదా?"

పడక కుర్చీనుంచి లేచాడు. గదిలోకి వెళ్ళి దుస్తులు వేసుకుంటుంటే తానెంత ముసలివాడై పోయాడో తెలిసింది. ప్రొద్దుటినుంచీ గుర్తురాని ముసలితనం యిప్పుడు గుర్తు వచ్చింది.

అందమైన ఎండా, చెట్టువచ్చదనం, రేగుపండు రుచీ చిట్టితల్లి ఆప్యాయతా, అన్నీ ఉన్నాయి. అదంతా గతం కాదు, యిప్పుడు యిక్కడే ఉంది. ఆ లోకం ఈ లోకంతో కలిసే ఉంది. జీవిత రహస్యం బోధ పడింది. తనకు ముసలితనం లేదు!

# మేఘసందేశం-2

శ్రీ ఎన్. సంజీవ్

ఏ ఎలమావిలో
నీ లేమోవి
కన్పించునోనని
కలకోకిలనై నేను
సంచరిస్తున్నాను!

ఏ పూతోటలో
నీ తీపి మాటలు
విన్పించునోనని
ఎలదేటినై నేను
ఎదురు చూస్తున్నాను!

ఏ కడలి అలలలో
నీ విరుల కురులు
దాగెనేమోనని
కడలి తీరాన్నై నేను
వీక్షిస్తున్నాను!

ఏ స్వాతి చినుకులో
నీ అందం
నీటి బిందువాయెనోనని
ముత్యపు చిప్పనై నేను
నిరీక్షిస్తున్నాను.

ఏ నీలిగగనాన
ఏ గాలి అలవోలె
అలరిస్తున్నావోనని....
నా కౌగిలి లోగిలికి రమ్మని
అంపుతున్నాను ప్రేమసంకేతాల్ని...
ఈ మేఘసందేశాన్ని!

డాక్టర్ గుమ్మనూరు రమేష్‌బాబు

# నాళికాశిశుజననం అభ్యుదయమా? అధఃపాతాళమా?

నాళికాశిశువు అంటే "టెస్ట్ ట్యూబ్ బేబీ" అనేది యిటీవల సంచలనం కలిగించిన శాస్త్ర పరిణామాల్లో ఒకటి. "అద్భుతము"ని సామాన్య మానవునికి అనిపించినా "సాధారణమే" అని భౌతిక దృక్పథం ఉన్న శాస్త్రవేత్తకు అనిపించవచ్చు. ఈ అన్పించడం అన్పించకపోవడం అనేవి అత్యంత సున్నితమూ బహు విపరీతమూ అయిన మానవ భావం యొక్క ప్రభావమేనని గమనించవలసిన అవసరమున్నది. మానవ భావం అనేది అర్థం కానిది బాహ్యవిశ్లేషణకన్నా అంతర్విశ్లేషణకే మానవభావమనేది కొంతవరకైనా బోధపడుతుందనేది నిర్వివాదాంశము. ఒక పదార్థాన్ని విశ్లేషించినట్లు ఎంతగా ప్రయత్నించినా మనోభావాన్ని విశ్లేషించడం సాధ్యంకాదు. దీన్ని కాదనటం సాహసమే. బాహ్యజగత్తు అందరికీ ఒకటే అయినా అంతర్జగత్తు ఒక్కొక్కనికి ఒక్కొక్కటి. ఏ ఒక్క అంతర్జగత్తూ అన్ని విషయాలలోను మరొక అంతర్జగత్తుతో పోలి ఉండడమనేది సర్వ సాధారణంగా జరిగే పనికాదు. ఈ కారణంవల్లనే నాళికా శిశుజననంపట్ల తీవ్రమైన వాదోపవాదాలు చెలరేగినాయి కొందరు శాస్త్రం "పురోగమించింది" అంటే మరికొందరు "తిరోగమించింది" అన్నారు. "గ్రేట్ హోప్" అని కొందరంటే "వాట్ ఫార్" అని మరికొందరన్నారు. మొత్తానికి నాళికా శిశుజననంపట్ల మొగ్గు చూపలేదనే నేను భావిస్తున్నాను.

"టెస్ట్ ట్యూబ్ మొక్కలు" తయారయ్యాయి. దానికే విధమైన వ్యతిరేకతా కనిపించలేదు. "టెస్ట్ ట్యూబ్ దూడలు" అంబా అన్నాయి. దానికి మెచ్చుకోలుగా చూసారు. కాని "టెస్ట్ట్యూబ్ బేబీ" నలా ఊహించ లేకపోతున్నారు. కారణం ఒకటే. ఒక శాస్త్రవేత్త మామూలు స్థాయిలో మనిషిని ఒక జంతువుగా వర్గీకరించుకొని ప్రత్యుత్పత్తి ప్రక్రియను కేవలమొక శరీరధార్మిక క్రియగానే చూడగలడు. కాని సగటు మానవుడలా కాదు. మనిషి అంటే అతనికి మంచి చెడ్డలు తెలిసిన బుద్ధి యింగిత జ్ఞానము ఉన్న ఆలోచించగల శక్తి వివేచించగల యుక్తి నిండుకొన్న మూర్తీభవించిన మానవతా రూపము మమతా నిలయము! ఈ పరిస్థితిలో "టెస్ట్ ట్యూబ్ బేబీ" నతడు ఎలా కొనియాడగలడు?

భాగ్యోదయచరిత్రలో మనజాతికున్న విలువ అత్యంత శ్రేష్ఠమైనది. నైతికంగా ఉన్నత ప్రమాణాలను అందుకొన్న ఆర్షధర్మ సంస్కృతిలో ఈ నాళికా శిశుజననమనే అంశం ఒక మచ్చ. ఒక వికారం. ఒక ముసలం. ప్లాటో చెప్పిన సిద్ధాంతాన్ని ("బలమైన" సంఘంకోసం "బలమైన" మనుషులు కలవవలసిన అవసరమున్నదనే వాదం! "బలం" అనే మాటకు అర్థాన్ని స్ఫురించుకోవాలి) ఏ మాత్రం ఒప్పని మన వేదధర్మం ఈ నాళికా శిశుజననాన్ని వికృత శిశుజననంగానే పరిగణిస్తుంది. ఇందులో ఆశ్చర్యంలేదు. ఈ మాటకు ఎవరూ అడ్డు చెప్పరు. అయితే ఆశ్చర్యపడవలసిన అంశం మరొకటి ఉన్నది. పాశ్చాత్య దేశాలలో సైతం ఈ నాళికా శిశుజననానికి వ్యతిరేకంగా పెద్ద పెట్టున గాలి దుమారం రేగడం ఎందుకనలా?

ప్రపంచంలో వివిధ జాతులున్నాయి. వివిధ సంప్రదాయాలున్నాయి రకరకాలయిన మతాచారాలు సాంఘిక నియమాలు ఉన్నాయి. ఆధ్యాత్మికంగా ఉన్నతిని బడసేందుకు నిర్దుష్టమైన మత గ్రంథాలున్నాయి. చిత్త విముక్తిని చిత్త విస్తారాన్ని, చిత్తవికాసాన్ని పొందేందుకు అనువుగా ప్రమాణీకరించబడిన ఉత్తమమైన పుస్తకాలున్నాయి. ఆ గ్రంథాలు కానివ్వండి, ఆ పుస్తకాలు కానివ్వండి జాతి చరిత్రలనే తెలుపుతాయనే విషయం వేరుగా

చెప్పవలసిన అగత్యం లేదు. ఏ జాతి చరిత్రలోనైనా నియతి, క్రమం అనేవి ముఖ్యమైనవి. ధర్మ సంకటమైన పరిస్థితులలో తప్ప ఎప్పుడు కూడ అక్రమ సంతానానికి ఏ చరిత్రా వొత్తాసు నివ్వలేదు. అక్రమంగా సంతానాన్ని పొందటం తప్పనని ధ్రువీకరిస్తూ లేదా ధ్రువీకరించినా దేశ శ్రేయస్సుకోసం ప్రజాక్షేమంకోసం అత్యంత అవసరమని అనిపించిన పరిస్థితులలో అదే మార్గమని తోచినప్పుడు వేరే ఏ యితర మార్గమూ లేనప్పుడు ఆ విధంగా చెయ్యడం అవుచిత్యమనే అనిపించుకొంటుందని ప్రతి జాతి చరిత్రలోనూ నిర్దేశించబడి ఉంది. కాలంతోపాటు భావంలోనూ మార్పు అనేది వచ్చింది. "టెస్ట్‌ట్యూబ్ బేబీ" అనేది అక్రమ సంతానమని కొందరి వ్యాఖ్య. అదివక్ర భాష్యమని సెలవిచ్చినా అది క్రమమే అని చెప్పగలిగే వారెవ్వరున్నారు?

శిశుజననమనేది స్త్రీ పురుషుల కలయికద్వారానే సాధ్యమౌతుంది గర్భధారణకు స్త్రీ ఎంత ముఖ్యమో, పురుషుడూ అంతే పురుషుడు కారణము. స్త్రీ కార్యము. యుక్త వయస్సులో ఉన్న స్త్రీ పురుషులు కలిసినంత మాత్రాన గర్భధారణ జరుగదు. పరిస్థితులన్నీ అనుకూలంగా ఉన్నప్పటికీ కనీసం 5-6 సార్లు సంభోగ ప్రక్రియ కొనసాగాలి. గర్భధారణ అనుకొన్నంత సులభ సాధ్యం కాదు.

## అనుకూలమైన పరిస్థితులు అంటే...

1) పురుషునిద్వారా వెలువడే వీర్యంలో మంచి గమనశీలత యోగ్యమైన జీవన చైతన్యత ఫలవంతమైన ధార్మిక నిగ్రహత ఉన్న శుక్ర కణాలు (వీర్యకణాలు లేదా పురుష బీజకణాలు) ఆరవయి కోట దాకా ఉండాలి. వాటిలో కేవలం ఒకటి మాత్రమే స్త్రీ బీజం లేక అండంతో సంయోగం చెంది సంయుక్త బీజకణానికి నాంది పలుకుతుంది. దీనినే ఫలదీకరణం అంటారు.

2) నెలకొక్కసారి అండకోశంనుంచి విడుదలయ్యే స్త్రీ బీజం రుతుక్రమాన్ని నిర్దుష్టంగా పాటిసూ ఉండాలి. ఫలవంతమైన ఆరోగ్యదాయకమైన స్త్రీ బీజము అండకోశంనుంచి వెలువడి అండవాహిక (ఫాలోపియన్ ట్యూబ్) ద్వారా గర్భాశయాన్ని చేరుకొంటుంది. ఈలోగా వీర్యకణం లభ్యంకాని పక్షంలో రుతుక్రమాన్ని అనుసరించి ఆ స్త్రీ బీజం జననాంగం ద్వారా వెలుపలికి చేరుకొంటుంది. సరియైన సమయానికి పురుష బీజకణం అందుబాటులో ఉంటే స్త్రీ బీజకణం యోగ్యమైన స్థితిలో ఉంటేనే సంయోగం సాధ్యమవుతుంది. అలా కాని పక్షంలో సంయుక్త బీజకణావిర్భావానికి అవకాశం లేదు. అంటే గర్భధారణ సంభవించదు. ఈ సంయోగమనేది పురుష బీజకణం యొక్క గమనశీలతపైనే ఆధారపడి ఉంటుంది. అందువల్లనే సంయోగం కొన్ని సమయాల్లో అండ వాహికలోనూ మరి కొన్ని సమయాల్లో గర్భాశయంలోనూ సాధ్యం కావచ్చు.

ఈ విధంగా అనుకూల పరిస్థితుల్లో సంయుక్త బీజకణం ఏర్పడడాన్ని ఈ క్రింది విధంగా చూపవచ్చు.

## సంయోగ ప్రక్రియ - రేఖామాత్ర వివరణ :



## అనుకూలించని పరిస్థితులు అంటే....

### పురుషునిలో :-

1 )వీర్యకణాల సంఖ్య తక్కువ కావడం
2) వీర్యకణాల జీవనవ్యవధి చాలా స్వల్పంగా ఉండడం
3) వీర్యకణాల గమనశీలత మందకొడిగా ఉండడం
4) వీర్యకణాలకు తగిన పుష్టినిచ్చే హార్మోనేతర పదార్థాలు తగిన మోతాదులో లభ్యం కాకపోవడం
5) పురుష బీజకోశాల్లో లోపముండడం
6) పురుష బీజ వాహికల్లో అడ్డంకు లుండడం
7) వీర్యకణాలు సరిగా ఎదిగి ఉండకపోవడం
8) వీర్యకణాలు మృతి చెంది ఉండడం
9) వీర్యకణాలకు సంయోగ క్రియా శీలత పూర్తిగా నశించి ఉండడం
10) ఒకవేళ అన్నీ అనువుగా సుజావుగానే ఉన్నా నిర్ణీత మైన సమయానికి నిర్దుష్టమైన స్థానానికి స్త్రీ బీజకణం చేరుకోకపోవడం

### స్త్రీలో :-

1) స్త్రీ బీజకణ నిర్మాణంలో లోపముండడం
2) అండకోశాల్లో నిర్మాణాత్మకమైన క్రియాత్మకమైన అవరోధాలుండడం
3) స్త్రీ బీజవాహికల్లో అడ్డంకు లుండడం
4) స్త్రీ బీజానికి తగిన చైతన్యం లేకపోవడం లేదా గమత్వం సన్నగిల్లి ఉండడం
5) స్త్రీ బీజం మృతి చెంది ఉండడం
6) ఋతుక్రమ విన్యాసానికి తగిన విధంగా హార్మోనేతర పదార్థాల తోడ్పాటు ఉండకపోవడం
7) గర్భాశయానికి అండవాహికకు మధ్యన నిరోధ ముండడం
8) గర్భధారణ జరిగినా ఎదుగుదలకు అవకాశంలేని విధంగా గర్భాశయం కుంచించుకొని పోయి ఉండడం లేదా గర్భాశయమే లోపించి ఉండడం
9) ఉత్పత్తి ధారణ లేని వంధ్య స్త్రీ బీజకణమేర్పడడం.
10) అన్నీ సమపాళ్ళలోనే ఉన్నా సరియైన సమయానికి వీర్యకణ సాంగత్యం లోపించడం.

పైన వివరించినవి కాక మరికొన్ని అనానుకూల పరిస్థితులు ఉండవచ్చు. శాస్త్రజ్ఞానం ద్వారా వీటిలో కొన్ని ప్రతికూల పరిస్థితులను అనుకూలపరిస్థితులుగా మార్చుచేయవచ్చు. ఉదాహరణకు పురుషబీజవాహికలోని స్త్రీబీజ వాహికలోని అడ్డంకులను శస్త్ర చికిత్స ద్వారా తొలగించవచ్చు. హార్మోన్‌ల ఉత్పత్తికి తోడ్పడవచ్చు. కాని మృతి చెందిన స్త్రీ పురుష బీజకణాలను బాగుచేయడం సాధ్యంకాదు. దంపతులలో స్త్రీ విషయంలో అయితే ఒకవేళ ఆ స్త్రీ అండము ప్రాణరహితమయినది అయి ఉంటే ఆమెకిక గర్భధారణ జరిగే అవకాశమే ఉండదు. పురుషుని విషయంవేరే. వేరొక స్త్రీ కణంతో వీర్యకణం సంయోగం చెందగా రూపొందిన సంయుక్త బీజకణాన్ని ప్రాణంలేని స్త్రీ బీజకణాలను ఉత్పన్నంచేసే స్త్రీ యొక్క గర్భాశయంలో ప్రవేశపెట్టి ఆమెను గర్భవతిని చేయవచ్చు. ఈ ప్రక్రియలోనే "టెస్ట్‌ట్యూబ్ బేబీ" వెలువడింది. తన పురుషుడు బలహీనుడైనప్పుడు వేరొక పురుషుని ఆశ్రయించడం సాంఘిక నేరం కాగా పరపురుషుని వీర్యాన్ని కొనుక్కోవడం (స్వీకరించడం) శాస్త్రసహాయంతో దానిని వినియోగించుకోవడం సాంఘిక నేరం కాకపోయింది. అదే అర్థంకానిది. అన్నిగొడవలకు దారితీస్తోంది. నాళికాశిశుజననం కోసం వీలుగా వీర్యనిధి కేంద్రాలు ఏర్పడుతున్నాయి. ఈ కేంద్రాలలో వీర్యాన్ని భద్రంగా నిక్షిప్తం చేయడం జరుగుతోంది. వీర్యాన్ని స్టెరిలైస్ చేయబడిన సూక్ష్మనాళికల్లో అర్ధమిలీటరు చొప్పున భద్రపరుస్తారు. ద్రవరూపంలో ఉన్న నత్రజనిని ఉపయోగించి ఉష్ణోగ్రత -38.40 C ఉండేటట్లు చూస్తారు ఘనీభవించబడిన స్థితిలో వీర్యకణాలు 90 శాతం వరకు ఫలవంతమై ఉంటారని మొదట్లో భావించినా అందరి పురుషుల వీర్యకణాల్లో అది సాధ్యం కాదని పరిశోధనల ద్వారా తేలింది కేవలం 37 శాతం పురుషుల వీర్యంలో మాత్రమే చురుకైన గమన శీలత, చైతన్యత ఉంటే శుక్రకణాలు ఘనీభవించిన స్థితిలో కూడ ఉంటాయని తెలిసింది. చివరికి ఫలవంతమయ్యేవి 40 శాతం మాత్రమేనని నిర్ధారించబడింది. ఈ విధంగా ఘనీభవన స్థితిలో ఉన్న వీర్యాన్ని సంతానార్థం వచ్చే మహిళలకోసం ఉపయోగిస్తారు. సాధారణంగా గర్భధారణకు రెండునుంచి ఆరుసార్లు వీర్యాన్ని ప్రవేశపెడతారు. ఆరు ఋతుక్రమాల పర్యంతం ఉపయోగించడం శ్రేయస్కరమని భావిస్తారు.

వీర్యాన్ని ప్రవేశ పెట్టడమనేది చాల సున్నితంగా జరిగే ప్రక్రియ. అతి చల్లని స్థితిలో సూక్ష్మనాళికలో భద్రపరచి ఉన్న వీర్యాన్ని పొడుగాటి సన్నని గొట్టంలోనికి తరలించి యోనిద్వారా గర్భాశయంలోకి ప్రవేశపెడతారు. ఈ గొట్టం చివరన రబ్బరు బల్బులు కాని ప్లాస్టిక్ బల్బులు కాని ఉపయోగించి వీర్యం ధారలా గర్భాశయంలో పడేలాచేస్తారు. కొన్ని గంటల వరకు (10-16 గంటల వరకు) యోని చుట్టూ రబ్బరు లేదా ప్లాస్టిక్ సాధనం ఒకటి ఉంచి వీర్యకణాల గమన శీలతను, చైతన్యతను, చురుకుదనాన్ని కాపాడుతారు. సంయోగమంటూ జరిగితే ఆ తరువాత జరిగే తతంగం మామూలుపే. దీన్ని "ఆర్టిఫిషియల్ యిన్‌సెమినేషన్" అంటారు. ఇక "టెస్ట్‌ట్యూబ్ బేబీ" అంటే ఏమిటి ?

స్త్రీ బీజకణాన్ని కూడ వేరుచేసి శుక్రకణంతో కలిపి అనువైన వాతావరణం కలిగిన పరిస్థితులను రూపొందించి పరీక్షా నాళికలో అతి తక్కువ ఉష్ణోగ్రతలో సంయోగం జరిగేటట్లు చూస్తారు. సంయోగం జరిగాక సంయుక్త బీజకణం విభజనకు లోనవుతుంది. సాధారణంగా 8-16 కణాల దశలో సంయుక్త బీజకణాన్ని (పిండాన్ని) గర్భాశయంలోకి చేరుస్తారు ఆ తరువాత యథాప్రకారంగా పిండోత్పత్తి, పెరుగుదల, శిశుజననం యిత్యాదులు కొనసాగుతాయి. ఆ విధంగావచ్చిన శిశువును "టెస్టుట్యూబ్ బేబీ" అన్నారు. ఒక రకంగా చూస్తే ఇందులో విపరీతంకాని విచిత్రం కాని లేదు. అయితే మానవపరమైన సున్నిత వలయంలో ఇది భరించరానిది. ఏ మాత్రమూ ప్రోత్సహించదానికి వీలు కానిది. ఎందుకని?

స్త్రీ పురుషులలో పురుషుడు సంతాన ప్రక్రియలో అవిటి వాడైతే స్త్రీ మరో పురుషుని పరోక్ష సహాయంతో ("ఆర్టిఫిషియల్ యిన్‌సెమినేషన్" కావచ్చు లేదా నాళికా శిశువు లగాయితు కావచ్చు) సంతానాన్ని పొందటం ఎంత మాత్రం ఉచితమని ప్రశ్నించడం లేదు. అదెంతమాత్రం అవసరమని మాత్రమే ప్రశ్నించుకోవాలి. ఆ విధంగా పుట్టే బిడ్డ ఎవరి బిడ్డని? ఆ బిడ్డను పెంచే తండ్రి ఏ విధమైన మానసిక ఒత్తిడికి లోనవుతాడు? ఆ బిడ్డ భవిష్యత్తెలా వుంటుంది? మానసికంగా ఎటువంటి ప్రభావానికి లోనవుతుందన్నది ఆలోచించుకోవలసినఅవసరంలేదా? ఆతల్లి ఎలా ఫీలవుతుంది?- ఎవరు చెప్పాలి. ఒక స్త్రీ బీజకణాన్ని ఇస్తే మరో పురుషుడు వీర్యాన్ని దానం చేస్తే నాళికలో కొన్ని రోజులపాటు పెరిగిన ఆ పిండాన్ని మరో స్త్రీగర్భాశయంలో ప్రవేశపెడితే, ఆ పుట్టబోయే బిడ్డకు ఎవరుతల్లి? ఆ బిడ్డ పరిస్థితి ఎలా ఉంటుంది? అది ఏ విపరీత పరిణామాలకు దారి తీస్తుంది? తెలుసుకోవలసిన అవసరం మనకు లేదా? "హైబ్రిడ్" అనే మాట ఎంత హేళనగా ఉంటుందో తెలియదా?

ఒక్క మాట ...

మనిషిని జంతువుగా వర్గీకరించకూడదు. ప్రత్యుత్పత్తి క్రియను శరీర ధార్మిక క్రియగా భావించకూడదు. మనిషి కొక నిర్దుష్టమైన స్పందన ఉంది. మనోవేదన ఉంది అనుభూతి ఉంది అర్థంకాని భావుకత ఉంది. సంతాన క్రియ విశిష్టమైనది. పరమాత్ముని ప్రత్యక్ష స్పర్శకువీలుకల్పించేది. రసార్ద్రతలో ఓలలాడించేది. అద్భుతమైన అనుభూతిని అందించేది. అటువంటి మానస స్థాయిని ఆత్మ మీటే సన్నాయిని మయిల పరచటం అన్యాయం కాదా? బిడ్డలే కావాలనుకొంటే దాదాపు ప్రతి దేశంలోనూ దిక్కూ మొక్కూ లేకుండా ఆర్తికలితో అయ్యోమంటూ అమ్మా అని అలమటిస్తున్న వారెందరు లేరు? వారికి చేయూత నివ్వకూడదా?

ఇప్పుడు చెప్పండి-

నాళికా శిశుజననం పరమార్థమా? అనర్థమా?



# "ఈ కవిత..."

"పైడిశ్రీ"

ఈ కవిత
మదీయ
మస్తిష్కమంజూషాంతరాళంలో
ఏపరమాణువులోనో
భీకర విస్ఫోటం ఘటిల్లగా....
భావశకల పరంపరావకీర్ణంలో
వినిర్గమించిన అత్యల్ప పరిమాణ శకలమ్ము.

ఈకవిత
అవంత
ఊహాభువనాంతరాళాల
రచనాన్వేషణేచ్ఛా స్వేచ్ఛా చక్రభ్రమణంలో
మివుల ఉస్సిపోయి
కొండొకస్థలిలో స్థిరీకరించుకున్న
స్విన్నమయ దేంహమ్ముందుండి
సవించిన ఘర్మబిందువువోలె
వూహారూపదీర్ఘనిశ్వాసనవేళ
వెలికురికిన ఒకానొక
ఉష్ణవాయుకణమ్ము.

ఈ కవిత
వ్యధిత
విహాయసాంగణాన
పృధివీ ఉష్ణతీవ్రతా ఫలితములగు
సాంద్రనీల పయోధరచ్ఛటల నడుమ
చలితజల ధర రణ భీషణ గర్జా రోదాళ సహితమై
కనీనికా ద్వయాంతర్నిబిడ రేణువుల్ కళవెళ పడగ
రజత రువాణ రాజితమై
ధవళ దీధితీసకుతమై
ప్రభవించిన
క్షణ ప్రభనుబోలిన
ఒకానొక
కావ్యఖండికాసౌదామని
భావన మందాకినీ స్రోతస్విని.



శ్రీ కంఠంపుముక్కల లక్ష్మీనారాయణశర్మ

# యత్తదర్థకాల యథార్థం

1. సాధారణంగా వక్తకు భాషను వ్యవహరించడానికి అనేకమైన అవకాశాలుంటాయి. అందులో యత్తదర్థకాలు ఒక రకమైన రూపావళీ వ్యవస్థ. యత్తదర్థకాలు సంబంధ భావాన్ని (రిలెటివ్ సెన్స్) తెలియజేస్తాయి.[1] ఈ వాక్య నిర్మాణంలో ఉద్దేశ్యనామానికి ముందు తదర్థ బోధక శబ్దం విధేయ నామానికి ముందు యదర్థ బోధక శబ్దం వస్తాయి. యదర్థక వాక్యభాగం చివర దళార్థకం (కాంప్లిమెంటయిజర్)[2] వస్తుంది.

1 రమేష్ ఏ సినిమా చూసొచ్చాడో ఆ సినిమా నిన్ననే ఇక్కడినుంచి వెళ్ళిపోయింది.

పై దాంట్లో గీత గీచిన వాక్యభాగం యత్తదర్థకం ఏ యచ్ఛబ్దం. ఆ తచ్ఛబ్దం. ఓ దళార్థకం. పై యత్తదర్థక వాక్యాన్ని (య. వా.), క్రియాజన్య విశేషణ వాక్యంగా (క్రి. వి. వా) మార్చి చూడొచ్చును.

1 b) రమేష్ చూసొచ్చిన సినిమా నిన్ననే ఇక్కడి నుంచి వెళ్ళిపోయింది.

య. వా. లో ప్రశ్నార్థక సర్వనామం (యచ్ఛబ్దం) సంబంధ నామబంధానికి (రిలెటివ్ నౌన్ ఫ్రేస్) నిర్దేశార్థక సర్వనామం (తచ్ఛబ్దం) పూర్వవర్తిత నామ బంధానికి [యాంటిసిడెంట్‌నౌన్ ఫ్రేస్] తగిలి ఉంటాయి. తద్బోధక పూర్వాంగాన్ని తీసేయలేం. అసాధారణ ప్రయోగంలో (మార్క్‌డ్‌యూస్) పూర్వవర్తితం సందర్భం అనుమతిస్తే, పూర్వానుమితంగా (ఎనాఫోరిక్) లోపిస్తుంది.[3]

2. a) ఎవరు ఏ శాఖకు మంత్రయ్యారో తెలియదు.

b) ఎవరు ఏ శాఖకు మంత్రయ్యారో, ఆ సంగతి తెలియదు.

పూర్వవర్తిత నామ బంధంలేని వాక్యాల ప్రయోగం ఉండొచ్చని గుర్తించిన వారు ష్వార్ట్ (ష్వార్ట్‌స్, 1971) య. వా.లో వచ్చే నిర్దేశక సర్వనామం ఎప్పుడూ దూరనిర్దేశకమేకానీ సన్నిహిత నిర్దేశకం రాదు.[4] దీన్ని నడ్‌కర్ణి (నాడ్‌కర్ణి, 1970) "నిశ్చితం" (డిఫనిటయిజర్) గా గుర్తిస్తున్నారు.

3. ఎ) ఇందిర ఏ పుస్తకంకొనిచదువుతుందో ఆ పుస్తకం అట్ట బాగుంది

బి) * ఇందిర ఏ పుస్తకం కొని చదువుతుందో ఈ పుస్తకం అట్ట బాగుంది.

(* = వ్యాకరణ/వ్యవహార విరుద్ధతకు గుర్తు)

3. (బి) లో సన్నిహిత నిర్దేశక ప్రయోగంవల్ల వ్యవహార యోగ్యం కాదు. ఈ నియమం య. వా. లకు ముఖ్య లక్షణం.

2. చాలా కాలంగా య. వా. ల గురించి రెండు వాదాలు ప్రబలి వున్నాయి. ఇవి "ఇండో-ఆర్యన్" కుటుంబంలో పుట్టి "ద్రావిడ భాష"ల్లో వ్యాప్తికొచ్చాయని, వీటి వాడకం అతి తక్కువని ఒక వాదం. క్రి. వి. వాలుగా చెప్పలేని సందర్భాల్లో య. వా. లు అధికాధికంగా కన్పిస్తాయి కనుక "ఆదానం" హేతుబద్ధమైన వాదం కాదన్నది మరో వాదం. ఎక్కువ ప్రాచుర్యం, "ఆదానవాదాని"కే లభిస్తోంది.[5]

ఈ వ్యాసంలో ఆదాన వాదానికి వ్యతిరేకంగా వాదిస్తూ య. వా. లలో ఇదివరలో ఎవరూ గుర్తించని భిన్న రీతుల్ని చర్చిస్తూ, య.వా.లు ద్రావిడభాషాలక్షణమే నని ప్రతిపాదించడం జరుగుతోంది.[6] ఇందుకు ఆధారంగా భాషా సామాన్యాలపై జరిగిన పరిశోధన, క్రి. వి వా లకు య.వా లకు మధ్యగల భేదాలు, ఇండో ఆర్యన్ భాషల్లో (ఇక్కడ

ఉదాహరణ కోసం హిందీ తీసుకన్నాను) య. వా. ల భిన్నత్వం సహకరిస్తాయి.

2. 1 భాషా సామాన్యాల (లింగ్విస్టిక్ యూనివర్సల్స్) పరిశోధనలో డౌనింగ్ (1978) కర్త, కర్మ క్రియ పద క్రమం ఉన్న భాషల్లో య. వా. లు సహజ లక్షణ మని స్వీకరించారు. అప్పుడు విధానంలో అంతర్నిహితంగా రెండు సామాన్య లక్షణాలు కన్పిస్తాయని సూచించారు (డౌనింగ్, 1978: 400)

ఎ) క్రియాంతభాషల్లో య. వా. నిర్మాణం నిశ్చిత సంబంధార్థక నామబంధంతోను, న్యూనీకృతం కాని నామోద్దేశ్యాలతో ఉంటుంది. [ఉదాహరణకు వాక్యం (1) చూడండి]

బి. య. వా. నిర్మాణాలున్న భాషలో నామ పూర్వ విశేషణ సంబంధ నిర్మాణాలు (= క్రియాజన్య విశేషణ నిర్మాణాలు) ఉండవు.

డౌనింగ్ ప్రతిపాదనల్లో మొదటిది తెలుగు భాషకు నప్పుతుంది. కాని రెండవ ప్రతిపాదన భాషా సామాన్యంగా నిలవదు. తెలుగు, ఇతర ద్రావిడ భాషలు కలిపి చూచినప్పుడు, డౌనింగ్ ప్రతిపాదనకు వ్యతిరేకంగా, య. వా. నిర్మాణాలతో పాటు క్రి. వి. వా. నిర్మాణాలు కన్పిస్తున్నాయి. డౌనింగ్ పరిశీలనల్లో ద్రావిడ భాషలకు స్థానం లేదన్న అనుమానం కలుగుతోంది.

2. 1. 1 అనిశ్చితభావం ఆధారంగా నిశ్చితభావాన్ని తెలియజెప్పే య. వా. లు వాట్లిట్ భాషలోనూ ఉన్నాయి. అయితే ఆ భాషలో కన్పించే య. వా. లలో తెలుగు నిర్మాణాలలో వచ్చే దళార్థకం పుండదు. (బెరమన్, 1972)

ఈ తరహా నిర్మాణాలు చారిత్రిక పరిణామంలో తెలుగులోను (రాధాకృష్ణ, 1979 : 98), కన్నడంలోను, (సుబ్బకృష్ణ, 1981), తమిళంలోను (రామస్వామి, 1978) కన్పిస్తాయి.

4] వేగి నాట్లికెవ్వరు రాజులైరి వారు భూవన్ స్థితిం దప్పక పాలించువారు [రాధాకృష్ణ 1979-]. క్రీ॥శ॥ 17 వ శతాబ్దంనుంచీ శాసనాల్లో దళార్థకం కన్పిస్తుంది (రంగనాథాచార్యులు, 1979 : 204]

య. వా. లలో అవిరళతార్థం కన్పించదు. ఇప్పటి వరకూ జరిగిన తెలుగు పరిశోధన, ఇతర భారతీయ భాషల్లో జరిగిన కృషి [నాడ్కర్ణి: 1970, సుబ్బకృష్ణ : 1981, రామస్వామి : 1978, క్లయ్‌మన్: 1976]

ఇదే విషయాన్ని నొక్కి చెప్తున్నాయి

2.1.2 య. వా. లు, క్రి. వి. వా. లు ఒకే గుప్త నిర్మాణం నించి జనిస్తాయి.[7] విషయభేదాలవల్ల క్రి. వి. వా. కాలేనివి, య. వా. గా మారుతున్నాయి ఈ రకంగా ఏవి మారుతున్నాయో, ఏ నియమావళి ఉందో ఇంకా పరిశోధన జరిగితే గానీ అంతుపట్టవు. ప్రస్తుతం వీటి మధ్య గల తేడాలు చర్చించడం జరిగింది.

1. సహార్థక నామంతో వాక్యప్రయోగం జరిపినప్పుడు క్రి. వి. వా. ఉత్పన్నం చేయలేం. అప్పుడు య. వా. ఉపయోగించ వచ్చును.

5(a) నేను శిరీష్‌తో సినిమాకెళ్ళాను.

(b) * నేను సినిమాకెళ్ళిన శిరీష్

(c) నేను ఏ శిరీష్‌తో సినిమాకెళ్ళానో ఆ శిరీష్.

2. పంచమిలో క్రి. వి. వా శూన్యతను య. వా. ఆక్రమిస్తోంది.

6 (a) మాధవి స్కూలునుంచి వచ్చింది.

(b) ? మాధవి వచ్చిన స్కూల్

(c) మాధవి ఏ స్కూలునుంచి వచ్చిందో ఆ స్కూలు.

ఇందులో 6 (బి) "వరకు" అన్న అర్థంలో సమ్మతం కనుక "?" ఉంచడం జరిగింది.

3) విభక్త్యనుబంధాలతో [పోస్ట్‌పొసిషన్స్] నామబంధాలున్నప్పుడు య. వా. లు కన్పిస్తాయి.

7 (a) సంగీత షాపు వరకు పోయింది.

(b) ★ సంగీత పోయిన షాపు

(c) సంగీత ఏ షాపువరకు పోయిందో ఆ షాపు.

4) హేత్వర్థక నామబంధాలో య. వా. వస్తుంది.

8] ఎ. రాజీనామా వల్ల మంత్రి పదవిపోయింది.

బి. ★ మంత్రిపదవి పోయిన రాజీనామా

సి. ఏ రాజీనామావల్ల మంత్రిపదవి పోయిందో ఆ రాజీనామా.

5] తులనాత్మక నామబంధాల్లో య. వా. మాత్రం సాధ్యం

9] ఎ. నాగలి కంటె ట్రాక్టర్ తొందరగా చెడిపోతుంది.

బి. * ట్రాక్టర్ తొందరగా చెడిపోయే నాగలి

సి ఏ నాగలి కంటె ట్రాక్టర్ తొందరగా చెడిపోతుందో ఆ నాగలి.

ఇవే కాక ఉద్దేశ్యార్థక నామబంధం ఉన్నప్పుడు, కొన్ని వ్యాకరణ నియమాలు పాటించే నామబంధం ఉన్నప్పుడు [సంశ్లిష్టనామం(కాంప్లెక్స్ ఎన్. పి.), పైడ్‌పైపింగ్ ఏకరూపవిభక్తి (అయిడెంటికల్ కేస్) మొ॥] [రామస్వామి, 1978] య. వా. లు మాత్రమే సాధ్యం.

2. 2 వ్యక్తి నిర్మాణాన్ని అనుసరించి తెలుగులో అయిదు రకాల య. వా. లను గుర్తించవచ్చును. నిర్మాణాలు కింది విధంగా ఉంటాయి:

విధానం 1 [యచ్ఛబ్ద విశేషణం + నామం......క్రియ, ఓ] తచ్ఛబ్ద/నిర్దేశక విశేషణం + నామం........

" 2 [యచ్ఛబ్ద సర్వనామం....క్రియ, ఓ] నిర్దేశక సర్వనామం........

" 3 [యచ్ఛబ్దం + .... క్రియ,ఓ]ం తచ్ఛబ్దం....
(ం = రెంటికి మించినవి)

" 4 ఎ — క్రియాజన్య విశేషణం, నామం + యత్ + ఓ + తత్—

బి —నామం + యత్ + ఓ + తత్—

" 5. ....యత్ + నామం + ఓ + [నామం]— తత్— పై అమూర్త నిర్మాణాలకు ఉదాహరణలిస్తూ విశేషాలను సంక్షిప్తంగా వివరిస్తాను.

విధానం 1: 10[ఎ] ఏ నాయకులు దేశాన్ని పాలించడానికి ఉత్సాహ పడుతుంటారో ఆ నాయకులు అధికారం వచ్చేసరికి దేశాన్ని పట్టించుకోరు.

10 [బి] ఏ రాముడు సీతను పొందడానికి యుద్ధం చేసాడో ఆ రాముడు సీతను అడవిలో వదిలాడు. వీటిలో యత్, తత్ పదాల తర్వాత సామాన్య వాచకం, కానీ, సంజ్ఞా వాచకం కానీ రావచ్చును.

విధానం 2: 11 ఎ.] ఎవడు షాపుకు క్యూలో వస్తాడో వాడికి కిరోసిన్ దొరకదు.

బి] ఎవరు ఎక్కువ డబ్బిస్తే వారికి పంచదార దొరుకుతుంది.

సి] ఏది సుఖాన్నిస్తుందో అది ఆరంభంలో కష్టంగా ఉంటుంది.

సర్వనామీకరణ వైరళ్యం ఇక్కడ గమనించాల్సిన విషయం. ఇది రెంటిలో ఏ ఒక్క దానికైనా కావచ్చును. కనుక వైకల్పికం.

12] (i) సాధారణంగా ఎవడు హీరోగా వేస్తాడో
ఆ మనిషికి / ఆ వ్యక్తికి } అరవై ఏళ్ళుంటాయి.

(ii) [ఏ మనిషి / ఏ వ్యక్తి } హీరోయిన్‌గా వేస్తుందో ఆమె అసలు వయసు చెప్పకుండా దాచుకుంటుంది.

యత్తదర్థక శబ్దాలు ద్విరుక్తంగా వచ్చినప్పుడు సర్వనామాలుగా వస్తాయి. విశేష్యాలుగావర్తించవు. ఈ సందర్భంలో సర్వతా పదర్థకం కన్పిస్తుంది.

13] ఎ. క్లాసు ఎవరెవరు ఎగ్గొట్టారో వాళ్ళువాళ్ళు టీచర్ రాగానే భయపడ్డారు.

బి. వాడికి ఏదేది తాగాలన్పిస్తుందో అదది తాగుతాడు.

14] ఎ. క్లాసు ఎవరెవరు ఎగ్గొట్టారో వాళ్ళందరూ టీచర్ రాగానే భయపడ్డారు.

బి. వాడికి ఏదేది తాగాలన్పిస్తుందో అవన్నీ తాగుతాడు.

విధానం3: వాక్య నిర్మాణంలో సంబంధార్థకాల గుత్తి (నెస్ట్/బన్‌చ్) ఉంటుంది. యచ్ఛబ్దాలు ఎన్ని

యినా ఉండి ఒకే తచ్ఛబ్దతో ముడిపడుతుంది. కింది వాక్యంలో మూడు యచ్ఛబ్దాలు, ఒక తచ్ఛబ్దం ఉంది.

15) ఈ రోజుల్లో ఎన్నికల్లో, ఎవరు ఎక్కువ ఖర్చు పెడ్తారో, ఎవరు మీటింగులు ఎక్కువపెట్టిస్తారో, ఎవరు డాబుసరిగా కన్పిస్తారో, ఎవరు జనాన్ని ఆకట్టు కుంటారో వాళ్ళు గెలుస్తారు.

నాల్గవ విధానంలో దళార్థకం యచ్ఛబ్దానికే చేరుతుంది. ఇది అసాధారణ (మార్క్‌డ్) ప్రయోగం. నామానికి ముందు క్రియాజన్య విశేషణమూ ఉండవచ్చును.

16) మస్కా కొట్టినవాడెవడో వాడు ఫలితం పొందుతాడు.

17) అణుసంపద మానవుని ఉన్నతికి ఎలాగో అలాగ మానవుడి పతనానికి కారణం అవుతుంది.

పై వాక్యాలు పరివర్తన చెందని కింది వాక్యాలతో సమానార్థకాలు.

17 ఎ. మస్కా ఎవరు కొట్టాడోవాడు ఫలితం పొందుతాడు.

బి. అణుసంపద మానవుని ఉన్నతికి ఎలాగ తోడ్పడుతుందో అలాగ మానవుడి పతనానికి కారణం అవుతుంది.

అయిదవ విధానంలో [క్రియారహిత] సమీకరణ వాక్యాలు కన్పిస్తాయి.

18. నీకు ఏది చేయడానికి ఇష్టమో నాకు అది చేయడానికి ఇష్టం.

దీని గుప్త నిర్మాణ సంబంధి వాక్యం కింది విధంగా ఉంటుంది.

19. నువ్వు ఏది చేయడానికి ఇష్టపడ్తావో నేను అది చేయడానికి ఇష్టపడ్తాను.

అయిదవ విధానంలో దళార్థకం నామానికే వచ్చి చేరింది. నాల్గవ విధానం [16, 17] మీదట ఇది మరీ విలక్షణం. క్రియకే చేరాలన్న సూత్రానికి ఇది మరో వ్యవస్థ.

2. 3 ఇప్పటి వరకూ సూచించిన విధానాలు ఒక మూసలో ఉన్నవయితే ఇప్పుడు సూచించబోయే విధం ప్రత్యేక లక్షణం కలది. య. వా. లు చేదర్థక రూపాలతో ప్రయోగింపబడటం. ఈ వాక్యాలలో చేదర్థకమే "దళార్థకం"గా కన్పిస్తుంది. చేదర్థక ప్రత్యయానికి భాషలో అదనపు ప్రయోజనం ఉందన్నమాట. ఈ విషయాన్ని భాషాశాస్త్రజ్ఞులెవరూ గుర్తించినట్లు కన్పించడం లేదు. ఈ విధానంలో అధికంగా "అను" "పడు" ధాతువు చేదర్థక రూపాలు కన్పిస్తున్నాయి. ఇతర క్రియలతో ఈ తరహా ప్రయోగం కన్పించినా తక్కువగానే ఉన్నాయి. వరుసగా ఉదాహరణలు గమనించండి:

20] ఎ వాడు తాగినప్పుడు ఎక్కడంటే అక్కడ పడిపోతాడు

బి. వాడు తాగినప్పుడు ఎక్కడ పడితే అక్కడ పడిపోతాడు.

21. ఎ. లోకంలో ఎవరినంటే వాళ్ళని నమ్మలేం.

బి. లోకంలో ఎవరిని పడితే వాళ్ళని నమ్మలేం.

22. ఎ. ఏదడుగుతే అదిస్తామంటారు నాయకులు ఎన్నికలకు ముందు.

బి. ఏదిపడితే అదిస్తామంటారు నాయకులు ఎన్నికలకు ముందు

23. ఎంత తింటే అంత పని చెయ్యాలి.

పై వాక్యాల్లో 20 (ఎ), 21 (ఎ), లు "అను" ధాతువు చేదర్థకంతోను, 20 (బి), 21 [బి], 22 [బి]లు "పడు" ధాతువు చేదర్థకంతోను ప్రయుక్తాలయ్యాయి. "అను" ధాతువుతో ఉపయోగించే వాక్యాల్లో అధికభాగం "పడు" ధాతువుతో ప్రయోగించినా అర్థబోధకు ఆటంకం కలగటం లేదు. రెంటికీ మధ్యవున్న సంబంధం ఏమిటో ఇంకా బోధపడటంలేదు. ఈ సందర్భంలో వాక్యంలో సంజ్ఞానామం ప్రయోగిస్తే వ్యాకరణ విరుద్ధ మవుతుంది.

24) ఎ. * ఏ రాముడంటే ఆ రాముడు

బి. * ఏ రాముడు పడితే ఆ రాముడు

2. 4 ప్రయోగాలు తక్కువైనప్పటికీ వాట్టైట్ భాషలో సాధ్యమయే తచ్ఛబ్ద సాధనంలో భిన్న రూపనామబంధం [నాన్ అయిడెంటికల్ నౌన్ ఫ్రేస్] తెలుగులో మా కన్పిస్తుంది.

25) ఏ లతకి మోహన్ వణికి భయపడ్డాడో ఆ నీడ తన ముందు నిలబడటం చూచి ఆనందించాడు. ఇక్కడ యచ్ఛబ్ద నామం [లత], తచ్ఛబ్దనామం [నీడ] భిన్నమే కాక, ప్రాణి, అప్రాణి వాచ సంబంధి భేదాను చూపుతోంది. యచ్ఛబ్దనామానికి తచ్ఛబ్దనామానికి రూపసామ్యం [ఫార్మల్ అయిడెంటిటీ] లేకపోయినా భావ/అర్థసామ్యం [సెమాంటిక్ అయిడెంటిటీ] ఉంటే ఇలాంటి వాక్యాలు సాధ్యమని బెరమన్ [972] అభిప్రాయం. పై వాక్యంలో నీడ అప్రాణివాచకమైన లత తో భావంలో సమానం కనుక వ్యవహార యోగ్యం.

3.1 వ్యాసం ప్రారంభంలో "ఆదాన వాదానికి వ్యతిరేకంగా" క్రి. వి. వా. లకు, య. వా. లకు మధ్యగల కొన్ని భేదాలు వివరించడం జరిగింది. వీటికి మరో భేదాను అదనంగా జతచేయవచ్చును.

క్రి. వి. వా. లో భిన్నార్థాలు రావచ్చును. కాని, య. వా. ప్రయోగంలో ఇది సాధ్యం కానే కాదు.

26. చంపిన పులి....ని రెండు రకాలుగా అర్థం చేసుకోవచ్చును.

26] ఎ. పులి ఎవర్నో చంపింది

బి. ఎవరో పులిని చంపారు.

ఈ రెంటినీ య. వా. లు వేరుగా చూపుతాయి కనుక భిన్నార్థం స్ఫురించదు.

27] ఎ. ఏ పులి చంపిందో ఆ పులి....

బి. ఎవరు పులిని చంపారో వారు....

ఇప్పటి వరకూ గుర్తించిన భేదాలను సంక్షిప్తంగా చెప్పుకోవాలంటే అవి :

ఎ] కొన్నినామవాచకాలకు విధేయాలుగా య. వా. లు మాత్రమేసాధ్యం. క్రి. వి. వా లురావు. (2. 1. 2) రెండవ నామబంధం(పూర్వవర్తితం) క్రి. వి. వా. లో ఉండదు కనుక

(బి) క్రి.వి. వాలు భిన్నరూప నామబంధాలతో సాధ్యం కావు [2. 4].

సి] క్రి. వి. వా లో ఇది [పూర్వవర్తితనామబంధం] లోపించే ప్రసక్తే లేదు.(2.1)

డి] సంబంధనామబంధం, పూర్వవర్తిత నామబంధం విడిగా య. వా. లలో కన్పిస్తాయి కనుక భిన్నార్థం రావడానికి అవకాశం లేదు.

3. 2. తెలుగులోను [ఇతర ద్రావిడ భాషల్లో] విస్తృతంగా కనిపించే య. వా. లు (2. 2 ముఖ్యంగా విధానం 4&5, 2.3) హిందీలోను [ఇతర ఇండో ఆర్యన్ భాషల్లో] కన్పించవు. ఉదాహరణకి [హిందీలో] ....(తెలుగు ఉదాహరణకు 16, 17, 18, 9, 20 వాక్యాలు గమనించండి)

28) ★ ఝూట్ బోల్నే వాలే జో ఉన్హే సజీపానా చాహియే (అబద్ధం చెప్పేవారెవరో వారు శిక్ష పొందాలి)

29] • సినెమా మానవ్‌కే ఖుషీ కె లియె జైసె వైసె హి ఉస్‌కి బర్బాదీకిభీ కారణ్ హై

[సినిమా మనిషి సుఖానికెలాగో అలాగే నాశనానికి కారణం అవుతుంది]

30] ? వో సోయేతో జిధర్ బోలేతో ఉధర్ ముడతా హై (వాడు నిద్రపోతే ఎక్కడంటే అక్కడ కదులుతాడు)

ఇందులో (30) ప్రామాణిక హిందీలో వ్యవహార విరుద్ధం. దక్కనీ ఉర్దూ హిందీలో వ్యవహార యోగ్యం. ఈ లక్షణం నిస్సందేహంగా తెలుగు భాషా ప్రభావమే.

తెలుగులోనూ (ఇతర ద్రావిడ భాషల్లోనూ) హిందీలో కన్పించే నామదళ పరివృత్తి [ఎక్స్‌ట్రా పొసిషన్] గల య. వా. లు కన్పించవు.

31) ఎ వొ గ్లాస్, జిస్ మే షరాబ్ హై, మేరా హై.

బి. వొ కవీ, జిస్ నే యెషాహిరి లిఖీ, బహుత్ ప్రసిద్ధ్ హై.

32) ఎ. ★ ఆ గ్లాసు, దేంలో సారాయి ఉందో, నాది

బి. • ఆ కవి, ఎవరు ఈ కవిత్వం రాసాడో, చాలా ప్రసిద్ధుడు.

పై ఉదాహరణలు (28–32) ద్రావిడ భాషల, ఆర్య భాషల య. వా. ల. నిర్మాణాల తీరు తెన్నులు, భేదాలు స్పష్టంగా ఎత్తి చూపుతున్నాయి.

3. 3 ఇంతకు ముందు విభాగాలలో చూపించిన లక్షణాలను ఆదాన వాదానికి వ్యతిరేకంగా వాదిస్తూ సూచిస్తే. అవన్నీ ద్రావిడ భాషా లక్షణంగానే బలపరుస్తాయి. వీటితో పాటు య. వా. లలో ఇమిడి ఉన్న కొత్త విశేషాలు తెలిసాయి. అన్నింటిని సంగ్రహంగా ప్రస్తావిస్తే :

యత్తదర్థకాలు ఆదానాలు కావనడానికి—

1. క్రియాంత భాషలకు య. వా. లు యాదృచ్ఛికం కానీ ఆదానం కానీ కావు. భాష స్వభావం రీత్యా ఏర్పడ్డవన్న డౌనింగ్ వాదంలో సామంజస్యం కన్పిస్తోంది. కనుక ఇవి తెలుగులోను ఉండొచ్చు, హిందీలోను ఉండొచ్చును. ఎందుకంటే క్రియాంత భాషలే కనుక.

2. ప్రపంచ భాషల్లో య. వా. ల ప్రయోగంలో యత్తచ్ఛబ్దాలు ప్రయోగిస్తారన్నది నిర్వివాదంగా తేలిన అంశం. అటువంటప్పుడు తెలుగులో యత్తర్ధక శబ్దాల వ్యాప్తి ఆదాన పరంగా జరిగిందనడం వృథావాదం.

3. య. వా. ల కు తెలుగులో కన్పించే విస్తృత ప్రణాళిక హిందీలో కన్పించడం లేదు. అలాగే హిందీలో కన్పించే కొన్ని విధానాలు తెలుగులో కన్పించవు. కనుక య. వా. ల ఉనికి, ఉత్పత్తి గురించి అనుమానించాల్సి వస్తోంది.

4. క్రి. వి వా. లు రానిచోట్ల య. వా. లు కన్పించి ప్రత్యేక ప్రయోజనాన్ని సంతరించుకున్నాయి.

5. ఏ లక్షణ నిర్ణయానికైనా వ్యాప్తి ఒక్కటే కొలమానం కాకూడదు. వ్యాప్తి తక్కువగా ఉన్నంత మాత్రాన ఆదానం అని భావించాల్సిన పనిలేదు.

యత్తర్థకాల్లో సూచించే ప్రత్యేక లక్షణాలు ఏవంటి--

1. భిన్నార్థాలకు స్థానం ఈయవు.
2. చేదర్థక రూపాలకు దళార్థక ప్రయోజనం కల్పించి య. వా. లలో ప్రయోగించవచ్చును.
3. పూర్వవర్తిత నామబంధం అప్పుడప్పుడు లోపించవచ్చును. లేదా భిన్న రూపంతో ఉండవచ్చును.
4. నామదళ పరివృత్తి విధానంలో కన్పించవు.

ఇప్పటివరకూ జరిపిన సుదీర్ఘ చర్చ, వాటి ఫలితాలు శాస్త్రపండితుల్లో కలవరం కలిగిస్తే ఈ వ్యాస ప్రయోజనం నెరవేరినట్లే.

## రిఫరెన్సెస్


అణ్ణామలై యూనివర్సిటీ, 1978 : సెమినార్ ఆన్ ద్రవిడియన్ సింటాక్స్, సి. ఎ. ఎస్. ఇన్ లింగ్విస్టిక్స్, అణ్ణామలై నగర్.

బెర్మాన్, హవార్డ్, 1972 : రిలేటివ్ క్లాజ్ ఇన్ హిట్టయిట్ (కోటెడ్ ఇన్ గ్రీన్ బర్గ్, 978)

కాల్డ్వెల్, 1913 : ఎ కంపారిటివ్ గ్రామర్ ఆఫ్ ది ద్రవిడియన్ ఆఫ్ సౌత్ ఇండియన్ లాంగ్వేజెస్, ఓరియంటల్ బుక్స్ రీప్రింట్,కార్పొరేషన్,ఢిల్లీ. (I ఎడిషన్ '974)

డవ్నింగ్, బి. టి. 1978 : "సమ్ యూనివర్సల్స్ ఆఫ్ రిలెటివ్ క్లాజ్ స్ట్రక్చర్" ఇన్ గ్రీన్ బర్గ్ (1978)

గ్రీన్బర్గ్, జె. హెచ్. 1978 : యూనివర్సల్స్ ఆఫ్ హ్యూమన్ లాంగ్వేజ్, వాల్. 4, సింటాక్స్, స్టాన్ ఫోర్డ్ యూనివర్సిటీ ప్రెస్, కాలిఫోర్నియా.

కంపప్పచెట్టి, ఎమ్, 1979 : "శాసన భాషాపరిణామం" కృష్ణమూర్తి (1979) లో

క్లెయిమాన్, ఎన్ హెచ్. 1976 : "టాపికలయిసేషన్ ఎండ్ రిలేటివయిసేషన్ ఇన్ హిందీ"ఇండియన్ లింగ్విస్టిక్స్ వాల్ 37, నెం.3.

కృష్ణమూర్తి, బి. హెచ్, (ఎ ) 1979 : తెలుగు భాషా చరిత్ర, ఎ. పి. ఎస్. ఎ. హైదరాబాద్. (మొదటి ముద్రణ 1975)

నాడ్కర్ణి, ఎమ్. వి. 1970 : ఎన్ పి. ఎంబెడ్డింగ్ స్ట్రక్చర్స్ ఇన్ కన్నడ అండ్ కొంకణి, అన్ పబ్లిష్డ్ పి. హెచ్ డి. థీసిస్, యూనివర్సిటీ ఆఫ్ కాలిఫోర్నియా, లాస్ ఏంజెలిస్.

రంగనాథాచార్యులు, కె.కె. 1979 : "శాసనభాషా పరిణామం" కృష్ణమూర్తి (1979) లో

రాధాకృష్ణ, బి, 1979 : "ప్రాచీనాంధ్రం : శాసనభాషా పరిణామం," కృష్ణమూర్తి (1979) లో

రామస్వామి, కె, 1978 : "కొ-రిలేటివ్ రిలేటివ్ క్లాజెస్ ఇన్ తమిళ్" ఇన్ అణ్ణామలై యూనివర్సిటీ (1978)

రామారావు, సి, 1976 : తెలుగు వాక్యం, ఎ. పి. ఎస్ ఎ. హైదరాబాద్.

1979 : "ఆధునిక భాష-సంగ్రహవర్ణనం" కృష్ణమూర్తి [1979] లో

రామారావు, కె. 1982 : కోయాసింటాక్స్, పి. హెచ్. డి థీసిస్ (టు బి సబ్మిటెడ్), ఉస్మానియా యూనివర్శిటీ హైదరాబాద్.

ష్వార్ట్స్, ఆర్థర్. 1971 ; జనరల్ యాస్పెక్ట్స్ ఆఫ్ రిలెటివ్ క్లాజ్ ఫార్మేషన్ (కోటెడ్ ఇన్ గ్రీన్‌బర్గ్, 1978)

సుబ్బకృష్ణ. ఆర్. 1981 : రిలెటివ్ క్లాజెస్ ఇన్ కన్నడ, అన్‌పబ్లిష్డ్ పి. హెచ్. డి. థీసెస్, అణ్ణామలై యూనివర్శిటీ, అణ్ణామలై నగర్.

ఉషారాణి, ఎ. 1980 : రిలెటివయిసేషన్ ఇన్ తెలుగు, అన్-పబ్లిష్డ్ ఎమ్. ఫిల్. థీసిస్, ఉస్మానియా యూనివర్శిటీ, హైదరాబాద్.

## అధోజ్ఞాపికలు :

1. తెలుగుభాషలో సంబంధభావం మరో మూడు రకాలుగా ఉంటుంది.

1. క్రియాజన్య విశేషణాలు లేదా విభక్త్యర్థక నామ్నీకరణాలు లేదా లుప్త విభక్తిక నామ్నీకరణాలు. వాడు ముట్టజెప్పిన లంచం (వాడు లంచం ముట్టజెప్పాడు)

2 అర్థ సంబంధ బోధక ఉపవాక్యాలు [పెరిఫ్లాసల్స్] జనార్ధన్ చూసొడే ఆ సినిమా (జనార్ధన్ సినిమా చూసాడు)

3. (సంబంధబోధక) మిథ్యాబంధాలు (సూడోరిలేటివ్స్) ఆ ప్రోగ్రాంలు ఏవైతే ఉన్నాయో అవి భోగస్‌వి. వీటిల్లో 2 ని యత్తదర్థకాల్లో అంతర్విభాగంగా ఉషారాణి [1980] గుర్తిస్తున్నారు. ఇది కాక సంబంధార్థకాల అర్థబోధనలో విరళత, అవిరళత (రిస్ట్రిక్టివ్) నాన్ రిస్ట్రిక్టివ్ సెన్స్ ఉండొచ్చును.

2 యత్తదర్థకాల మధ్య కన్పించే "ఓ" శబ్దాన్ని దళార్థకంగా ఉషారాణి (1980) గుర్తిస్తున్నారు.

ద్రావిడ భాషల పరిశోధనకు జీవితాన్ని అంకితంచేసిన కాల్డ్‌వెల్ (1916) దృష్టిలో "ఓ" సందేహార్థకం. ప్రశ్నార్థక రూపానికి ["ఆ" — వస్తావా ?] బలహీనరూపం [వీక్ ఫారమ్] ప్రశ్నార్థకం అంతంలో ఉండే సర్వనామరూపాలు సంయుక్తాలు (ఎక్కడో, ఎప్పుడో మొ||). అంతే కానీ ప్రశ్నార్థక ద్విరుక్తి కాదని అభిప్రాయం. ఇవి ప్రశ్న, సందేహాల కలయిక. ఏమైనా దీన్ని గురించి ఇంకా తెలుసుకోవాలి.

3. సర్వనామం లోపించటానికి వీల్లేదని ఉషారాణి [1980 : 26] వాదిస్తోంది.

3. ఇక్కడే కాక శాసనభాషలో తదర్థక శబ్దాలు లోపించిన ప్రయోగాలు (కందప్పచెట్టి, 1979 : 171) అనేకం ఉన్నాయి. ఇందులో యదర్థకంబహువచనంలోను (ఎవరు) తదర్థకం ఏకవచనంలోను [వాడు, అది] ప్రయోగించడం గమనించాల్సిన విషయం.

4. ఇదే నియమం క్రి. వి. వా. లకు వర్తిస్తుంది. ఉదా : వచ్చిన వాడు, వచ్చిన వీడు. అయితే ఇక్కడ తదర్థకబోధకతలేదని రామారావు(1979:196) వాదిస్తున్నారు.

5. ఇటీవలి పరిశోధనలో [ఉషారాణి, 1980] ఈ విషయంమీద ఏ అభిప్రాయం వ్యక్తంగాలేదు. లోగడ రామారావు[1975 : 56] యత్తర్థక వాక్యప్రయోగం ఆర్యభాషల్లో అధికం అని భావించారు.

6. ఇటీవలే సుబ్బకృష్ణ [1981] కన్నడ భాషకు ఈ వాదం అనుసరించారు. ప్రస్తుత వ్యాసానికది ఉత్తేజం. రామారావు, కె. [1982] కోయభాషకూ ఈ వాదాన్ని విస్తరించాలన్న అభిప్రాయంలో ఉన్నారు.

7. క్రి.వి.వా. లు య.వా.లు భావపరంగా [కాన్‌సెప్ట్] ఏకంగాఉన్నా విషయపరంగా [థీమ్] వేరనీ అనుకోవచ్చును. [రామస్వామి, 1978]

కృతజ్ఞతలు:- ఈవ్యాసం చిత్తుదశలో ఉండగా, చర్చలలో తోడ్పడిన ఆర్. సుబ్బకృష్ణ, కాచినేని రామారావులకు రచయిత ధన్యవాదాలు తెల్పుకుంటున్నాడు.

# క వి చా వ డు

## శ్రీ నందిని సిధారెడ్డి

కవి చావడు!
కవి ఫీనిక్స్,
బూడిదలోంచి మెల్లగా మళ్ళీ నిదురలేస్తాడు.
కవి చావడు—
కాగితమ్మీదికి సరిత్ప్రవాహాల సంచలనాలు మళ్ళించ టానికి
చౌరస్తా మీద ఒంటిగా నిలబడి
తదేకంగా తపసు చేస్తుంటాడు.
మాటలు ఒకటొకటే వొచ్చి
అలా
వాలి
చెట్టు కొమ్మల మీద సేదదీరుతుంటాయి
వీరుడు మరణించడు!
కవి వీరుడు,
అగ్నిముఖంతో అమ్ములపొదితో
అచంచలమైన ఆత్మ చేతనతో
యుద్ధయాత్ర చేస్తాడు.
కదన రంగంలో నేలరాలిన ఒక్కొ అక్షరంలోంచి
వందల కొద్దీ
నయన శిఖాసమూహాలు లేచొస్తాయి.
సూర్యుడస్తమించడు!
కవిసూర్యుడు,
ఎప్పటి కప్పుడు కొత్తగా పలకటానికి
ఆత్మారణ్యంలో
అజ్ఞాత వాసం చేస్తాడు.

రాత్రి పచ్చిగా ఉంటుంది.
కవి నిద్రపోడు—
రెండు పర్వతాలు కూలినట్టు
రెండు శబ్దాలు చేసి
గడియారం చకచకా సాగిపోతుంది.
కవికి నిద్రుండదు—
అన్ని అవయవాలూ మేల్కొని
అనవరతం ఆలోచిస్తూ ఉంటాయి.
నిజమైన కవి ఎప్పుడూ మేల్కొనే ఉంటాడు!
రాత్రి రెండు గంటలప్పుడు
మెర్క్యురీ నగల్తో మెలికలు దిరుగుతున్న హైద్రాబాద్‌ని ఆలోచిస్తుంటాడు.
రెండు గంటలప్పుడు
బుల్డోజర్ గాయాల్లోంచి తేరుకోని
గుడిసెల గుబులు గుండెకోత వింటాడు.
రెండు గంటల రాత్రి
కట్టేసిన మేకల్ని చూస్తాడు.
శిలాసదృశస్థలాల్ని చూస్తాడు.
రెండు గంటల నిండురాత్రి
సెంట్రల్ జైల్లో
దిగాలు పడి కూమన్న ఖైదీలవేదన వింటాడు.
ముప్ఫయినాల్గు సంకీర్ణరాగాల ఇండియాని వింటాడు.
ఐరిష్ ఖైదీల ఆత్మార్పణలో
బాబీశాండ్స్ ఆలాపన వింటాడు.

రెండు దాటి
మూడో పర్వతం విరిగి పడుతుంది
మూడు ప్రపంచాల మృదంగ మహాయజ్ఞం సాగుతూ
ఉంటుంది.
క్షతపవనాలు తీవ్రావేశంతో ఖడ్గోచ్చారణ చేస్తాయి
కాగితాలమీంచి
మాటలన్నీ రెపరెపలాడుకుంటూ వొచ్చి సైన్యంలో
కలుస్తాయి.
మంచుకాదు
మనిషి కరిగి ప్రవహిస్తాడు!

కవిచావడు–
విశ్వజీవనంలో ఎప్పుడూ చావని నది–కవి
ఉదయం కవి
రెక్కలార్చి ఎగిరిన పక్షి కవి
ప్రథమ సంగమం స్ఫురించినవాడు కవి
చనుబాలిచ్చి పెంచిన తల్లి కవి
మాటతో మౌనాన్ని ఖండించినవాడు కవి
మొట్టమొదట మట్టినాడి పట్టినవాడు కవి
మొక్క నాటిన వాడుకవి
మోటగొడుతూ గొంతెత్తినవాడు కవి.
మొట్ట మొదట నిప్పు పుట్టించినవాడు కవి
మంట పెట్టినవాడు కవి
మంటలా భగభగా మండిన వాడుకవి
రెండుచేతుల్తో
జనప్రపంచాన్ని తడిమిచూసిన వాడుమహాకవి!
నిజమైన కవి చావడు–
మాటల్తోనో
మంటల్తోనో
మౌనాన్ని జ్వాలన చేసుకుంటాడు.
నాగలికర్రతో
భూవిపంచిని మీటుతూ అజరామరంగా సాగిపోతాడు
అడవిమీదుగా
అంబుధి మీదుగా
ఆకాశం మీదుగా
కదన గీతాలు కణకణలాడుతూ కదులుతాయి.

# కన్నీటి పాట!

## శ్రీ ఏ. సూర్య ప్రకాశ్

తెలుగు జనానికి తెలుగుజీవనానికి దూరమైన
మద్రాస్సిటీలోని సినీ స్టూడియోలో
వేలాది రూపాయలు ఖర్చుచేసి
వేసిన పూర్ గుడిసెసెట్టు చూసి
వెక్కి వెక్కి ఏడ్చిన చిత్రకవి
గిరుక్కున వెనక్కి తిరిగి
ఫైవ్‌స్టార్ హోటల్లోని
ఎయిర్ కండిషన్డ్ రూమ్‌లో బీర్‌బలుడై
ఎక్స్‌ట్రా సమేతుడై
పన్నీరులో జలకమాడి
పవర్‌ఫుల్ ఫీలింగ్స్‌ను
ట్రాంక్విలిటీలో రికలెక్ట్ చేసుకుని
కార్చిన గ్లిసరిన్ కన్నీరు
సినిమా పాటై జారి
ఏసీ థియేటర్లో వరదై పారి
చిలకగా మారి
కాఫీ హోటల్లోని
రికార్డ్‌ప్లేయర్ నోటిగూటిలోంచి
పిల్లగాలిలో తేలి
తెలుగు చెవిపై వాలుతుంది కాని
తెలుగుదనాన్ని ప్రతిఫలిస్తుందా
తెలుగు గుండెను కదలిస్తుందా!



డా॥ యు. ఎ. నరసింహమూర్తి

# కవిత్వము - ప్రమాణము

"నైకత్ర శక్తి విరతిః క్వచిదస్తి సర్వే
భావాః స్వభావ పరినిష్ఠిత తారతమ్యాః" వ. జీ. 2.6

శక్తికి అంతమనేది ఎక్కడాలేదు. వస్తువులన్నీ తమ తమ స్వభావంచేత ఏర్పడ్డ తారతమ్యం కలిగి వుంటాయి అని కుంతకుని మాట. ఇది అన్నిటికీ వర్తించే మాటే. విరామంలేని కావ్యార్థాలకు కూడా ఇది వర్తిస్తుంది కవులు నిరంకుశులని పేరుపడ్డారు. తమకు తోచిన విధంగా లోకాన్ని మార్చగలమన్న కవుల ధీమా ఈనాటిది కాదు. మార్పు జీవంగా గల కవిత్వానికి కట్టుబాట్లు కల్పించాలనుకోవడం రామకృష్ణ కవి చెప్పినట్లుగా ఒడ్డు తీరిపారే ఏటికి వంకలు నొక్కాలనుకోవడమే. ఐనా కవిత్వానికి కొన్ని ప్రమాణా లేర్పడ్డాయి. కవిత్వం నలుగురినీ ఆకర్షించాలను కోవడమే ఇందుకు కారణం కవులు తమ ఆకాశాలు లోకాలకు చేరువ కావాలను కుంటారు కాబట్టి "నవ్వి పోదురుగాక నాకేటిసిగ్గు" అనే తీరు కంటె "వినండి మీరంతా-రనండి నా పంథా" అనే మార్గాన్ని అనేక మంది వరిస్తారు. కవిత్వం అందరిక్కీ చెందినదనే భావం ఏర్పడడం ద్వారా ఆ సంబంధాన్ని తేట వరచే ప్రయత్నంలో కొన్ని ప్రమాణాలేర్పడ్డాయి. "నా యిష్టం వచ్చినట్లు చేస్తాను" అన్న పతాభికిగాని, "యథా స్మైరోచతే విశ్వం తథేదం పరివర్తతే" అన్న ప్రాచీనుడికి గాని స్థిర ప్రమాణాల లక్ష్యం లేకపోవచ్చును. కాని ఆ స్వేచ్ఛ నూతన ప్రమాణాలను సృష్టించేవిగా వుండాలి. అలా కాకపోతే అది కేవలం గాలిలో కత్తులు తిప్పడం కాగలదు. స్వేచ్ఛ-ప్రమాణం అనే సవతుల్ని సమతూకంలో నిలపడంలో కవి పస తేలుతుంది. ఈ చిక్కు కవిత్వానికి చేవ.

"సంప్రదాయాన్ని జీర్ణించుకన్న
ప్రయోగాన్ని
ప్రయోగాలలో జీవించుతున్న
సంప్రదాయాన్ని"

అన్న నారాయణరెడ్డిగారి ధోరణిదీనికి వివరణ.

వస్తువు, సంఘటన, అభివ్యక్తి మొదలైన కవితా సంబంధమైన మౌలికాంశాల నిర్వహణలోని ఔచిత్యాన్ని దృష్టిలో పెట్టుకొని ప్రాచీనులు కొన్ని ప్రమాణాలేర్పరచారు. అయితే రమణారెడ్డిగారి లాగానే ప్రాచీనులు కూడా "ప్రమాణాలు శిలాశాశ్వతాలు కావు" అని విశ్వసించేరు. అందుకే ఎప్పటికప్పుడు కవిత్వాన్ని అభిన్న ముద్రగా తెలిసి కొని ప్రమాణాల కోసం నిరంతరాన్వేషణ కొనసాగించేరు. కవిత్వానికి చెందిన ప్రమాణాలను నెలకొల్పేవారు కవులే. వాటిని విశ్లేషించి క్రమబద్ధం చెయ్యాలనుకునేవారు ఆలంకారికులు. ఆలంకారికులు కవుల వాక్యాలను ప్రమాణాలుగా చూపడం వాడుక. వేరొక ఆలంకారికుడు మాత్రమే ఆలంకారిక, వాక్యాలను ప్రమాణాలుగా అంగీకరించడంగాని, త్రోసి రాజనడం గాని చేస్తాడు. కవులకు ఈ అలవాటూ లేదు అవసరమూ లేదు. ఐనా ఆధునికులు ఆలంకారికులనే నిరంకుశులన్నారు స్వేచ్ఛ గొప్ప చిత్రమైనది. దాని రూపం నిరంకుశత్వంగా బయల్పడే అవకాశం ఎక్కువ. మేధా జనితాలైన ప్రమాణాలు ప్రజాస్వామ్య విరుద్ధమైనవి అనే బ్రౌన్‌వెల్ మాట ఈ అభిప్రాయాన్నే చెప్తూ ది. మన ఆలంకారికుల ప్రమాణాలలో తర్కానికి స్థాన మెక్కువ. కవుల ప్రమాణాలు ఎక్కువగా మనసు నాశ్రయించుకుని రూపొంది నవి. ఈ రెండూ కొంచెం ఎక్కువ, తక్కువలుగా కలియడ

మనేది కూడా సాధారణమే. తార్కిక ప్రమాణాలు కవులకు తోవ చూపేవిగా ఉన్నంతకాలం చలామణీలో వుంటాయి. హద్దులేనంత అదుపును చలాయించాలనుకున్నప్పుడు నెట్టి వెయ్యబడతాయి. నియమం నుండి పుట్టిన బింకం కవికి, సహృదయుడికి ప్రమాణాలపట్ల సహజవైరాన్ని కల్పిస్తుంది. అప్రయత్నము, నిర్నిరోధము అయిన అభివ్యక్తిగల ప్రతిభాపరిస్పందానికి ప్రమాణాలకు సంఘర్షణ ఏర్పడవచ్చును. వీటి ఫలితంగా అంతకు ముందు నిలకడ పొందిన ప్రమాణాలమీద తిరుగుబాటు లేచి ప్రమాణాలులేని స్థితి ఏర్పడడంగాని, నూతన ప్రమాణాలు రూపొందడంగాని జరుగుతుంది. "భామహుణ్ణి వాడిబావమరదుల్ని అరగంట కొకసా ఉటంకించే వాడి" మీద నగ్నమునికున్న వైరం ఇందులో మొదటి కోవకు చెందుతుంది. అర్థమనర్థమని అనుభవమే నగ్నంగా ఆలాపన చేస్తానన్న నారాయణబాబు పంథా రెండో కోవకు చెందుతుంది.

ఆధునిక కవిత్వాన్ని ఆధునిక సూత్రాలతో కాక ప్రాచీన ప్రమాణాలతో పోలిస్తే అది కవిత్వం కాకుండా పోతుందన్నారు వెల్చేరు నారాయణరావుగారు. ఈనాటి కవిత్వానికి ప్రాచీన అలంకార శాస్త్రాలు సర్వత్రా ప్రమాణాలు కావని కాంతారావుగారు కొంత మినహాయింపు చూపించేరు. ఇక్కడ కూడా పట్టూ విడుపూ అవసరమే. "తన్నాస్తి యన్న రసభావముపై తిలోకే" అన్నది ప్రాచీన ప్రమాణం. "కాదేదీ కవిత కనర్హం" అన్న శ్రీశ్రీమాట ఆధునికులకు ప్రమాణం. "రసవదేవ నిబంధనం యుక్తః" అన్నది ప్రాచీనప్రమాణం. "కానీవోయ్ రసనిర్దేశం-దొరకదటోయ్ శోభావేశం" అన్నది ఆధునిక ప్రమాణం. "నానృషిః కురుతేకావ్యమ్" అన్నది ప్రాచీనప్రమాణం. ఆ మాట కాదనకుండా ఇప్పటికీ కుందుర్తి నిబ్బరంగా "మహర్షులవంటి మా బోటి కవులకు తెలుసు" అని ప్రకటిస్తున్నారు. ఈ రీతిగా ప్రాచీనలకు ఆధునికులకు కొన్ని ప్రమాణాలపట్ల సమదృష్టి ఉన్నట్లుగా కనిపిస్తుంది. ఆధునిక కవులు విమర్శకులు అవసరమైనచోటల్లా యథేచ్ఛగా రసం, ధ్వని మొదలైన ప్రాచీన ప్రమాణాలను ఉపయోగించుకుంటున్నారు. కాని వారే ఆ ప్రమాణాలు పనికి రావంటున్నారు ఈ రీతిగా ద్వంద్వప్రమాణాలను అనుసరించే వారివల్ల కవితకు, విమర్శకు నిర్దిష్టమైన గమనం కొరవడే ప్రమాదముంది.

"ధ్వని అంటే ఆనందవర్ధనుడు చెప్పిన క్లేశ విశ్లేషణ ఉదాహరణలన్నీ గుర్తుకు రానక్కరలేదు "Suggestion" అన్న దానికి సరిపోయే పదం "ధ్వని" అనేది. "చెప్పిన దాంట్లోంచి చెప్పని అనేక స్పందనల్ని హత్తుకునేటట్లు చెప్పడం ధ్వని" అని అద్దేపల్లి వివరణ ఇక్కడ స్పష్టంగా ఒక ధోరణి కనిపిస్తుంది. ధ్వని అనే ప్రమాణాన్ని, సాంకేతిక వ్యవహారాన్ని ఉపయోగించుకోవాలి. కాని ఆ ప్రమాణం ప్రాచీనుడైన ఆనందవర్ధనుడు చెప్పినట్టుగా చెప్తే తనమీద తిరోగామి అనే ముద్ర పడుతుందనే భయం. అందుకే "ధ్వని" అనగానే పాఠకులంతా భయపడిపోతున్నట్లుగా తనకు తానే ఊహించుకుని, "క్లేశ విశ్లేషణ" అనే ప్రయోగం ద్వారా ఆనందవర్ధనుడి ప్రాచీన దృక్పథం పట్ల ఒక హేళన భావాన్ని ప్రకటించి, "Suggestion" అనే మాటను ఉపయోగించడంద్వారా దానికి ఆధునికత అనే రంగుపులిమి "అవ్వపేరే ముసలమ్మ" అనే అర్థాన్ని అందించేరు. కాని ఆధునికత అనే పేరుతో మనం కోరుకునేది ఈ ఆర్భాటం కాదు. ఇలాగే "శిల్పం" అనే సాంకేతిక పదాన్ని వాడుక చేయడం ఈయనకు అభిమతం. ఆ ప్రమాణం పాతదని ఎవరు అంటారోనని ముందుగా ఇది "ఫ్యూడల్ సమాజ జనితపదం" అని ఎవరూ బెంగపెట్టుకోవద్దని కోరుతూ దానికి ఏవేవో వివరణలు ఇస్తారు. నిజానికి "శిల్పం" అనేది ఫ్యూడల్ సమాజంలో ఒక పరిపూర్ణమైన సాంకేతిక వ్యవహారాన్ని పొందలేదు. ఇటువంటి సందర్భాలలో మనం ప్రాచీన ప్రమాణాన్ని అంగీకరిస్తున్నామా లేక దానితో విభేదిస్తున్నామా అనే అంశం పట్ల ఒక నిశ్చితధోరణిని ప్రదర్శించవలసి వుంది ఒకవేళ ప్రాచీన ప్రమాణాన్ని సర్వాత్మనా అంగీకరించలేని పక్షంలో ఒక నూతన సంకేతాన్ని కల్పించు

పోకుండా అదే సాంకేతిక పదాన్ని వాడుక చేయడంలో గల ఔచిత్యాన్ని గూర్చి ఆలోచించవలసిన అవసరం కూడా వుంది.

"పిల్లికి రొయ్యలంటే ఎంతిష్టమో మీ నాన్నగారికి పిల్లంటే అంతిష్టం" అనే రీతి ఉపమాలంకారాన్ని ఆలంకారికులు ఎక్కడా చూపలేదంటారు ఇస్మాయిల్. వారు ఉపమాలంకార ప్రకరణాలను చూస్తే ఈ విధమైన అభిప్రాయం తప్పు అని గ్రహించి వుండేవారు.

"యథా లతాయాః స్తబకానతాయాః
స్తనావనమ్రే నితరాం సమాసి
తథా లతా పల్లవినీ సగర్వే
శోణాధరాయాః సదృశీ తవాపి"

వంటి లక్ష్యాలెన్నో వారి భ్రమను తొలగించేవి. కాని ఈ తరం అర్థం చేసుకునే తీరు వేరుగా వుంది. కేవలం అలంకారాల నాశ్రయించుకుని వ్రాసిన గ్రంథాలు మనకున్నాయి. అందులో ఉపమాలంకార పరికల్పనను అనేక తీరులుగా శోధించిన భాగాలెక్కువగా ఉన్నాయి. అటువంటప్పుడు ఏదో ఒక తీరు ఉపమాలంకార కల్పన ప్రాచీనుల దృష్టికి సోకలేదని అనుకుని అది ఒక లోటుగా భావించడం ఉచితం కాదు. ఇక్కడ ఆలోచించదగ్గ విషయం వేరొకటుంది. అలంకార కల్పనను ఒక ప్రమాణంగా అంగీకరించి శాస్త్రీయ దృక్పథంతో అందులో కొత్త తీరులను అన్వేషించడం ఆధునికులకు అభిమతమా! శాస్త్రీయములైన నియమాల సొంతకు పోక అప్రయత్నంగా తమ రచనలలో అలంకారాలు దొర్లితే ఆనందించడం లేకపోతే ఇంకా ఆనందించడం అనే ధోరణి ఆధునికులకు సమ్మతమా! ఆధునిక సాహిత్యాభిమానులకు ఈ విషయంలో ఒక నిశ్చితజ్ఞానాన్ని కల్పించవలసినబాధ్యతసైతం ఇస్మాయిల్ వంటి విమర్శకులపై ఉంది. ఆధునికాంగ్ల విమర్శకులు ఒక ఇంద్రియానుభవాన్ని వేరొక ఇంద్రియానుభవంగా పరివర్తింప జేయడాన్ని "సైనిస్థటికల్ ఇమేజ్"గా వివరిస్తారని సోమసుందర్ చెప్పారు. దీనిని కుంతకుడు "ఉపచారవక్రత" అన్నాడని ఎవ్వడైనాఅంటే వాడు సోమసుందర్ దృష్టిలో సంప్రదాయపోషకుడుగా నిలుస్తాడు. టి. ఎల్. కాంతారావు "కవిత్వానికి ఆత్మవస్తువై శిల్పాంగాలన్నీ శరీరమవుతున్నాయి" అని సరికొత్త కావ్యాత్మ ప్రమాణాన్ని ప్రవచించేరు. "తెలుగు సాహిత్యం ఇటీవలి కాలంలో అనుభవించిన దుర్దశ ఇదే" అన్న ఆర్. ఎస్. సుదర్శనంగారి అభిప్రాయం ఇందుకు ముందుగా ప్రకటింపబడ్డ సమాధానంగా కనిపిస్తుంది. "నేటి కవితకి భావచిత్రం ప్రధానం' రసంకాదు" అంటారు అరిపిరాల విశ్వం. "నభావహీనోఽస్తి రస నభావో రసవర్జితః" అని నాట్యశాస్త్రం చెప్తుంది. పూర్వులు రసందగ్గర ఆగిపోతే ఆధునికులు దానికి ఉపాధియైన భావందాకా పోడి చేసేరని అరిపిరాల వారి అభిప్రాయం. భావము అర్థాన్ని, అర్థాంతరాన్ని సమాన విపక్షతో పర్యాప్తం చేయడంవల్ల ప్రకటార్థాన్ని ఉపసర్జనీకృతం చేసే ధ్వని ప్రమాణం కంటె గొప్పదయిందని వీరి వాదం. 'వస్తువాచ్యస్య సర్వధై వావభాసః అతఏవ తృతీయోద్యోతే ఘటప్రదీప దృష్టాంత బలాద్వ్యఙ్గ్యప్రతీతి కాలేఽపి వాచ్యప్రతీతిర్న విఘటత ఇతి యద్వ్యక్త్యతి తేన సహాస్య గ్రంథస్య న విరోధః" అనే లోచనకారుడి మాట ఇక్కడ స్మరిస్తే ధ్వనిప్రమాణం యొక్క ఔన్నత్యం తెలుస్తుంది. ఈ రకంగా కొందరు అవగాహనలోపం వల్ల ప్రాచీన ప్రమాణాలను తిరస్కరించడం జరుగుతూంది. వీరికంటె ప్రాచీన ప్రమాణాల జోలికి పోకుండా, త్రికరణశుద్ధిగా వాటిని విస్మరించి నూతన ప్రమాణాలను నిర్మించుకునే వారి వలన ఆధునిక సాహిత్యానికి మేలు జరుగుతుంది.

నేటి కవిత్వానికి ప్రాచీన ప్రమాణాలకు అసలు పొత్తు కుదరదనడం పూర్తిగా నిజం కాదు.

"కవులు / ఊహాలోకాలలో
భావనాకల్పిత / ప్రేయసీ వక్షోజాల రసశిఖరాలకు
వ్రేలాడుతూన్న గండు గబ్బిలాలు"
అనే జ్వాలాముఖిరచనలో అలంకారం లేదనలేము.

"స్వేచ్ఛగా చావడమైనా గెలుపే మరి
ఆ మాత్రం నోచుకోలేదు షండ ప్రసండులు"

అన్న కాళోజీ దిగులులో వక్రోక్తి లేదనగలమా!

"రోజూ చూస్తూనే ఉన్నాను
ఆ కళ్ళ వెనక ఉమ్మెత్త చెట్లను / సంక్షేత్రాలను
ఉద్రేకవంతమైన సరస్సులను / ఉరితీయబడ్డ అక్షరాలను
రోజూ చూస్తూనే ఉన్నాను"

అన్న అజంతా కవితలో ధ్వని కనిపిస్తుంది. ఐతే ఇంత మాత్రంలో ఆధునిక కవిత్వానికంతకూ ప్రాచీన ప్రమాణాలే చాలునని ప్రాచీనులు సైతం అనరు. ఎందుచేతనంటే అపూర్వత కవితకు ప్రాణమని వారికి తెలుసు కనుక. "కోవేత్తిక వితాతత్త్వం శివో జానాతివా నవా" అన్నంత వినయం కూడా వారి కుంది. "ఇప్పుడు నేను సిద్ధాంతం చేస్తున్నాను. రసాలు మూడే" అన్న బోయి భీమన్నగారిలాంటి నిరంకుశులు కొందరు ఈనాడూ ఉండవచ్చును ఆనాడూ ఉండవచ్చును.

ప్రాచీన ఆధునిక ప్రమాణాల మధ్య విస్పష్టమైన భేదాన్ని సూచించే అంశాలు కొన్నున్నాయి. "మనసి సదా సుసమాధిని విస్ఫురణ మనేక ధాభిధేయస్య అక్లిష్టాని పదాని చ విభాన్తి యస్యామసౌ శక్తిః" అనేది ప్రాచీన ప్రమాణం. వారి దృష్టిలో కవికి సమాధి కుదరాలి. అభిధేయం అనేక రీతులుగా స్ఫురించాలి. దానిని క్లేశంలేని పదాలతో వ్యక్తం చేయాలి.

"నా చైతన్య మండపంమీద ఫ్రాయిడ్ డార్విన్
పికాసో రూసో–నాలుగు స్తంభాలాట ఆడుతున్నారు"

అనే ఆధునిక కవి అస్పష్టతను వరిస్తున్నాడు. కలకు కవిత్వానికి నిర్మాణరీత్యా భేదం లేదని భావిస్తున్నాడు. "యథార్థాన్ని గుర్తించము. కలలు మాకు యథార్థాలు" అన్న నారాయణబాబు మార్గం తెలుగులో ఆధునికతగా గుర్తింపు పొందింది. "అసంబద్ధ, వ్యతిరేక, అస్తిత్వపు టస్తవ్యస్త కవిత్వం రావాలి" అంటారు వేగుంట మోహన ప్రసాద్. భాష, భావం, అభివ్యక్తి మొదలైనవన్నీ నూతన రీతులలో కొనసాగి కొత్త ప్రమాణాలను కోరుతున్నాయి. ఆధునికులలో కొందరు భారత-భామహ-ఆనందవర్ధనాదులను విడచి ఇలియట్, ఆర్చిబాల్డ్ మెక్లిష్, బ్రియాన్ పాటిన్ అంటూ పాశ్చాత్య విమర్శకులను ప్రామాణికులనుగా ప్రకటించడంలో ఉత్సాహం చూపుతున్నారు. ఇందులో అవసరమెంతో, అనుకరణ శీలమెంతో, ఆత్మన్యూనతాభావమెంతో తేల్చి చూడవలసిన అవసరం కూడా వుంది. ఈ విషయంలో పాశ్చాత్యుల ధోరణిసైతం గమనించదగ్గది. అమెరికన్లనుద్దేశించి ఇర్వింగ్ బాబిట్ "ఈ దేశం ఎప్పుడూ యూరోపుకు దిగుమతి క్షేత్రంగా ఉండవలసిందేనా? మన సొంత ప్రమాణాలను మనం సృష్టించుకోలేమా?" అని ప్రశ్నిస్తాడు. ఆ ప్రశ్న మనకూ వర్తిస్తుంది.

నిశ్చితములైన సమకాలీన ప్రమాణాలు కాని, సజీవమైన కవితా సంప్రదాయంకాని, పరిణతము విశ్వసనీయము అయిన పాఠకవర్గం కని లేని సమయంలో 20వ శతాబ్దపు కవులు తయారయ్యేరని F. R. Leaves అంటాడు. ఆ విమర్శ మన కెంతవరకూ వర్తిస్తుందో ఆలోచించాలి. ఆధునిక జనసామాన్యంలో కళకు, సాహిత్యానికి సంబంధించిన స్పందన కరువైన లక్షణాలు అధికంగా కన్పిస్తాయి. ఇప్పుడు ఒకే విధమైన మేధాసంబంధమైన అభిరుచులు ప్రమాణాలు గల యథార్థమైన విద్యావంతులైన ప్రజలవర్గం లేదు. ఇప్పుడు ఎక్కువమంది అభిరుచిని కల్పించుకుంటున్నవారు, నటిస్తున్నవారు. కనిపిస్తారు అంచేతనే.

"అమృతాలు నింపిన పంచామృతాలు పొంగిన
నీ స్తనద్వయాలు నవ్వుతున్నట్లున్నాయి"

అనే రీతిగా రాసే కవి జాతీయ కవి సమ్మేళనంలో తెలుగువారి ప్రతినిధిగా పాల్గొనడం జరిగింది. ఈ కవిత్వం తెలుగు కవిత్వపు ఎడారిలో ఒయాసిస్సుగా నిలిచిందని కుహనా ప్రామాణికులు విజృంభించడం జరిగింది.

గుంటూరు శేషేంద్రశర్మగారు కోరినట్లుగా కవిత్వానికి సార్వత్రిక ప్రమాణాన్ని నిర్మించడం సాధ్యం కాదు. సామ్యవాద రచయితలు సైతం కళాప్రమాణాల్లో ఒకటే వ్యవస్థ

ఉండాలనడాన్ని వ్యతిరేకిస్తున్నారు. ప్రస్తుతం తెలుగు కవిత్వం ప్రమాణాలను రూపొందించుకోవలసిన స్థితిలోవుంది. ఆధునిక కవితలలోని అంతరార్థాన్ని సక్రమంగా నిరూపించే స్తోమత లేక, నిరూపించడానికి తగిన ప్రమాణాలు రూపొందించుకోలేక "ఎంత వ్యంగ్యం ! ఏం ధ్వని ! ఏం శిల్పం !" లాంటి అర్థరహితమైన గాలివాటు మాటలతో కాలక్షేపం చేసేవారు ఎక్కువమంది కనిపిస్తున్నారు. ఆ ప్రశంసల మాటున ఏమైనా ఉన్నదో ! లేదో ! తెలుసుకోలేక చాలామంది అవస్థ పడుతున్నారు.

సమాజం ఎప్పటికప్పుడు నూతనాగంతకులను నమోదు చేసుకుంటూ వుంటుంది. వారి శక్తులు, పరిమితులు నిర్ధారింపబడాలి. గతంనుండి పొందినదేదో, తాము సృష్టించినదేదో, భవిష్యత్తుకు మిగిల్చినదేదో తేల్చుకోవాలంటే ఎప్పటికప్పుడు పునశ్చరణతరగతులు నిర్వహింపబడవలసిందే. ప్రాచీన ప్రమాణాలను గౌరవించేవారిని ఇక్ష్వాకుల సంతతిగా ఈసడిస్తూ, ఆధునిక ప్రమాణాలను ఆశిస్తున్నవారిని అల్లరి పిల్లలుగా ఆటపట్టిస్తూ, వేరు పరుస్తూన్నంత కాలం విలువలు పెరుగవు కేవలం సంరంభం కాని, ఇతరులను తృణీకరించే అహంభావం కాని ఇక్కడ పనికిరావు. ప్రమాణాలు జాతమైత్రీ సంబంధాలను బోధించేవిగా, సహనశీలాన్ని పెంచేవిగా ఉండాలి. ఇతరుల ప్రమాణాలను అధ్యయనం చేయడం ద్వారా మన ప్రమాణాలను పెంచుకునే అవకాశం లభించవచ్చును.



శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు

# ఆంధ్రసాహిత్యము

పండిత విరచితములైన ప్రబంధములందు రసస్థాయి మాటువడి రూపస్థాయి వస్థాయి ప్రబలినను ఆంధ్రప్రజా హృదయరసప్రదీపన మంతరించవలేదు. పిల్లపాటలు, జంగము పాటలు, జంగముకథలు, స్త్రీలపాటలు, తందాన పదములు, దాసరికథలు, వీధినాటకములు, యక్షగానము మొదలగు సామాన్య సాహిత్య గ్రంథములందుగల రస స్వరూప యాంధ్ర సాహిత్య హృదయమును వ్యక్తము చేయుచున్నది. పాటలు, పద్యములు, గీతములు జాతీయసాహిత్యసమ్మిళితములై ఆంధ్ర హృదయము లందు రసోదయమును చేయుచున్నవి. బొబ్బిలి కథ, బాల నాగమ్మ కథ వీనులకు విందు గొలుపుచు మహదానందమును కలిగించు చున్నవి. ఈ పాటలు కథకుని నటనా చాతుర్యమును శ్రోతల రసగ్రహణ సామర్థ్యమును వెల్లడి చేయు చున్నవి. ఆంగ్ల విద్యా విధానము వలన పామర హృదయములందును క్షీణస్వరూపమునకు నాంధ్ర సాహిత్య ప్రవాహము శోషించుచున్నది. పదము లందును, పాట లందును కీర్తనలందును పరంపరాగతంబైన యాంధ్ర సాహిత్యము ప్రతిపాదితమై ప్రజలకు పురుషార్థమును రమణీయముగ బోధించుచున్నది. సీత పాటయందు వేదాంత సారమంతయు నిమిడి యున్నది.

సీత సమర్త పాటయందు దేశాచారములు చిత్రముగ వర్ణింప బడినవి. కీచకవధ, ధర్మరాజు జూదము మొదలగు పాటలందు ధర్మాధర్మ సంరంభము, ధర్మ విజయము ముచ్చటగ పాడబడినవి. ఇప్పుడీ పాటలను పాడువారును, వినువారును లేరు. ప్రజలను రసపరవశులను జేసెడి బొబ్బిలికథ, బాలనాగమ్మ కథ ప్రజారంజకమైన సాహిత్య హృదయమును తెలుపు చున్నవి. ప్రజా హృదయమును దెలిపెడి యిట్టి పాటలు పద్యములు పదములు కథలో దేశము నందంతట వ్యాపించి యున్నవి. అవి నవీన నాగరిక ప్రభావమున రూపుమాసి నశించు చున్నవి. గృహములందీ పాటలను పాడుట యనాగరికమని స్త్రీలు పరిత్యజించిరి. పుస్తకములు తప్పులతో నిండియున్నవి. ప్రాచ్యపుస్తక భాండాగారము నందు కాలగతి నొందు చున్నవి. ఆంగ్ల విద్యా విధాన మాంధ్ర సాహిత్య హృదయమును శుష్కింప జేసినవి. పండితులు, పామరులు తమ సాహిత్య స్వరూపమును మఱచి ఆత్మానుభవములేని నూతన సాహిత్య నిర్మాణమును చేయుచున్నారు. ఈ మహా సంధి సమయమందు సాహిత్య హృదయ సంరక్షణను సాహిత్యోపాసకుల యధీనమున గలదని గ్రహింతురు గాక! ఆంధ్ర సాహిత్య విప్లవ మార్గమును సాహిత్య పరిశీలనము వ్యక్తము చేయుచున్నది. సాహిత్య వికలత్వము హృదయము నందును, రూపము నందును, రంగములందును కలుగుచున్నవి. ప్రహ్లాద చరిత్రాది గ్రంథములీ వికలత్వావతరణమును తెలుపుచున్నవి. పోతనామాత్యుడు శమదమాహంకార సంజాతమైన భాగవత రసము నతివిభవముగ భాగవతమునందు వర్ణించెను ప్రహ్లాద చరిత్రమును యక్షగానరూపమున భాగవతులు పాడు చుండిరి. ఆ ప్రహ్లాద చరిత్రమును నాటక సరణిని భాగవతులాడుచుండిరి. ప్రహ్లాద చరిత్రమ నిపుడు నాటక సంఘములు ప్రదర్శింపుచున్నవి. సాహిత్య హృదయ రంజకమైన భాషయు, భావములును, రసమును, విలయము పొందిన విధము- నీ నాలుగు విధముల చరిత్రలు వెల్లడి చేయు చున్నవి. హిరణ్యకశిపుని పట పట పాటలందు కట కట భావములందు గల సాహిత్య సంగీత రస స్వారస్య మాంధ్ర

ప్రపంచమనుభవించుచున్నది. హిరణ్యకశిపు దహంకార ప్రేరితుడైన మహాభక్తుడుగాని నీచ మానవుడుగాడు. ప్రహ్లాద చరిత్ర యందలి సాహిత్య హృదయ మీ ధర్మ ప్రదర్శన మంతరించినపుడు దుర్గ్రాహ్య మగును.

దేహములందును, గేహములందును, క్షేత్రములందును దేవాలయములందును, గ్రంథాలయములందును శిథిలములై సంక్షయము బొందుచున్న సాహిత్య రచనలను రక్షించి ప్రజాపరము చేయుట సాహిత్య వికాసమున కొక సాధనము. ఆంధ్ర సాహిత్యాలయములను నెలకొలిపి సాహిత్యమును గలుపుట యొక మార్గము. అనవరతము వినికని వాడెడి మాతృభాషా ముఖమునకు సాహిత్యవ్యాపనము సాధ్యమగు టకు వైదికధార్మిక సాంఘిక రాజకీయ వ్యవహారముల యందును, విద్యాప్రవృత్తి యందును మాతృభాష నుప యోగింపవలయును. ఆంధ్రరాష్ట్ర నిర్మాణము వలన నీ సాధనము కొంతవఱకు సాధ్యముగాగలదు. ఆంధ్రాత్మజులకు సహజమైన సంగీత విద్యాభ్యాసమును గ్రహములందును విద్యాలయములందును జేయుట ముఖ్యసాధనము. నిత్యము భారత భాగవతాది గ్రంథములను విధికృత్యముగ జదువుట యును పరమ సాధనము. సాధనముల ప్రయోజనము సాధకుని యాథార్థజ్ఞానము ననుసరించియుండును. స్వజాతీయ సాహిత్యాత్మజులైన సాధకులను గనుటయే సంసారమునకు ఫలము, తలిదండ్రుల కానందము, భాగవతార్థమునకు ప్రయోజనము, తత్త్వార్థ సందర్శనమునకు సాధనము.

ఆనందమయమయి [న] సాహిత్య బృందావన హృదయము (న) యార్తనాదము బయలు వెడలినది. ఆ యార్తనాదము నుపలాలనము చేయుటకు వరవీణాపాణి జగన్మోహిని భారతీదేవి శ్రుతి సమ్మేళనముచేసి లాలిపాటను పాడుచున్నది. ఆ యార్తనాదము నుపశమింప జేయుటకు ధ్యానబుద్ధుడు తపోమహిమను తెలుపుచున్నాడు. ఆ యాక్రందనము నాపుటకు తిక్కనామాత్యుడు భారతధర్మ సామయి [న] జ్ఞానయోగ ముపదేశించుచున్నాడు. ఆయా వేదన నార్పుటకు పోతనామాత్యుడు భాగవతామృతమును కురిపించుచున్నాడు. అపరితాపమును బాపుటకు త్యాగరాజ క్షేత్రజ్ఞాతలు శ్రీరామ శ్రీకృష్ణగీతములను, పదములను పాడు చున్నారు. అసంతాపమునపనయించుటకు పెద్దన సూరనార్యాది ప్రబంధకర్తలు శృంగారరసమును చిలుకుచున్నారు. స్తోత్ర పాఠకులు సువర్ణ శతకహారముల నిచ్చుచున్నారు. భాగవతోత్తములు పాడుచు బొమ్మల నాడించుచున్నారు. ధర్మాత్ములు ధర్మకార్యములను చేయుచున్నారు. పంట కాపులు పంటలను పండించుచున్నారు. కర్మకారులు చిత్ర వస్తువులను నిర్మించుచు నానందమును గలిగించుచున్నారు. పూజారులు కర్పూర నీరాజనము లర్పించుచున్నారు. యాత్రికులు దివ్య క్షేత్రములను పుణ్యతీర్థములను కీర్తించుచున్నారు. బసవరాజాది వైద్యులాయుర్వేద రహస్యముల నుపదేశించు చున్నారు గణకులు కాలజ్ఞానమును దెలుపుచున్నారు.

ఆనందమయమయిన సాహిత్య మహా బృందావనమునకు తలుపులు లేవు, తాళములు లేవు, హద్దులు లేవు, అడ్డులు లేవు, ఆత్మానుభవజ్ఞులు సుఖప్రవేశము గాంచిరి ఆత్మానుభవములేని కన్నులకు ఆర్తనాదోపశమనము గలుగుటలేదు. దివ్యరూపములు కనిపించుటలేదు. దివ్యగానము వినిపించుట లేదు. దివ్యభావములు గోచరముగుటలేదు. దివ్యవిభూతులు కనిపించుట లేదు. సాహిత్య బృందావనమును దర్శించుటకు భారతీ మంత్రోపాసనమయులైన బాలకృష్ణులు మురళీగానమును జేయవలయును. బాలరాములు ధనుర్వేదము నభ్యసింపవలయును. బాలభాగవతులు భాగవతము నాడవలయును. బాలనారదులు శాస్త్రపరిశోధనల జేయవలయును. బాలవ్యాసులు ధర్మవ్యాఖ్యానములను జేయవలయును. బాలగోపాలకులు పాడిపంటలను పెంచవలయును. బాలసీతలు శాంతరసమును పంచ వలయును. బాల సావిత్రులు త్యాగగుణమునందు దుమకవలయును. బాలనాగమ్మలు సతీత్వమును గాపాడవలయును.

[సేకరణ : కె. వి. రమణారెడ్డి – కృష్ణాపత్రిక–నవంబరు 22, 1919.]

# వసంతమా! జయోస్తు!!

శ్రీ బులుసు వేంకటేశ్వర్లు

గీ॥ జడమునై యున్నమా యెద నడుగువెట్టి
లలిత వర్ణ రసామృత లహరి నింపి
అతుల చైతన్యములనుఁబంచితివి గాదె!
మధుర మధురాగమ! వసంతమా! జయోస్తు!!

గీ॥ నీవు వచ్చెదవని కాదటే! కృశించి
యెండి మోళ్లైన మ్రాకుల ఖండరుచిర
విలసిత కిసాల రాగకాంతులు వహించె
మధుర మధురాగమ! వసంతమా! జయోస్తు!!

గీ॥ గుండెలను రాగమాలికఁగూర్చుకొనిన
కొత్త పెండ్లికూతురువోలె కోకిలమ్మ
గొంతు సవరించి మామిడి కొమ్మ మెట్టె
మధురమధురాగమ వసంతమా! జయోస్తు!

గీ॥ ఆకురాలుపు గండ్ల యందమృత కాంతి
పేశల ప్రవాళ పుంజమ్ము, విచ్చి నవ్య
హారతుల నిచ్చు ఋతురాజ్ఞి వైన నీకు
మా యెద గదల్చిన వసంతమా జయోస్తు!!

గీ॥ నీవు కాదటె లోక సంభావనైక
ప్రేమమున నిట్లు కోకిల స్వామిఁజేత
రక్తి పంచమరాగ మంత్రముల యజ్ఞ
మమరఁజేయించితి! వసంతమా! జయోస్తు!!

గీ॥ శైశిరాఘాత విదళిత సర్వ దిగ్ది
గంత సౌందర్యమునుఁ బ్రోవుగట్టి మరల
ప్రకృతిఁబాదు కొల్పిన మహారాజ్ఞివి, జగ
దంబవు, నమోఘువు, వసంతమా! జయోస్తు!!

గీ॥ సర్వ సమ్మోహనమ్ము — విశ్వహితమహిత
దివ్య భావమ్ము — మాధవ దేవతావ
తారమును - శశ్వదాహ్లాదకారణమ్ము-
నైన. నవ్యాగమ వసంతమా!! జయోస్తు!!

గీ॥ ప్రకృతి యజ్ఞమ్మునందు శరత్తు హవిసు
నయ్యె - గ్రీష్మమిధశమ్ముగానయ్యె — నీవు
ఆజ్య మైదాని వెల్గించినంతఁగాదె!
మాకు కళ్యాణము ! వసంతమా! జయోస్తు!!



# నిర్జీవ మిత్రులు

శ్రీ భీశెట్టి సత్యనారాయణ

ఈ బండలూ, హోరుగాలి,
పండు వెన్నెలాతప్ప—
నాకెవరూ లేరిక్కడ.

✥ ✥ ✥

చెమ్మగిల్లిన నాకళ్ళు
ఈ బండల వైపుచూస్తే.
కదిలి—
రమ్మనట్లు సంజ్ఞచేస్తాయి.
చిన్నపిల్లాడిలా పరుగెత్తికెళ్తాను.
బండ కదలదు, కాని
తనపై కూర్చొనిసేద దీర్చుకోమన్నట్లు
చూస్తుంది నావైపు.

✥ ✥ ✥

జోరీగల్లా నామెదడుచుట్టూ
ఆలోచనలు ముసురుతూ
నన్ను విపరీతంగా వేధిస్తున్నప్పుడు
నన్ను పిచ్చాడ్ని చేస్తున్నప్పుడు
ఈగాలి వనిగట్టుకు హోరుని వీస్తుంది—
ఆలోచనలుగాలి వాటుకు కొట్టుకుపోయి
నామెదడంతా ప్రశాంతం.

✥ ✥ ✥

పండు వెన్నెల అంతే
దూరపు బంధువులా నా
నెలకోసారి వచ్చి, పలకరించి
మధురక్షణాలు తెగి
నెత్తురు కిరుతున్నప్పుడు
కట్టుకట్టి, ఓదార్చిపోతుంది.



# సుప్రసిద్ధ కథకులు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి పేరడీ శాస్త్రి జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి లేఖలు

[1955 జూన్‌లో శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు కలాభివర్ధనీ పరిషత్తు, రాజమహేంద్రవరం పక్షాన తాము స్వయంగా ప్రకటించుకున్న 'అనుభవాలూ-జ్ఞాపకాలూను' మొదటి సంపుటాన్ని అప్పట్లో మద్రాసు ఆల్ ఇండియా రేడియో కేంద్రంలో పని చేస్తున్న జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రిగారికి పంపగా వారది అందుకున్న వెంటనే రాజమండ్రి ఇన్నీసుపేటలో ఉంటున్న శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి వ్రాసిన కార్డుకిది నకలు]

1

మద్రాసు

శ్రీః 30-9-1955

బ్రహ్మశ్రీ వేదమూర్తులయిన శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రులవారి దివ్య సన్నిధికి నమస్కరించి, విధేయుడు జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రి వ్రాసుకొనేది -

నిన్న సాయంత్రం 4 గంటలకు, తమరు వాత్సల్యంతో పంపిన 'అనుభవాలూ-జ్ఞాపకాలూ' అందింది. సంగతి సందర్భాలు-(జరిగినవి) బోధపడినవి. నిన్న రాత్రి 9-5 కు ఓసారి పుస్తకం పూర్తి చేశాను. తిరిగి చదువుతున్నాను. సగం అయింది. మీ ఆజ్ఞ చొప్పున సోమవారంనాడు-వ్రాస్తాను. చాలా విషయాలు వ్రాస్తాను. ఓ-పే-ద్ద వుత్తరమే వ్రాస్తా. మిగిలిన సంపుటాలు, అచ్చు అవుతున్నయ్యా? పారాలు మణిచారా? గాలిపూవుల దశలోవున్నయ్యా?? మరి వాటినీ పంపలి మీరు. నంపారూ ; మీ తల్లిగారి ఫొటో, మీ పెద్దఅన్నగారి ఫొటో లేకపోవడం-ఈ సంపుటానికి ఒక లోపం-ముందే అనేస్తున్నాను. అచ్చు తప్పులు రెండో లోపం-తెనుగు పుస్తకాలకు అచ్చు తప్పుల యోగం తప్పదేమో. పుస్తకం అందింది అని తెలుపుడు చేయడానికే ఈకార్డు, అంతే. సోమవారంనాడు-నా మనస్సు, హృదయం వ్రాస్తాను.

మీ
జ.రు.శా

శ్రీరంగం శ్రీనివాసరావుగారు 30-9-55
10, అరుణగిరి మొదలివీధి
మందవల్లి
మైలాపూరు, మద్రాసు.

[గమనిక : శ్రీశ్రీ ఎడ్రస్‌కోసం శ్రీపాద జరుశాస్త్రికి వ్రాసి ఉంటారు]

[ఇది, జరుశాస్త్రి శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి వ్రాసిన రెండో ఉత్తరం. ఇది 8 పావుఠావు తెల్లకాగితాల మీద వ్రాసింది. ఇందులో 'గురజాడ అప్పారావు' అని ప్రారంభించి వ్రాసిన నాలుగు లైన్లు ఎందువల్లో తీసివేసి, మిగిలిందంతా యథాతథంగా శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు తమ 'అనుభవాలూ-జ్ఞాపకాలూను' రెండో సంపుటంలో (1958 జనవరిలో ప్రకటితం) 'చదివిన వారన్న మాటలు' శీర్షికలో నెం. 2గా ప్రకటించారు.]

2

మద్రాసు

శ్రీ మాత్రేనమః 3-10-55
రాత్రి 9-35

బ్రహ్మశ్రీ వేదమూర్తులయిన శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రులవారి దివ్యసన్నిధికి, నమస్కరించి రుక్మిణీనాథశాస్త్రి వ్రాసుకొనే విన్నపములు.

తాము ఎంతో వాత్సల్యంతోపంపిన 'అనుభవాలు, జ్ఞాపకాలు' అందగానే అందినట్లు వ్రాసుకొన్నాను. గ్రంథాన్ని యిప్పటికి ముమ్మాటు చదివాను. యింకో రెండు మూడుసార్లు చదివేట్టున్నాను.

కారణం ?

పెద్దలతో పోలికకు తగను. కాని, తమకూ, నాకూ ఎన్నో 'పోలికలు ఉన్నయ్. శ్రీపాదవారివలె - జల సూత్రం వారున్నూ తత్రాపి, మాకోవ శ్రీ విద్యోపాసనే తమకు ఆస్తిగా కలవారు. -

మాయింట, ఏ మంచి జరిగినా - మా అమ్మవారి కృప - అనుకుంటాము. 'భారతి' చదివినందుకు మా తండ్రి చేత నేను దెబ్బలు తిన్నాను - నానాహింసబా పడ్డాను. ఎందుకు ? కవితావ్యాసంగానికి గాను అనీ స్మార్తః చెప్పుకోనందుకు, చెప్పుకున్నది మరచినందుకుగా అనీ. నేనూ నక్షత్రేష్టి యిత్యాదులు చెప్పుకున్నాను. నా పెళ్ళికి పురోహితుణ్ణి, అగమనకుండానే - మంత్రాన్నీ నేనే చెప్పుకున్నవాణ్ణి. యిద్దరికీ అంగ్లంరాదు, రాదు అనే దుగ్ధ ఉంది. ఇట్లాగా ఎన్నెన్నో కనబడ్డవి. కాని, తేడా ఒక్కటే వుంది. అది పెద్దది. అదేమిటంటే - తాము హఠంతో, 'పారదృశ్వా' అయినారు. నేను - రెంటికిం చెడిన రేవడనైతిని. శాస్త్రిగారూ - ఇంతే. చాలునూ ?

కొన్ని మొక్కలు

నేలను ఎవరో పదును చేస్తారు. ఉదురు ఏర్పరుస్తారు. మొక్కను పాతుతారు. నీళ్ళుపోస్తారు. శ్రద్ధ చూపిస్తారు. పెంచుతారు. మొక్క పెరగవచ్చు. పెద్దదీ కావచ్చు.

మరికొన్ని మొక్కలు

కొండలో పుడతై. కొండను ఛేదిస్తయ్. తలెత్తుతై - ఏ తుఫానుకూ చలించవు. యీ కొండ చెట్టున్నది చూచారూ. ఇది అతిగా ప్రాణ శక్తిని ఖర్చుపెట్టిగాని తలెత్తలేదు. తలెత్తింటా దాన్ని తుంచడం - బ్రహ్మదేవుడికి వశంకాదు.

మీరు గిరి వృక్షం వంటివారు. ఉద్యానంలోని చెట్టుకారు. అంత జీవశక్తిని క్షణం క్షణం వెచ్చిస్తేనేగానీ 'ఇల్లు పట్టిన వెధవాదబడుచు', 'షట్కర్మ యుక్తా', 'అపిదళతి వజ్రస్య హృదయం', 'మార్గదర్శి'. 'జాగ్రత్త పడవలసిన ఘట్టాలు', 'ఖచ్చితమైన జవాబు', యిత్యాది ఘన కథల రచయిత - ఏ అంగ్ల కథనో తెరవాటుకొట్టి వెలిగే సాటిరచయితల్లో, కేవలం సాలీడువలె - తనలోంచే అంతా సృష్టించుకొనే రచయిత అవిర్భవించ లేడు.

ఇందుకు మా చిన్న అన్నగారికి, మీతోపాటు అందరూ కృతజ్ఞులు. ఓః ॥.

వేదం, శ్రౌతం, స్మార్తం, జౌద్గాత్రం, యజ్ఞం, అగ్నిహోత్రాలు, రథంతరం సామగానం,(నేను చెప్పుకోలేదు సామాలు) దగ్గర నుంచీ, బెంగాలీ పత్రిక దగ్గర నుంచీ - అట్టకు అట్టా కదిలింది. ఎంత గొప్ప సంగతి !! చదివి ఏడ్చాను. నవ్వాను. పాపం: ఎక్కడా ఇంతే అనుకున్నాను. గొప్ప పుస్తకం.

కావడానికి మీరు సిద్ధాంతిగారి అబ్బాయి. కాని నవీనాంధ్ర కథకులలో ఘనాపాఠీ.

బెల్లప్పానకం తాగరు - పుచ్చుకుంటారు. కనకనే తియ్యటి తెలుగు వ్రాస్తారు. తెనుగు వచనం తీపి మీ సొత్తు.

నేను సిగరెట్లు తాగుతాను. చివరికి మిగిలేది - నుసి. శాస్త్రిలవారూ - నేనూ వారాలు చేశానండోయ్. నేనూ మాధుకరం ఎత్తలేదు శాస్త్రిగారూ. యింత వైదిక సంపద తెలుసు గనుకనే - మీరు - అయ్యో, చెడిపోతున్నారు అని అంత విచారపడి వుంటారు గనుకనే - 'బ్రాహ్మణాగ్రహారం. వ్రాశారు.

"జొటులేని బ్రాహ్మణాగ్రహారమునకు" "పెంచినులేదు కుదించలేదు". భేష్.

శాస్త్రిలవారూ మీరు ఈ పుస్తకాన్ని రచించకనే వుంటే - చాలా నష్టం వచ్చేది.

వివరిస్తాను :

ఇది ఒక సామాన్య మానవుడి చరిత్రకాదు, ఘోష, ఘోష. ఈ ఘోషను - ఆ సామాన్యుడు - అమోఘమైన భాషలో చెప్పాడు. బాగానేవుంది. కాని, ఆ సామాన్యుడు - జీవితం - పరమపద సోపానపఠం (వైకుంఠపాళీ) ఆడాడు. వేదం, జ్యోతిషం, శ్రౌతంతో ఎత్తాడు తెరచాప. బావా, అది వచ్చి వచ్చి - బ్రహ్మ సమాజిగాడి లెవెల్‌కు దిగింది. అంటే - కాపురుషుడు (తంత్ర పరిభాషలో - కాళి) పక్కానికి తెచ్చింది.

అవునా ?

ఇక్కడో చిత్రం వుంది.

కాలానికి తగిన ప్రాణి, అత్మ. విశుద్ధ వాతావరణంలో పుట్టి, పెరిగింది. అసలు ఆ ఆత్మరణ పెంకెది. చీల్చిచూస్తుందిదేన్నయినా. గిడిపాటి వెంకటాచలంవలె, విశ్వనాథ సత్యనారాయణవలె. వీరందరికీ, చిత్తశుద్ధి, పట్టుదలలు సామాన్యం.

మనకు ఎందుకు, పోనిద్దూ అని ఊరుకోరు.

అంత తీవ్రత కలవాళ్ళు గనకనే -

సత్యనారాయణ. సుబ్రహ్మణ్యశాస్త్రి వెంకటచలంగార్లు ఘనాపాఠీలు అయినారు.

ఇదుగో మా సంపద. అని ఎవరైనా తలెత్తుకుని చెప్పుకో తగ్గట్టు తయారు అయినారు.

వీరికి జోహారు ;; క్షమించండి. జేజే. జోజో జోతలు ;;

ఇక –

మీ పుస్తకం సకాలంలో వచ్చింది.

విశద పరుస్తాను నా వూహను.

వ్యాఖ్యానం చేస్తాను.

భాష్యం చెయ్యక తప్పదు.

మీరు అన్నట్లు – ఇది యుగసంధి.

కావటానికి ప్రతిక్షణమూ యుగసంధే. కాని- ముత్తుస్వామి దీక్షితులు, త్యాగయ్యల నాడు, నేడు, మనకున్న భావ సంఘర్షణ, ఆచార సంఘర్షణ, ఆచరణ సంఘర్షణలు లేవు.

గతం గతం. కాదు. కావలసినన్ని తలపులు కలుక్కొ-నాటికిగాను – సర్వప్రజాసమగ్ర స్వాతంత్య్రంగా – (1) బ్రహ్మ సమాజం (2) ఆర్య సమాజం (3) కాంగ్రెసు (4 సోషలిజం (5) కమ్యూనిజం ఇత్యాదిగా ఉద్యమాలు వచ్చినై. తెలుగులు ప్రతి దాంట్లోనూ గభీమని ఉరికారు. తేట ఎవరికో ఐతే – తెట్టెలు మనవి. ప్రతి ఉద్యమంలోని చెడూ మనవంటికే పట్టింది. ఇక – పైన చెప్పినవి అన్నీ గుల్లలు అని తేలింది – నాగరికతను అవేవీ పెంచలేకపోయినై. నేను, ప్రతిగుండెలోనూ ఘోషించేది- 'లాలస' –

స్త్రీదాహం, పదవీదాహం, ధనదాహం. ఇంతే నేటి నాగరికత ఇచ్చినది.

ఇది నిలవదని ప్రతివారూ పైకి అంటారు. కాని అపేక్షావాలి.

అంటే – చిత్తశుద్ధి నశించింది.

రసికతలేని మైథునం.

అనర్థ నిర్వహణం.

అరగని ఆరగింపులూ వచ్చిపడి పీడిస్తున్నయ్. పర్వతాలంత పెరిగి ఉన్నయ్. ఇవినాశనం కావాలి.

ఎట్లా ? ?

సమర్థులు, ప్రజాయుక్తంవలె కలాన్ని నడపగలవారు – తీక్షణదృక్కులు, తీవ్ర వాక్కులు, దీసులు-ఈమాయపర్వతాలను ఛేదించాలి, భేదించాలి. చూర్ణం చూర్ణం చెయ్యాలి.

బ్రహ్మచర్యం విలువ నచ్చ చెప్పి, స్త్రీ దాహం కట్టాలి.

నేను ఇంతచాట పెయ్యనా అనిపించి, అటువంటి అక్కల కర్ర నోట పడేసి ఒక దాహం కట్టాలి.

జఠర పుష్టిలేని వాణ్ణని వాడికి వాడికే తెలియాలి.

ఇది మీ గ్రంథం సాధించుతుందను కుంటాను.

మన జాతిమీదనేనా .... ?

కనీసం పది మంది మీద, చాలదూ ? క్రమంగా కొందరు, మరికొందరు మారుతారు. ఆ ఆశ నాకువుంది.

ఐతే,

అవసరాన్నిమించి, అతిగా జీవశక్తి ఖర్చు పెట్టాలిసినవారు అయినారు మీరు, చలంవలె, విశ్వనాథవలె.

అందుకే-

వారివలనే-మీరూ అతిగా చెప్తారు అనుకున్నాను కొంత చదివి.

రుంత తెలిసింది. గ్రంథం ఉపదేశకం. పడిన వ్యథ అతిశయం-కనకనే అంత చెబుతున్నారు, అనుకున్నాను, చివరికి. ఐనా వ్రాస్తూ మీరు చిన్నప్పటి సంగతులు వ్రాస్తున్నారు కదా,

పల్లిడి సత్తిరెడ్డిగారింట-

ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రికల ప్రస్తావనలో-

'అప్పటికి కాంగ్రెసు మరకలు పడలేదు' అనటం తప్పు అనరుగాని, అనవసరం. అప్పటి మీ ఉత్సాహం, వాటిని చూడగా ఆనాడు మీకు కలిగిన ఉద్రేకం వ్రాస్తే గొప్పగా వుండేది ; అనుకుంటాను.

అక్కడక్కడ ఇట్లాగే —

ఈ పంక్తులు ఎందుకు వ్రాశారు ? లేకపోతే పుష్టికలిగేది గద ఇంకా అనుకున్నాను, బహుకొద్ది సందర్భాల్లో. మన్నించండి. ఇట్లా వ్రాస్తున్నందుకు.

ఇక.

మాతల్లిగారి ఫొటో, మీ పెద్ద అన్నగారి ఫొటో ఈ రెండూ లేకపోవడం-గ్రంథానికి మచ్చ. ఖాయం.

"చిన్నన్న కాల్చుకు తిన్నాడని, ఆయన బొమ్మ వేశారా ?" అని – ఒక్కడూ గూడా అనుకో గూడదు.

ఆ చిన్నన్న అంత పట్టు పట్టకపోతే-శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు-ఇంత పట్టుదల మనిషి, ఇంత శ్రద్ధాళువు, ఇంత ఘనాపాఠీ అయివుండరు.

నిజమ్. అందుకే ఆయన ఫొటో, తండ్రి ఫొటోతో పాటు. వాస్తవమ్.

కాని, తల్లిగారిదీ మిగిలిన అన్నగారిదీ ఫొటోలు ఉంటే- ఎంత నిండు వచ్చేది అనుకున్నారు ! ఎంత సూక్ష్మంగా-మీచిన్నన్న గారు చెబ్బతినేవారు అనుకున్నారు !! ఓః !!!

మిగిలిన సంపుటాలు ప్రింటు అయినయ్యా ?

ఇంకా కాలేదూ ??-అ-బ్బ ! గబగబా అచ్చుకావాలి. పరాక్రమించాలి శాస్త్రిలవారూ. సొంత సోదిలో పడుతున్నాను.

1951 మే మాసంలో నాలో మనఃపరివర్తనం బలపడి. తీవ్రరూపం పొందింది. 1952, ఫిబ్రవరి నుంచే అసలుమార్పు ప్రారంభం 1952 నవరాత్రుల నుంచీ సంధ్య వార్చనిదీ పచ్చి మంచినీళ్ళు త్రాగడం లేదు.

1953 జనవరి 29 నుంచీ-మా పెద్దలవలె, నేనున్నూ శ్రీవిద్యోపాసకుణ్ణి - ఆ చమత్కారాలు ఎంతో ముఖ్యమైనవి చేసుకోతగ్గవి. ఎప్పుడో మీ పాదాల దగ్గర వాలి, ఆ కథ చెప్పుకుంటాను.

నేడు

నా వ్యూహాలు, నా మార్గాలు, నా స్నేహితుల మార్గలతో భేదించినవి. నా నమ్మకాలు మారినవి. తెనుగు భాష మధురం అయినదే. కాని, ఏగొప్ప సంగతి చెప్పాలన్నా చాలదు అనిపిస్తోంది.

సంస్కృతం....!

-అదిగారూ !

కాని, ప్రజాపరంగా. మూక మొత్తంమీద చెప్పాలంటే తెనుగే అవసరం. సంస్కృతం చాలదు. ఇట్లాగా కొట్టుకుంటున్నాను.

ఇలాగే-రాజకీయాలు, నినాదాలు. ఎంత గగ్గోలు ఎత్తించినా అశాంతిని పెంచేవికాని, ఆత్మతృప్తిని అవి కలిగించలేవు అని నమ్ముతున్నాను.

ముఖ్యంగా, నినాదాలు, అరుపులు-చాలా కన్నులలో దుమ్ము కొడుతున్నయ్ అని నమ్ముతున్నాను.

* 'గురజాడ అప్పారావు' యుగకర్త-శకకర్త అని గగ్గోలు పెడుతూంటే-ఏపాటి శకకర్తో చూద్దాం అని-ఓ ఊపు ఊపాను. తా దిచిత్తగించి ఉంటారు. నవ్వుకొనీ ఉంటారు. నినాదాలూ పీటి మహత్తూ యీపాటివి గదూ శాస్త్రిలవారూ ?

గ్రామఫోను, రేడియోలు, సంగీతాన్ని, విద్యనూ, చవకచేసి మొహం మొత్తించి-చంపుతున్నవి అని భావిస్తున్నాను. 'సినీమా' నటనా శక్తిని పోగులు పెట్టింది అని విశ్వసిస్తున్నాను. యంత్రం, బస్సు, బియ్యం ఫ్యాక్టరీలేనిచోట బ్రతుకుదాం అని ఆశపడుతున్నాను. ఉదంటా 'రి అక్షరీ (వెనుక్కు పోవ్ తప్పం) అంటాడు, నాకు మిగిలిన బహుకొద్దిమంది స్నేహితులు. ఇంకా ఇంకా నాలోనే నేను తలపట్లు పట్టుకుంటున్నాను.

అట్లాంటి వేళల్లో 'మీ అనుభవాలూ జ్ఞాపకాలూ'. నాకు ఎంత గొప్పగా ఉంటాయో, మీరే యోజించండి.

ఈ గ్రంథం వ్రాసింది, మీరుకాక- మరెవరైనా- నా ఈడు జోడు వాడు వ్రాసి ఉంటేనా ?

బుగ్గి లిపి,
కావలించుకొని, ముద్దెట్టుకుని వుందును.

మరి-వ్రాసింది మీరు-అందుకని—
"ఆంగీరస బార్హస్పత్య భారద్వాజస గోత్రః—
ఆపస్తంబ సూత్రః—
యజుశ్శాఖాధ్యాయీ—
రుక్మిణీనాథశర్మా-అహంభో అభివాదయే"
మీ పాదాలు ముద్దు పెట్టుకుంటూన్న—

మీ
జ.రు.శా
రాత్రి 10-38

నా చిరునామా :
జ. రుక్మిణీనాథశాస్త్రి
15, ఉస్మాన్ రోడ్డు,
మద్రాసు - 17

* ఈ క్రిగీతలుంచిన రెండు వాక్యాలూ "చదివిన వారన్న మాటలు" శీర్షిక కింద 'అనుభవాలూ-జ్ఞాపకాలూను' రెండో సంపుటంలో, ప్రకటించకుండా విడిచిపెట్టారు 'జయంతి కుమారస్వామి' అనే మారుపేరుతో రుక్మిణీనాథశాస్త్రి. 13-3-1955 ఆంధ్రపత్రికలో 'కన్యాశుల్కం రచన ఎవరిది ?' అనే వ్యాసం ప్రకటించి అలజడి లేవదీశారు.

## 3

[ఇది జరుక్‌శాస్త్రిగారి మూడో ఉత్తరం]

మద్రాసు
శ్రీ మాత్రేనమః 1-11-55
రాత్రి 9-10

బ్రహ్మశ్రీ వేదమూర్తులయిన శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారి సన్నిధికి, నమస్కరించి రుక్మిణీనాథశాస్త్రి వ్రాసుకొనే విన్నపములు.

30-10-55న తాము నాయందు అమితమైన వాత్సల్యంతో వ్రాసిన ఉత్తరం యివాళ మధ్యాహ్నం అందింది. ఈ ఉత్తరం చదివి లోగడ నేను మీకు వ్రాసినది అచ్చుకు ఇస్తున్నారు అనుకున్నాను. నేను మీకు క్రితం వ్రాసినది వ్యక్తిగతం.

అయితే అల్లాగని అచ్చుకు ఇస్తే అభ్యంతరం పెట్టను.

కారణం ?

లేఖలు అన్నవి, పొందిన వారి సొత్తు. వారి ఇష్టప్రకారం చేసే పీలుకలవి. అదీకాక, ప్రేమతో మీరు అచ్చుకు ఇస్తున్నారు. నా 'ప్రవర' మీరు వ్రాసినట్లే—

ఆంగీరస బార్హస్పత్య, భారద్వాజ త్రియార్షేయ ప్రవరాన్విత భారద్వాజసగోత్రః ఆపస్తంబ సూత్రః యజుశ్శాఖాధ్యాయీ రుక్మిణీనాథశర్మ అహంభో అభివాదయే ! అని.

గురజాడ అప్పారావుగారిని గురించి ఆంధ్ర పత్రికలో 13-3-1955న పత్రికలో పడిన నా సందేహం. వ్రాసేప్పుడు తల అమ్ముకున్నవాణ్ణి గనక, రేడియోవారు ఏమన్నా అభ్యంతరం చెప్తారేమో అన్న జంకుతో ఆ పాత పెన్ నేమ్‌లో వ్రాశాను. ఆ జంకు తీరాక, ముడుంబై నరసింహాచార్య స్వామి గారిపై వ్యాసాలు — నా పేరనే వ్రాశాను. అంతే. అప్పారావుగారు ప్రతిభావంతులు. గొప్ప పండితులు— ఆంగ్లంలో. కాని, తెనుగున వారికి సహాయం— ఇతరుల — సహాయం వుంది — అనే నేటికీ నా విశ్వాసం.* ఇక నా వుత్తరంలో వుంచడం విషయం, పెద్దలు మీరు ఆలోచించి ఏం చేస్తే బావుంటుందో అలాగ చేయండి మీ యిష్టం.

గిడుగు రామమూర్తి పంతులుగారిని తామూ అడిగారా ? నేనూ వారిని రాజమహేంద్రవరంలో అడిగాను. వారు నా యందు అమితమైన అభిమానం కలవారు. నవ్వారు. నా వీపు తట్టారు. అది వారి ఆశీర్వచనం. అంతే.

నేను మీకు వ్రాసిన ఉత్తరాన్ని, మీరు ఇంద్రకంటి హనుమత్ శాస్త్రిగారికీ, చెరుకుపల్లి జమదగ్ని శర్మగారికీ చూపించారా ? పురిపండా అప్పలస్వామిగారికిన్నీ. చాలా బావుంది! మీ ఖిల్లాకు నాది ఉల్లాకా ? అది గొప్పగా చూపించారా ? మిత్రులకు !! ఏం వెర్రి వారండీ మీరు ?!

శాస్త్రిగారూ !

మీయందు నా అంచనా అతిశయోక్తిగా భావిస్తున్నారా ? మీ చిత్తం. నా ప్రాప్తం.

మీ గ్రంథం విషయంలో గూడా నేను వ్రాసింది అతిశయోక్తేనా....? కొన్ని కొన్ని సందర్భాలలో ఎక్కువ చెప్పారేమో అని అనుకున్నాను. అది తప్పిస్తే — మీ గ్రంథం గొప్పదికాదా ? అందులో ఎంత తపన ఎంత క్షోభ వుంది ! ఆ క్షోభ కొత్తదారి తొక్కే ప్రతి వారూ పడేది అనీ, అంత ఘర్షణ ! సంఘర్షణ పడ్డాక కలిగే ఫలితం పది కాలాలపాటు నిలుస్తుంది అనీ నా విశ్వాసం. శ్రీశ్రీకి తండ్రి సులక్షణసారాదులు కొనియిచ్చి అతని కవితా వ్యాసంగానికి దోహదం చేశాడట. శ్రీశ్రీ చెప్పాడు ఎప్పుడో. భారతిలో కథ చదువుతున్నందుకు, అమ్మచేత చివాట్లూ—నాన్నచేత దెబ్బలూ తిన్నాను నేను. ఇలాగ వుంటయ్ జాతకాలు. ఏం చెప్తాం ?!

మీరు ఈమధ్య విశాఖపట్నం వెళ్ళివచ్చి ఉంటారు. పురిపండా అప్పలస్వామిగారు ఖులాసా ? నన్ను యింకా మరవన్లేదూ ? అరె ! ఆశ్చర్యం !!

మీ 'అనుభవాలూ, జ్ఞాపకాలూ' ప్రస్తుతం నా దగ్గిర లేదు. ఇప్పటికి నలుగురు చదివారు. ముగ్గురు మెచ్చారు. మిమ్మల్ని చూడాలని వుంటుంది ఎప్పుడూ. మీతో ఓ రోజన్నా కనీసం మాట్లాడాలి. ఎన్నో సంగతులు తెలుసుకోవాలి. ఎట్లా ?? ప్రాప్తం ఎప్పటికో !

నాశరీరం, ఈ సంవత్సరం ఏప్రిల్‌నుంచీ—చాలా అసహ్యంగా తయారు అయింది. నేను రేవతీ నక్షత్రం 3వ పాదంలో పుట్టినవాణ్ణి. అష్టమశని. ప్రభూ. 3 సంవత్సరాలు నన్ను ఆడించి విడిచింది— అందులో అనారోగ్యం. చావను, బతకను. ఈ మధ్య యోగాసనాలు

---

* నెం. 2వలేఖ (3-10-55)ను ప్రచురించేటప్పుడు "గురజాడ ప్రస్తావన ఉన్న రెండు వాక్యాలూ తీసివేసి ప్రకటిస్తాను. మీకభ్యంతరం లేదుకదా ! " అని సుబ్రహ్మణ్యశాస్త్రిగారు రుక్మిణీనాథశాస్త్రి గారికి వ్రాసిన లేఖలో అడిగి ఉంటారు. దానికే ఈ సమాధానం. శ్రీపాదవారి ఇష్టప్రకారం ఆ వాక్యాలు తొలగించారు.

3

వైయ్యలేకపోయినాను. లంకణాలలో మనుగుడుపులు అన్నట్లు—నవ రాత్రాలు. 10 రోజులూ జగజ్జననికి, మా అమ్మవారికి పూజలు ఎల్లా చేశానో—ఆ సర్వేశ్వరికి తెలియాలి. లేవలేను. సుస్తీ పేరు: 'మూలశంక' అది విజృంభించింది, భావ కవిత్వంలాగ. దాన్ని అదుపుల్లోకి తెచ్చేసరికి తాతలు దిగివస్తున్నారు.

నెల్లాళ్ళు సెలవపెట్టి (డిసెంబరు అంతా) తిరువన్నామలైకి పోతున్నాను. యోగాసనాలు ఇత్యాదికం సాధించటానికి. సర్వరోగ నివారణి యోగం అని విశ్వాసం నాకు. సొంత సోది వ్రాస్తున్నట్లున్నాను. బంద్.

మీ 'మిగడ తరకలు' అచ్చయినాయా? ప్రేమ పాకం? అచ్చు అయితే ఒక కాపీ నాకు ఆశీర్వదించి పంపండి. శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి ఏం చేస్తున్నారు? కొత్త కావ్యాలు వ్రాస్తున్నారా? శ్రీ మధ్వవారు వ్రాసిన వ్యాసం "భూషణిక్ దివ్యపురుషు" అన్నది చదివాను. బాగా వ్రాశారు. వారూ 'ఐరం' అనే ఇదిలో పడ్డట్లు ఎందుకో ఆశిపించింది. ఆ మధ్య. నిజం తెలియదు. గొప్ప ప్రతిభాశాలి వారు. "బహుశాఖాహ్యనం తాశ్చబుద్ధయో అవ్యవసాయినాం" అన్నట్లుగా వారు—తయారు అవుతారేమో అని నా భయం. ఒకటి. ఇది మనకు తారకం అనుకుంటే—దాన్ని అంతు చూడాలి అనే నా క్షోభ. నాలాంటి భ్రష్టజాతకులు ఏదీ సాధించలేరు. అది అల్లా వుండనీయండి. హనుమ దిం ద్రకంటికేమి? గొప్ప రసజ్ఞులే. మంచి వ్రాయసీ గదా! ఏమిటో, గట్టి దీక్ష ఏర్పడ్డానికి గూడా మీ అనుభవాలు జ్ఞాపకాలు వంటివి ప్రోత్సహిస్తయ్ అని నా విశ్వాసం.

గురజాడ అప్పారావుగారి విషయంలో తిరిగి వ్రాద్దామా అనివుంది. చెప్పవలసింది ఎంతో మిగిలిపోయింది. "పునః ప్రాణాయ్యమ్య" అందామా అనుకుంటున్నాను. మీరేం అంటారు? దయవుంచి వివరంగా వ్రాయించండి.

మీ

జ. రు. శా

జ॥ రుక్మిణీనాథశాస్త్రి
15 ఉస్మాన్ రోడ్డు
మద్రాసు—17

4

[ఇది రుక్మిణీనాథశాస్త్రిగారు శ్రీపాద వారికి వ్రాసిన నాలుగో ఉత్తరం.]

మద్రాసు
30-11-55

శ్రీ మాత్రే నమః

బ్రహ్మశ్రీ వేదమూర్తులయిన శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారి సన్నిధికి నమస్కరించి రుక్మిణీనాథశాస్త్రి వ్రాసుకొనేది నమస్కారోభయ కుశలోపరి :—

మీరు ఈ 27న వ్రాసిన లేఖ నిన్న మధ్యాహ్నం చేరింది. మీకు నాయందుగల వాత్సల్యానికి కృతజ్ఞుడను. తాము జనవరిలోనో, ఫిబ్రవరిలోనో మద్రాసుకు వస్తామని వ్రాశారు. ఎగిరి గంతువేసింది మనస్సు. శుభం. కంచి. మంత్రశాస్త్రం సంగతులు చాలా తెలుసుకోవాలి మీవల్ల. మరో కోర్కె గూడాను. తిరువన్నామలైకి మనం ఇద్దరం కలిసి పోదాం. మీ నా మిత్రులు శ్రీ గుడిపాటి వెంకట చలంగారిని చూచి వద్దాం.

"మిగడతేరకలు" అప్పటికీ యిప్పటికీ బాగున్న పేరు. మీకు యిష్టం లేకపోతే—'ధర్మ లేక తత్వ మీమాంస' వుంచండి. ఏమయినా, మిగడతరకలకు దగ్గిరికిరావు. గురజాడ అప్పారావుగారిని గురించి—వ్రాస్తాను. కాని నా క్షోభ యిది: ఏదీ—ఇదమిత్థం అని నేనై తేల్చి చెప్పకూడదు. వున్న సాక్ష్యం, సంగతి సందర్భాలూ అన్నీ తెచ్చి ప్రజ ముందు పెట్టడం. ఎవరికి వారే, తీర్పు చెప్పుకొనేటట్లు చూడడం. ఆ తీర్పు ఎటు చెప్పుకొన్నా సరే.

రామకృష్ణ కవులు — తిరుపతి వెంకట కవులు గుర్తుచేశారు. వోపావుగంట, గీరతంలోని పద్యాలు, తిరుపతి వెంకటేశ్వరరార్థ శతకంలోని పద్యాలూ, గుర్తున్నవి చదువుకొన్నాను. మనలో మాట నాకు తిరుపతి కవుల యందు పక్షపాతం. అల్లాగని వెం॥ రా॥ లను గాని (వెంకట రామకృష్ణ కవులు), కొప్పరపు వారినిగాని, తృణీకరించలేను, వెంకట శాస్త్రిగారిని లవలేశమూ తక్కువ చెయ్యలేను. అంతపోట్లాట ఆనాడు జరిగింది గనుకనే—అంతో యింతో సాహిత్యాభిరుచి దేశంలో జాగృతం అయింది. పోట్లాడి—వేదం వెంకట రాయశాస్త్రులుగారూ, తిరుపతి కవులూ సాహిత్యాభిరుచిని పెంపొందించారని ఇప్పటికీ నమ్ముతున్నాను. అలాగా ఎరత్ర శాబ్దికులుగా పోట్లాడినట్లు కనిపించినా, రామకృష్ణ కవుల 'గగన పుష్పం, రామకృష్ణ మహాభారతం' వేదాల తిరువెంగళాచార్యులు

గారి శైష్యోపాధ్యాయిక, శతఘ్ని, తి॥ వెం॥ అర్ధ శతకం, యిటు తి॥ వెం॥ కవుల గీరతం, ఎంతెంతగానో యిప్పటికీ కనిపిస్తాయి, అంతటి సాహిత్య సమరాలు చేయగల యోధులు నేడు లేరు. ఆ వోపికలు అసలేలేవు. ఏ విశ్వనాథ సత్యనారాయణగారో ఉన్నా- ఆయనకు తగ్గ ప్రతిస్పర్థి లేడు, కనక -

వెంకట రామకృష్ణ కవులను గురించి కొంత వ్రాశారు గనక-యీ ముక్క వ్రాస్తున్నాను.

ఆంధ్రపత్రికలోఁయిటీవల, 'విశ్వగుణాదర్శం' అచ్చు అవుతోంది. చిత్తగిస్తున్నారా ? లోగడ-వెం॥ రా॥ లు కూడా తర్జుమా చేశారు ఈ గ్రంథాన్ని. ఈ తెలుగు పిలకా గణపతిశాస్త్రిగారిది.

'ఆత్మబలి' చదువుతారా ? అని వ్రాస్తున్నారా ? ఏం మాట అది ? మీరు వ్రాసింది. ఆ తేనె తెనుగు-ఎన్నిసార్లు అయినా చదువుతాను. యీ పంక్తులు వ్రాస్తూంటే- 'ఇల్లు పట్టిన వెధవాడబడుచు' ఒక్కసారి చదవాలని ఆశగా వుంది. పోవాలి యూనివర్సిటీ లైబ్రరీకి. అక్కడ వున్నయ్ భారతులు అన్నీ.

ఈ మధ్య 'భువన ఘోష' అనే గ్రంథం వచ్చిందట. యిక్కడ దాన్ని గురించి అనుకుంటున్నారు. నేను యింకా చూడ లేదు. చాలా పితలాటకంగా వుందట. మీరు వస్తున్నారు గదా. అప్పుడు ఎన్నెన్నో అడగాలి.

మీ

జ. ర. శా

30-11-1955

1. మీ పెద్దఅన్నగారి చిత్రం ఎంత బావుందండీ. పది పన్నెండు సార్లు అయినా చూచి తన్మయుణ్ణయ్యాను, ఆయన్ను ఎరగనుకాని, పండితుడని, అంతర్ముఖుడనిపించింది. నమో మహద్భ్యః.

2. మీకు సాపుగా మతిపోయింది. కుతః? కొండికను, నా పుత్తరాన్ని అచ్చొత్తుతారా ? యోజించండి. తప్పు. మీరెక్కడ యోచిస్తారు ? మీకు మతిపోయింది గద ! మీ అంతస్తు ఎక్కడా? నేనెక్కడా ? శాస్త్రులవారూ ! అన్యాయం. సరి-ఇప్పుడా చర్చ ఎందుకు ? లాభంలేదు. అభిమానం పట్టి మిమ్మల్ని అట్లా చేయించింది. ఈ భాగంవల్ల ప్రవా పర్వతావధాన్లగారి బదులు ఏలూరి పాటివారూ, దివాకర్ల తిరుపతి శాస్త్రిగారూ, రామకృష్ణ కవులూ, వీళ్ళు ముందాడారు. గీరతంలో గుర్తున్నపద్యాలు ఓసారి నాలో నేను పాట పాడుకున్నాను. వీరేశలింగంగారిని గురించి మీరు వ్రాసింది యథార్థం. అట్టిదే గురజాడ అప్పారావు. ఇతనికి మన వాళ్ళంటే వుండే అసహ్యం, మన సంస్కృతి యందుండే అసహ్యం ఎంతైనా గర్హ్యం ! మీ మూడవ వాల్యూం ఓ రెండు మూడు రోజుల్లో వస్తోంది కదూ !

విధేయుడు

జ. రుక్మిణీనాథశాస్త్రి

5

[శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'అనుభవాలూ-జ్ఞాపకాలూను' రెండో సంపుటం 1958 జనవరిలో ప్రకటితమైంది. శ్రీపాద వారు ఆ రెండో సంపుటం రుక్మిణీనాథశాస్త్రి గారికి పంపారు. అది అందుకుని శ్రీపాద వారికి వ్రాసిన రెండు కార్డులలో (ఒకేరోజు) ఇది మొదటిది. శ్రీపాదకు జలసూత్రం వారు వ్రాసిన ఉత్తరాల్లో ఇది అయిదవది-]

3-3-58

శ్రీ మాత్రేనమః మద్రాసు

బ్రహ్మశ్రీ వేదమూర్తులయిన "సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి నమస్కరించి వ్రాసుకొనేది. తాము నాయందు వాత్సల్యంకొద్దీ పంపిన "అనుభవాలూ-జ్ఞాపకాలూ" 2వ భాగం, నిన్న ఉదయం అందింది ! రెండుసార్లు నిన్ననే చదివాను ! కనీసం మరో రెండు-సార్లయినా చదువుతాను. క్లుప్తంగా, ఒకనింద, ఒకస్తుతి-

6

మద్రాసు

శ్రీ మాత్రేనమః 3-3-58

శ్రీ శాస్త్రిగారికి నమస్కారములు. ఇందాకే మీకు కార్డు వ్రాశాను. నా మనస్సు స్పష్టంగా లేదేమో అని మళ్ళీ వ్రాస్తున్నాను. ఏలూరిపాటి దయానులుగారిని, వెలివేసిన స్వాములారు ఎవరండీ ? వాకసొగసు నన్ను బహుగా ఆకట్టింది. గీరతం. ఇటు తిరుపతి శాస్త్రిగారూ, అటు వెం॥రా॥లు కూడా అయిష్టంగానే ఆ సాహిత్య సమరం నడిపారన్నమాట. చూడండి, వారిలో ఎంత నిగ్రహశక్తి ఉందో, అపునుసురి-మనలో దుశ్చింత లేకుంటే-త్రాచు ఏమీ చెయ్యదన్నవారు నిగ్రహ పరులుకారా ? మీరు, వెం॥రా॥ల దగ్గిరికి వెళ్ళినట్లే, వేదాల తిరు వెంగళాచార్యులుగారూ వెళ్ళారు. రామకృష్ణ శాస్త్రిగారి దగ్గరే చదివారట. వారూ తిరుపతి శాస్త్రిగారి యందు ఎంతో గౌరవం చూపుతారు. ఆ మహనీయుడు అట్టివాడు కాబోలు. తిరు వెంగళాచార్యులుగారికి వ్యాకరణ శాస్త్రం తాము చెప్తానన్నారట. ఆచార్యులుగారు చెప్పారు. మిమ్మల్ని చూడాలని వుంటుంది. మీరా మద్రాసు రారు. నేనా పంజర శుకాన్ని. దైవేచ్ఛ వుంటే మిమ్మల్ని తప్పక కలుస్తాను. 'లలితాత్రిశతి' అని అమ్మవారి పేర

స్తుతి కావ్యం ప్రారంభించా. 60 శ్లోకాలదాకా అయినాయి. తమ అజ్ఞ అయితే తమకు నివేదిస్తాను.

మీ జ.రు.శా

నా చిరునామా
జ. రుక్మిణీనాథశాస్త్రి
15 ఉస్మాన్ రోడ్డు, మద్రాసు- 7

7

మ ద్రా సు

శ్రీ మాత్రేనమః 8—3—58

బ్రహ్మశ్రీ వేదమూర్తులయిన శాస్త్రిగారి సన్నిధికి-నమస్కృతి.

మీ అదరాభిమానాలు కల కార్డు అందింది. నా వుత్తరానికి, మీకు కోపం వచ్చింది కాబోలు అని కొట్టుకుంటున్నాను. నన్ను మన్నించారు. కృతజ్ఞణ్ణి. ఊరందరిదీ ఒకదారి అన్న సామెతకు ఉదాహరణ నేను-అందరిలాగా 2వ వాల్యూం చదివి ఊరుకోలేదు. 1,2 వాల్యూంలు, ఒకే బిగిని చదివాను. వెనక తగలని, అందని కొత్త సొగసులు 1వ వాల్యూములో దొరికాయి. 2వ వాల్యూం ప్రశస్తి, నాకు తోచింది వ్రాస్తే-వ్యాసం అవుతుంది. మరొక్కసారి పరిశీలనగా, 1,2 వాల్యూంలు చదివి రెంటిపై వ్యాసం వ్రాయాలని వుంది. ఈశ్వరేచ్ఛ, తాము నెల్లూరు వస్తారా ? మద్రాసుకూ దయ చేస్తారా ? నాకూ దర్శనం ఇస్తారా? ఎంత సుకృతం. మీ అజ్ఞపాటిస్తాను. సంస్కృత వచనం వ్రాసే సాధిక చేస్తాను. తప్పదు. వెంకట రామకృష్ణ కవులు చెప్పిన ప్రతికను మీరు ప్రారంభించక తప్పదు. విజయ దశమికైనా తీసుకురావాలి అని నా ఆశ. మీరు మద్రాసే వస్తే-నా నోటి వినడానికి-ఓ పూటయినా కేటాయించండి. అంత వుంది చెప్పటానికి-మనవి చేస్తాను. పిడపర్తివారిని గురించి 2వ వాల్యూంలో బహు తక్కువ వ్రాశారేమి ? యింకో కథ గూడా విని వున్నాను. వస్తున్నారుగా ! ఎప్పుడు వస్తారు ? ఎదురు చూస్తూ వుంటాను.

మీ
జ. రుక్మిణీనాథశాస్త్రి
8—3—58

8

మ ద్రా సు

శ్రీ మాత్రేనమః 18—4—58

బ్రహ్మశ్రీ వేదమూర్తులయిన శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారికి నమస్కరించి వ్రాసుకొనేది. నమస్కారోభయకుశలోపరి:-

తాము నాపైని ఎంతో వాత్సల్యంతో వ్రాసిన (15-4-58న) కార్డు యిప్పుడే చేరింది. తాము మద్రాసుకు వస్తున్నారనీ తమతో కొంతకాలం గడిపే అదృష్టం పడుతూంది అనీ, నేనూ శ్రీ యామిజాల పద్మనాభస్వామిగారూ అనుకుంటూ వస్తున్నాము. సరి. ఈశ్వరేచ్ఛ ఎప్పటికో. ఎండలు దండు ముండలల్లే ధగ ధగ లాడుతున్నయ్. ఈస్థితిలో నేను బందరు వెళ్ళి రావలసి వస్తోంది. ఎట్లా వెళ్ళిరాగలనో. ఈ 28న ఇక్కడ బయలుదేరుతూన్నాను. తిరిగి మద్రాసుకు రాంగానే వుత్తరం వ్రాసుకుంటా.

విధేయుడు
జ.రు.శా
18-4-1958

9

మ ద్రా సు

శ్రీ మాత్రేనమః 23—4—60

బ్రహ్మశ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి .

నమస్సులు;

ఈశ్వరానుగ్రహము వల్ల నా కుమారుడు చిరంజీవి శివ ప్రసాద్ కు ఈ 9-5-60న బందరులో స్వగృహంలో ఉపనయనం చేస్తున్నాను. తాము మమ్ము దీవించ ప్రార్థిస్తున్నాను.

విధేయుడు
జ. రుక్మిణీనాథశాస్త్రి

[సేకరణ - సమర్పణ : "క వ క్ ప్ర వా సి"]

# కవిత్వం కాకపోతేనేం?

## శ్రీ మానేపల్లి సత్యనారాయణ

ఒకప్పుడు నేను కవిత్వం రాయాలనుకునేవాణ్ణి
కవిత్వం ఎంతో ఎత్తుగా, ఎంతో లోతుగా
ఎంతో అందంగా, అధివాస్తవంగా, అభ్యుదయంగా,
అనుభూతులమయంగా
అలంకార సంయుతంగా, అనల్పశిల్పంతో ఒప్పారాలని
అతి గట్టిగా నమ్మేవాణ్ణి
అలాగె రాసె ప్రయత్నాలు చేసేవాణ్ణి.

సంవత్సరాల అంకెలతో పాటే
నా వయసూ మారుతూ వచ్చింది
కవిత్వంలో పైె చెప్పినవన్నీ ఉండటం మంచిదే
కాని సదరు సరుకంతా చేరి – కవిత్వాన్ని
ప్రజలకు, పాఠకులకు దూరం చెయ్యడం
ఒప్పుకోనిప్పుడు

ప్రతిరోజూ చదివే పత్రికలా
ప్రతి క్షణం పీల్చే గాలిలా
ప్రజలకు అతి చేరువుగా, అతి అవసరంగా
అత్యంతాతి అత్యంత నిరాడంబరంగా
అయినా అత్యంత బలవర్ధకంగా వుండాలంటాను
నేనిప్పుడు రాస్తున్నది కవిత్వం అనే భ్రమ
నాకిప్పుడు లేనే లేదు
నే రాస్తున్నది చదివినవాళ్ళందరికీ,
విన్నవాళ్ళందరికీ
స్పష్టంగా అర్థమైతే, ఆపైన ఎంతో కొంత
మేలు చేసేదైతే
ఇంకా ఆపైన మరపురాని జీవితసత్యాన్ని
చెప్పగలదైతే
మార్పును కూడా తీసుకురాగలదైతే –
అది కవిత్వం కాకపోతేనేం?

# జ్యోత్స్నా గీతం

## శ్రీ తిరునగరి

ఈ నీలాకాశంలో
పున్నమి వెన్నెల్లో
వెండి మేఘం రథంపై
వెళ్ళిపోదాం రా ప్రియా!
ఈ దుఃఖాల్ని మరచిపోదాం
ఈ నిట్టూర్పులకి స్వస్తి చెబుదాం
జీవితం
కంటకితాధ్వంలో ప్రయాణం
కన్నీటిని పరిషేచనం చేస్తూ
కాల ప్రవాహంలో కొట్టుకుపోవడం
ఈ శరద్రాత్రుల సౌందర్య వేళలు
జారవిడుచుకుంటిమా
శేషించేది వేదనే ప్రియతమా!

ఏదీ ఈ శుభ్రజ్యోత్స్నలో
ఒక్కసారి పకాలున నవ్వు
నీ తెల్లని పట్టుచీర కుచ్చిళ్ళు జీరాడగా
తెల్లని ఈ వెన్నెల్లోకి కదలిరా!
కష్టాలను కన్నీళ్ళను కాస్సేపు మరచిపోదాం
కమనీయ సౌఖ్యసీమల్లోకి కదలిపోదాం
రా ప్రియా!
రాగ సుధవై
ఆనంద మధువై
ఈ శరజ్జ్యోత్స్నలో
వెండి మేఘం రథంపై
వెళ్ళిపోదాం
రా!

డా॥ ఎస్. గంగప్ప

# అన్నమాచార్య పురందరదాసుల సాదృశ్యాలు

**1.0** 'సంకీర్తనాచార్య, పద కవితా పితామహ' అనే అరుదైన బిరుదాంచితుడైనవాడు అన్నమాచార్యుడు, 'కర్ణాటక సంగీత పితామహ' అనే బిరుదుతో ప్రసిద్ధికెక్కినవాడు పురందరదాసు. వీరిద్దరు సమకాలికులు. పైపెచ్చు పరస్పర సందర్శన సంభావితులు. ఒకరు తెలుగులోనే పద రచనా పరంపరకు ఆద్యులు. మరొకరు కర్ణాటకలో దాస సాహిత్యానికి దోహదం చేసిన మహానుభావుడు. దాస కూటానికి ప్రధానవ్యక్తి, 'దాసరందరె పురందర దాసరయ్య' అని కన్నడంలో ప్రసిద్ధి కెక్కినవాడు. అన్నమయ్య శ్రీ వేంకటేశ్వరునిపై 32 వేల పదాలు రచించినట్లు తెలుస్తుంది. అవన్నీ అతని పుత్రపౌత్రులు రాగి రేకులపై లిఖింపించి భద్రపరచటం వల్ల అన్నమయ్య కృత పదాలన్నీ ఈనాడు లభ్యమవుతున్నాయి. 1936లో ఆరంభించి తిరుమల తిరుపతి దేవస్థానం వారు ప్రకటిస్తూనే ఉన్నారు. పురందరదాసు 4,75,000 పదాలు రచించినట్లు ప్రతీతి ఉన్నా ఈనాడు సుమారు ఐదారు వందల పదాలు మాత్రమే లభ్యమవుతున్నాయి. ఇద్దరూ హరినామ స్మరణంతో తరించిన భక్తాగ్రేసరులు. ఇద్దరూ తమ తమ భాషల్లో పదరచనచేసి సామాన్య ప్రజల్ని ఉద్బోధించిన మహా పురుషులు. భక్తి జ్ఞాన నీతి వైరాగ్యాల్ని పదాల్లో ప్రకటించి, ప్రబోధించి ప్రజల్ని మేల్కొల్పిన వైతాళికులు. రామానుజుల అనుయాయి అన్నమయ్య. మధ్వమత ప్రధాన ప్రవర్తకుడయిన వ్యాసరాయల శిష్యుడు పురందరుడు. అయినా జాతి మత కులాతీత వ్యక్తులుఇద్దరూ.

**1.1 జీవిత విశేషాలు** :- అన్నమయ్య మిక్కిలి చిన్న వయసులోనే విరక్తుడై కలియుగ వైకుంఠమైన తిరుమలలో వెలసిన శ్రీ వేంకటేశ్వర సందర్శనార్థమై వెళ్ళి తెలియక కష్టాలను ఎదుర్కొని స్వామి దర్శనం చేసుకుని అనేక పదాలు రచించి పాడటం అచటి అర్చకుల్ని ఆశ్చర్య చకితుల్ని చేయడం మొదలైన విశేషాలు మనల్ని సంభ్రమాశ్చర్యాల్లో ముంచివేస్తాయి. ఆ వెనుక తల్లిదండ్రులు వెదకి అన్నమయ్యను తాళ్ళపాకకు తీసుకొనిపోయి యుక్త వయస్కుడు కాగా ఒకరు కాదని ఇద్దర్ని పెళ్ళిచేయడం, ఆ వెనుక కూడా వైరాగ్యంతో భక్తిప్రపత్తుల్ని ప్రకటిస్తూ క్రమంగా నివాసం తిరుమలలో శ్రీనివాసుని సన్నిధిలోనే స్థిరపరచుకోవడం, జీవితాంతం అనేక శృంగార, అధ్యాత్మ పదాలు రచించి, పాడి, అవి తరించడం [illegible] మహా సంపన్నుడైన వజ్రాల వ్యాపారి వరదప్ప [illegible], తండ్రి తదనంతరం తాను సైతం నవకోటి నారాయణుడనిపించుకొన్న శ్రీనివాసుడు తన జీవితంలో కలిగిన ఒకానొక సంఘటన మూలంగా వైరాగ్యంలోకి దిగిపోవడం జరిగింది. అతను మిక్కిలి పిసినారి. కానీ భార్య మాత్రం ఉదారహృదయ. పిల్లికి సైతం బిచ్చమేయని పిసినారి శ్రీనివాసుడు, ఒకానొక బీదబ్రాహ్మణుడు సహాయార్థం వచ్చి, తిరస్కృతుడై, శ్రీనివాసుని భార్య వద్ద ముంగరను బహుమతిగా పొంది, దానికి తగిన డబ్బిమ్మని శ్రీనివాసుని దగ్గరకే వెళ్ళగా, అది తన భార్య ముంగర అని గుర్తించి వెంటనే ఇంటికి వెళ్ళి భార్యను గద్దించగా ఆమె అసహాయయై, పూజా గృహంలో ప్రవేశించి ఉంగరంలోని వజ్ర విషాన్ని పానంచేసి మరణించ ఉద్యుక్తురాలు కాగా అలాంటి ముంగరే గిన్నెలో లభించగా దానిని భర్తకిస్తుంది. భర్త ఆశ్చర్యంతో జరిగిన సంగతి గ్రహించి, సంపదలపై వ్యామోహాన్ని తెంచుకొని, నిరుపేద జీవితాన్ని స్వీకరించి ఆలుబిడ్డలతో పురందర విఠ్ఠలునిపై పదాలు పాడుతూ వెళ్ళి విజయనగరంలో ఆధ్యాత్మికంగా రాజ గురువైన శ్రీ వ్యాసరాయని ఉపదేశం పొంది, పూర్వనామం వదలి పురందరదాసు అనే పేరుతో పద రచన చేస్తూ భక్తి జ్ఞాన వైరాగ్య నీతి బోధచేస్తూ బిచ్చమెత్తుకొని జీవితం గడుపుతూ ఉండేవాడు. అదే సందర్భంలో తిరుపతిలో అత్యంత ప్రసిద్ధ పదకర్త అయిన అన్నమాచార్యుని సందర్శించి విష్ణుస్వరూపంగా భావించి గౌరవించాడు. అదే రీతిని పురందర దాసుని సైతం అన్నమాచార్యుడు పురందర విఠ్ఠలునిగానే సంభావించాడు.[1]

ఈ ఇద్దరూ రాజులని ధిక్కరించిన వారే. అన్నమయ్య వేంకట శైలపతిపై శృంగార పదాల రచన చేసి పాడుతూ ఉండగా

సంతోషించినవాడు అతని బాల్య స్నేహితుడూ ఆ వెనుక టంగుటూరు మండలాధిపతి, తరువాత పెనుకొండ విజయనగరాధిపతి అయిన సాళువనరసింగరాయలు. తనపైగూడా అలాంటిపదాలు రచించమని వేడగా తిరస్కరించిన కారణంగా రాజు అన్నమయ్యను సంకెళ్లు వేయించి, కారాగారంలో పెట్టించాడు. కాని భగవంతునిపై

"ఆకలి వేళల నలపైన వేళలను
తేఁకువ హరి నామమే దిక్కు మఱిలేదు."[2]

మొదలైన పదాలు పాడి భగవదనుగ్రహంతో సంకెల వదలించుకొనడం చూచి తన తప్పిదాన్ని క్షమించ వలసిందిగా శరణు వేడుకొన్నాడు. అతని అనుగ్రహానికి పాత్రుడయ్యాడు. అన్నమయ్య రాజు చేత సత్కృతుడయ్యాడు.

ఇలాగే నరస్తుతి వ్యతిరేకి పురంధరదాసు. అన్ని సంపదల్ని బీదలకు దానంచేసి తాను పేదరికాన్ని తెచ్చుకొని బిచ్చమెత్తి జీవిస్తూ ఉండేవారు. ఎవరి ఆశ్రయాన్ని కోరలేదు-పైపెచ్చు నరస్తుతి వైముఖ్యాన్ని ఈ పదంలో ప్రకటించాడు:

"హిందెల్లా స్వామి ముందిల్లా । గో।
వింద నీ నిల్లదె ఇహ పరవిల్ల ॥ పల్లవి ॥

పరర బేడిప్పం తెగతి యాయతల్ల
నరరస్తుతిస నాలిగె బరడాయతల్ల
పరవిన ఇహవిల్లవర జన్మ స్థిరవల్ల
నరగె పామరగె పావద పంజరగె ॥హిందెల్లా॥

తనవు తన్నదల్ల తన్న వరారు తనగిల్ల
అనుకూల విర వాగ సతి సుతరెల్ల
అనువు తప్పి మన తల్లణి సువాగ
వనజనాభ నీనల్లదె యారిల్ల ॥హిందెల్లా॥

మాతా పితృ బంధుగళు ముంతాగి సం
ప్రీతి యోళిపలు మన్నిగిరై ఎల్ల
కాతర నాగ్యమ కొండొయ్యు వాగ సం
గాత ఇన్యారయ్య పురందర విఠల ॥౩॥ 3

ముందూ వెనుకా ఏమీలేదు, గోవిందుడు లేకపోతే ఇహపరాలు లేవు. ఇతరుల్ని స్తుతించటం నాకు చేతకాదు. నరులను స్తుతించే నాలుక నిస్సారమైంది. తనువు తనది కాదు. తనవారు తన తోడరారు. అనువు తప్పినప్పుడు నీవేదిక్కు అంటూ స్మరించినవాడు పురందరదాసు. ఇలాంటి అన్నమాచార్య, పురందరదాసుల పదాల్లోని సాదృశ్యాల్ని పరిశీలిద్దాం.

**1.2 పదరచన :** అన్నమాచార్య పదాలు రెండు రకాలు. శృంగార సంకీర్తనలు, అధ్యాత్మిక సంకీర్తనలు. పద రచనా పద్ధతికి తెలుగులో స్థిరత్వ మేర్పరచిన మహానుభావుడు అన్నమయ్య. పద్యయుత ప్రౌఢ కవితకే, పండితులకు మాత్రమే పరిమితమైన కవికే ప్రాధాన్యముండగా అన్నమయ్య తన హయాంలో పద కవితలకి పట్టం గట్టి పాడి ఆడి తరించాడు. పామర జన సందోహానికి ఉపకరించే పద రచన చేశాడు. అంతేగాదు అంతకు ముందే జాన పదుల వాడుకలో బహుళ ప్రచారంలో ఉన్న అనేక జానపద గేయరీతులకు తన పద రచనతో ప్రాణ ప్రతిష్ఠచేసిన మహానుభావుడు. ఎన్నో రకాల రాగాల్లో పదాలు రచించాడు. దీని సంకీర్తన పద్ధతిగా తెలిపి తన రచనల్ని శృంగార అధ్యాత్మ సంకీర్తనలుగా పేర్కొన్నాడు. వేంకట శైల వల్లభుని అమర శృంగార లీలా విశేషాలు, మధురభక్తి శృంగార పదాల్లోను, భక్తి జ్ఞాన వైరాగ్య నీతి ప్రబోధం అధ్యాత్మ సంకీర్తనల్లోను పట్టించి తరించాడు. ఆంధ్రదేశంలో పద కవితా పితామహ, సంకీర్తనాచార్య బిరుదులతో ప్రసిద్ధి కెక్కాడు అన్నమయ్య. సంస్కృతంలో సంకీర్తన లక్షణం రచించిన మహానుభావుడితడు.

పురందరదాసు కొన్ని లక్షల్లో పద రచన చేసినా ఈనాడు కొన్ని వందలు మాత్రమే లభిస్తున్నాయన్న సంగతి పూర్వోక్తం. ఇందులో "సూళాదులు, ఉగా భోగములు" అనే రచనలుచేశాడు పురందరదాసు. వీటిలో స్తుతి పరగీతాలు, శ్రీకృష్ణలీలా ప్రసంగ శృంగార పదాలు, భక్తి జ్ఞాన నీతి ప్రబోధాత్మకాలైన తత్వపర గీతాలు, ఉగా భోగాలు "సంగీతాభ్యాస పరులకు క్రమ తరగతులలో శిక్షణ గరపడానికి వీలుగా సరళీ జంట స్వర వరుసనూ, అలంకారములనూ, పిళ్లారిగీతాలనూ, ఘనరాగ గీతాలనూ, ప్రబంధాలను ఇతడు రచించాడు. వీటిలో చాలా మట్టుకు ఈనాటికీ కర్ణాటక సంగీత ప్రాథమిక విద్యార్థులకు నేర్పుతూ వుండటం మనం గమనించవచ్చు. ఈ రచనలన్నింటి వల్లా ఇతనికి ఆదిగురువనీ, కర్ణాటక సంగీత పితామహుడనీ పేరు వచ్చింది."[4] ఇతని రచనల్లోని ఉగా భోగాలు రెండు రకాలు. ఉగాభోగాలు, శాత్విక (వచన) ఉగాభోగాలు. పురందరదాసు ఉగాభోగాలు మీద బసవేశ్వరుని

వచనాల ప్రభావం ఉందని సాహిత్య విమర్శకుల అభిప్రాయం.[5] ఇలాంటి అన్నమయ్య పురందరుల పదాల్లో అనేక సాదృశ్యాలు గోచరిస్తాయి.

**1.3 ఆరాధ్యదేవతలు :** అన్నమాచార్యుని ఆరాధ్యదేవత తిరుమలలో వేంచేసిన శ్రీ వేంకటేశ్వరుడు. శ్రీ వేంకటేశ్వరుని ముద్రిక ప్రతి పదంలోను ఉండి తీరుతుంది. ఇలాగే పురందరదాసు ఆరాధ్యదేవత పురందర విట్ఠలుడు. 'పురందర విట్ఠల' అనేముద్రిక పురందరదాసు పదాలన్నింట తప్పనిసరిగా ఉంటుంది. అన్నమయ్య పురందరుల ఆరాధ్యదేవతలు వేంకటేశ్వర పురందర విట్ఠలులే. అయినా వైష్ణవులకు ఆరాధ్యదేవతలైన ఇతర దేవతల్ని సైతం తమ పదాల్లో స్మరించటం జరిగింది. సకృత్తుగా దశావతార, శ్రీరామ, అహోబిల, నారసింహ, హనుమంతులను స్మరించినా అత్యధికంగా శ్రీకృష్ణలీలా ప్రసంగాల్ని వర్ణించి తరించారు అన్నమయ్య. దీనికితోడు పురందర విట్ఠలుని సైతం స్మరించి ఉండటం విశేషం. పురందరదాసు ఆరాధ్యదేవత అయిన పురందర విట్ఠలునేగాక దశావతార, శ్రీరామ, అహోబల నారసింహ, హనుమంతులని స్మరించి అత్యధికంగా శ్రీకృష్ణలీలా విశేషాలు మనసారా వర్ణించాడు. ఇంతేగాక శ్రీ వేంకటేశ్వరుని విరివిగా స్మరించి ఉండటం విశేషం. అంటే అన్నమయ్య, పురందరుల ప్రధానారాధ్య దేవతలు శ్రీ వేంకటేశ్వర పురందర విట్ఠలులైనా సకృత్తుగా ఇతర దేవతలను స్మరించినా, ఇద్దరూ అత్యధికంగా శ్రీకృష్ణలీలల్ని వర్ణించడంతోపాటు పురందరుని ఆరాధ్య దైవమైన పురందర విట్ఠలుని అన్నమయ్య, అన్నమయ్య ప్రధానారాధ్య దైవమైన శ్రీ వేంకటేశ్వరుని పురందరదాసు స్మరించి ఉండటం ముఖ్యంగా గమనించదగ్గ విషయం. ఈ ఇద్దరు స్మరించిన శ్రీ వేంకటేశ్వర, పాండురంగ విట్ఠలులకు సంబంధించిన ఒక్కొక్క పదాన్ని పరిశీలిద్దాం.

అన్నమాచార్యుడు పాండురంగ విట్ఠలుని స్మరించిన పదం :

"మొక్కే లీడవయ్య నీవు ముద్దు విట్ఠలా మా
పక్క వాయ వెప్పుడును పండరంగి విట్ఠలా ॥పల్లవి॥

చిక్కని చల్ల లమ్మఁగాఁ జేరి విట్ఠలా మా
జక్కవ చన్నులంటేవు సారె విట్ఠలా
తొక్కేవు మా పాదాలు దొమ్మి విట్ఠలా
వక్కన మై చెమరించెఁ బండరంగి విట్ఠలా ॥మొక్క॥

వేళగాని వేళ వచ్చేవు మా వెంట విట్ఠలా కడు
మేలములాడఁ జేరేవు మేటి విట్ఠలా
కోట ముందై పెనకేవు మేటి విట్ఠలా
పాలు గాంచి(చే?) వేళనే పండరంగ విట్ఠలా ॥మొక్క॥

సొరిది గచ్చకాయలు చూపి విట్ఠలా
సరి పేసు లాడేవు జాణ విట్ఠలా
గొరబై శ్రీ వేంకటాద్రిఁ గూడి విట్ఠలా
పరగ మావద్ద నుంటి పండరంగ విట్ఠలా" ॥మొక్క॥[6]

పురందరదాసు శ్రీ వేంకటేశ్వరుని స్మరించిన ప్రసిద్ధపదం:

"వేంకటాచల నిలయం వైకుంఠ పురవాసం
పంకజ నేత్రం పరమ పవిత్రం
శంఖ చక్ర ధరం చిన్మయ రూపం ॥పల్లవి॥

అంబుజోద్భవ వినుతం అగణిత గుణ నామం
తుంబురు నారద గాన విలోలం
అంబుధి శయనం ఆత్మాభిరామం ॥వేంక॥

పాహి పాండవ పక్షం కౌరవ మద హరణం
బాహు పరాక్రమ పూర్ణం
అహల్యా శాపభయ నివారణం ॥వేంక॥

సకల వేద విచారం సర్వజీవ నికరం
మకర కుండలధామ మదన గోపాలం
భక్తపోషక శ్రీ పురందర విఠలం ॥వేంక॥"[7]

ఇలాంటిదే మరో పదం—

"తిరుపతి వేంకటరమణా ఏసుగేతకె బారదు కరుణ ॥ప॥
నంబిదె నిన్నయ చరణ : రిపాలిస బేకో కరుణ ॥అ॥[8]

**2.0 పద సాదృశ్యం :** అన్నమాచార్య పదాలను చూచి పురందరదాసు పద రచన చేశాడని ఒక ఉదాహరణ చూపించారు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు.[9]

అన్నమయ్య పదం :

మాళవి రాగం

"శరణు శరణు సురేంద్ర సన్నుత శరణు శ్రీసతి వల్లభా
శరణు రాక్షస గర్వ సంహార శరణు వేంకట నాయకా॥"

దీన్ననుసరించిన పురందరదాసు రచించిన పదం.

మాళవి రాగం

"శరణు శరణు సురేంద్ర వందిత శరణు శ్రీపతి సేవిత
శరణు పార్వతి తనయ మూరుతి శరణు సిద్ధి వినాయకా॥"

ఇలాంటిదే మరో పురందరదాసు పదం :-

శరణు శరణు సురేంద్ర వందిత—శంఖచక్ర గదాధర ॥ప॥
శరణు సర్వేశ్వరనె అహోబల-గిరియ నరసింహమూర్తిగె ॥6॥ 10

ఇలా అరంభమవుతుంది.

2.1 మరికొన్ని ఉదాహరణల్ని పరిశీలిద్దాం. భజనపద్ధతిలో బాగా ప్రచారంలో ఉన్న అన్నమయ్య ప్రసిద్ధ పదం.

రాగం—పాట

నారాయణ తే-నమో నమో
నారద సన్నుత—నమో నమో ॥నారా॥

మురహర భవహర—ముకుంద మాధవ
గరుడ గమన పం—కజనాభ
పరమ పురుష భవ బంధ విమోచన
నరమృగశరీర-నమో నమో ॥నారా॥

జలధిశయన రవి—చంద్రవిలోచన
జలరుహ భవనుత—చరణయుగ
బలి బంధన గోప వధూవల్లభ
నలినోదరతే—నమో నమో ॥నారా॥

ఆదిదేవసక—లాగమ పూజిత
యాదవ కుల మోహనరూప
వేదోద్ధర శ్రీ-వేంకట నాయక
నాద ప్రియతే—నమో నమో ॥నారా॥" 11

ఇలాంటిదే పురందరదాసు పదం :

రాగం - మధ్యమావతి, ఆదితాళం.

"నారాయణతే నమోనమో - భవ
నారద సన్నుత నమో నమో ॥ప॥

ముర హర నగ ధర ముకుంద మాధవ
గరుడ గమన పంకజ నాభ
పరమ పురుష భవ భంజన కేశవ
నరమృగ శరీర నమో నమో ॥నారా॥

జలధి శయన రవి చంద్ర లోచన
జలరుహ భవనుత చరణయుగ
బలిబంధన గోవర్ధనోద్ధార
నళినోదరతే నమో నమో ॥నారా॥

ఆదిదైవ సకలాగమ పూజిత
యాదవ కుల మోహనరూప
వేదోద్ధార శ్రీ వేంకట నాయక
పురందర విఠల నమో నమో ॥నారా॥12

ఈ పద సామ్యాన్ని గూర్చి డా. ఆనందమూర్తిగారు "దీనినే కడపటి చరణమున గల 'నాదప్రియతే నమో నమో' అను దానిని 'పురందర విఠల నమో నమో' అని మార్చి పురందర దాసుల పదముగా కర్ణాటకులు కొందరు వాడుచున్నారు"13 అని పేర్కొన్నారు. కానీ పురందరుని పదంలో మరికొన్ని మార్పులు కన్పిస్తాయి. పల్లవిలో 'నారాయణతే నమో నమో-భవ, నారద సన్నుత నమో నమో' అనీ, మొదటి చరణంలో 'మురహర నగధర ముకుంద మాధవ, పరమ పురుష భవ భంజన కేశవ', అనీ రెండో చరణంలో 'బలి బంధన గోవర్ధనోద్ధార' అనీ, మూడో చరణంలో 'ఆదిదైవ సకలాగమ పూజిత, పురందర విఠల నమో నమో' అనీ మార్పులుచేసి అన్నమాచార్యుని మీద తమకు గల గౌరవాన్ని ప్రకటించాడు పురందరదాసని మనం గ్రహించడమే సముచితము"ని నా భావన. ఈ గౌరవాన్ని మరో పదంలో సైతం పురందరదాసు స్పష్టం చేశాడు.

"వృందా వనదేవి నమో నమో-బిల్వ
మందిర ధరన మనః ప్రియళె
వృందావనదేవి నమో నమో ॥ప॥14

మరింత చక్కటి సాదృశ్యం గల మరో పదం పరిశీల నార్హం. అన్నమయ్య అతి బాల్యంలో కన్న కలలోని శ్రీ వేంకటే శ్వరుని వర్ణన మనోహరం.

"ఇప్పుడిటు కలగంటి నెల్ల లోకములకు
నప్పడగు తిరు వెంకటాద్రీశుఁగంటి ॥పల్లవి॥

అతిశయంబైన శేషాద్రి శిఖరముగంటి
ప్రతిలేని గోపుర ప్రభలు గంటి

శతకోటి సూర్య తేజములు వెలుగఁగఁగంటి
చతురాస్యుఁ చూడగంటిఁజయ్యన మేలుకంటి ॥ఇప్పు॥

కనక రత్నకవాట కాంతు లిరుగడఁగంటి
ఘనమైన దీప సంఘములు గంటి
అనుపమ మణిమయమగు కిరీటము గంటి
కనకాంబరము గంటిఁ గక్కన మేలుకంటి ॥ఇప్పు॥

అరుదైన శంఖ చక్రాదులిరుగడఁగంటి
సరిలేని యభయహస్తము గంటిని
తిరు వేంకటాచలాధిపునిఁ జూడఁగఁగంటి
హరిగంటి గురుఁగంటి నంతట మేలుకంటె ॥ఇప్పు॥ 15

అన్నివిధాల చక్కటి సాదృశ్యంగల పురందరదాసు శ్రీ వేంకటేశ్వరునిగాంచి వర్ణించిన పదం.

"కండె కండె స్వామియ బేడికొండె ॥ప॥

కండె తిరుపతి వేంకటేశన-కామణ్యాత్మక సార్వభౌమన
కామితార్థగళీవుదేవనె- కరుణానిధి ఎందెనిసి మెరెదెవన॥అ
కోటి సూర్యప్రకాశ వెనిప కిరీటవన్ను మస్తకది కండెను
నోటకాశ్చర్యవాదనగెముఖ నొసలి నలి తిరుమణెయకండెను
సాటి యల్లద శంఖచక్రవు చతుర హస్తదిం కండెను
బూట కద మాతల్ల కేశిరోభూరి దేవర గం: నంప్రియ
॥కండె॥

తప్పుకాణికె కప్పవను సమస్త ద్వీప గళింద తంసన
ఉప్పు బగరగళనె మారసి ఉచిత దిందలి హణవ గళిసువ
ఇప్పత్తు దుడ్డిగె సేరు తీర్థ ఒప్పదలి క్రయమాడి కోడిసువ
సర్పశయనన సార్వభౌమన అప్ప వేంకటరమణ నంప్రియ
॥కండె॥

ఉరది శ్రీదేవి యళ కండెను ఉన్నతద కౌస్తుభవ కండెను
గరుడ కిన్నెర నారదాది గంధర్వర ఎడ బలి దల్లి కండెను
తర తరది భక్తరిగె వరగళ కరెదు కోడువుదునిరతకండెను
శరధి శయన నశేష గిరి వరద పురందర విఠల
నంప్రియ ॥కండె॥ 16

ఇలాగ అన్నమయ్య పురందరులు తిరుమలలో వేంచేసిన వేంకటేశ్వరుని గాంచి పరవశత్వంతో వర్ణించి తరించారు.

ఇలాంటిదే పురందరదాసు మరో పదం ఉంది.

"కండెనా కనసి నలి గోవిందన ॥ప॥

కండెనా కనసి నలి కనకరత్న మణిమయ
నందన కండెము కుందన చరణ ॥అ॥" 17

విషయం వేరైనా అన్నమయ్య పురందరుల పదాల్లోని పల్లవులలో సాదృశ్యం గోచరిస్తుంది :

అన్నమయ్య పదం :

"ఇదిగాక సౌభాగ్య మిదిగాక తపము మఱి
యదిగాక వైభవంబిక నొకటి కలదా॥" 18

పురందరదాసు పదం :

॥ఇదుభాగ్య విదు భాగ్య వయ్య ॥ప॥

పదుమనాభన పాద భజనె సుఖవయ్య ॥అ॥" 19

**2.2** కాగా కొన్ని ఇతర పద రీతులలో సామ్యం గోచరిస్తుంది :

అన్నమయ్య జోలపాట :

"జో వచ్చుతానంద – జో జో ముకుంద
రావె పరమానంద-రామగోవింద ॥జోప॥ 20

పురందరదాసుని జోలపాట :

"జో జో శ్రీ కృష్ణ పరమానంద
నంద గోపియ కందముకుంద ॥జో జో॥ 21

అన్నమాచార్యుని శోభనల పదం

"శోభనమే శోభనమే
వైభవముల పావన మూర్తికి ॥పల్లవి॥

అరుదుగ మును నరకాసురుఁడు
సిరులతోఁ దెరలు దెచ్చిన సతుల
పరువపు వయసుల పదారువేలను
సొరిది బెండ్లాడిన సుముఖునికిన్ ॥శోభ॥

చెందిన వేడుక శిశుపాలుఁడు
అంది పెండ్లాడఁగ నవగళించి
విందు వలెనె తా విచ్చేసి రుకుమిణి
సందడిఁ బెండ్లాడిన సరసునికి ॥శోభ॥

దేవ దానవులు ధీరతను
దావతి పడి వార్ధిఁ దరువఁ గను
శ్రీ వనితామణిఁ జెలఁగి పెండ్లాడిన
శ్రీ వేంకట గిరి శ్రీ నిధికి ॥శోభ॥22

పురందరదాసు రచించిన శోభనం పదం :

"శోభాన శోభానవే
భూదేవి యరస వేంకటరాయగె శోభాన శోభానవే ॥ప॥

అందు క్షీరాంబునిధిమొదలాగి ఇందిరెహుట్టిదిందుదిసి బందు
కందర్పకోటి లావణ్య మూరుతిమేద
మందార మాలెయ హాకిదదేవిగె ॥శోభాన॥

రుకుమను శిశుపాలగను జేయయువనెందు
సకల రాయరలి బందిరలాగి
భకుత పక్షిరాజన్న కండు సంతోషది రుకుమిణిమాలెయ
హాకిద కృష్ణగె ॥శోభాన॥

సత్యభామెయు సీతె భద్రె కాళిందియు
మిత్రవిందెయులక్ష్మణెయు జాంబవతి మత్తె అనేకసహస్ర
కన్నికెయర
ప్రత్యక్షవాగిన కల్యాణ ఏగె ॥శోభాన॥

పదుమదేశ దలోబ్బ దేవాంగనెయ
పదుమ ముఖి శృతిహృతియ పదుమ నాభశ్రీ పురందర
విఠలగె
పదుమావతి ప్రియ శ్రీనివాసనిగె ॥శోభాన॥23

అన్నమయ్య పాడిన మంగళం :

మాధవునకు మంగళం
సాదు ప్రియునకు జయ మంగళము ॥మాధ॥24

పురందరదాసు పాడిన ఒక మంగళం :

జయ మంగళం నిత్య శుభమంగళం
ఇందివరాక్షగె ఇభరాజ వరదగె.... ॥ప॥25

ఇలాగే అన్నమయ్య పురందరుల పదరచనా సాదృశ్యానికి ఇంకా ఎన్ని ఉదాహరణలైనా ఇవ్వవచ్చు.

## 3.0 భావాలు

అన్నమయ్య పురందరులలో భావసామ్యం గోచరిస్తుంది. ఇందుకెన్ని ఉదాహరణలైనా చూపించ వీలవుతుంది. మచ్చుకు ఒకటి రెండు ఉదాహరణాల్ని పరిశీలిద్దాం :

జీవాత్మ పరమాత్మల అల్పత్వానల్పత్వాన్ని గూర్చి అన్నమయ్య అనవద్యంగా, హృద్యంగా వర్ణించిన పదం.

"కొసరనేల నాగుణములివి
రసికత నీ విన్నిటా రక్షించుకొనుమీ ॥పల్లవి॥

నేరమినాది నేరుపునీది
దూరునాది బంధుఁడవు నీవు
కోరుదు నేను కొమ్మని యిత్తువు
కారుణ్యాత్మక గతి నీవు సుమీ ॥కొస॥

నేను యాచకుఁడ నీవే దాతవు
దీనుడనేఁబర దేవుఁడవు
జ్ఞాన రహితుడను సర్వజ్ఞ నిధివి
శ్రీనిధియిఁక నను చేరి కావుమీ ॥కొస॥

అరయనే జీవుఁడ నంతర్యామివి
యిరవుగ దాసుఁడ నేలికవు
చిరజీవివి నే శ్రీ వేంకటపతివి
వరదుఁడ ననుఁజే వదలకుమీ ॥కొస॥26

ఇలాంటిదే చాలా చక్కటి సాదృశ్యంగల పురందరదాసు పదం :

"మంద మతియోనాను మదన జనకను నీను
కుందుగళ నెణెస దెదయ మాడి సలహో ॥ప॥

పాతక నాను పాప నాశను నీను
కోప మదమత్సరది సుళివె నాను
తాపవను తందు నిర్భయవ మాడువె నీను
రూప ఛాయవే మరుళె గొంబెనో నాను ॥మంద॥

శరణ రక్షక నీను పరమ పాతకి నాను
దురిత పర్వతద, పరిహారి పె నీను ॥మంద॥
మంద భాగ్యను నాను ఇందిరా పతి నీను
హిందు ముందిన సుద్ది అరియదవ నాను
తందె శ్రీ పురంధర విఠలన రాయనె
ఎందెందు భక్త రసలుహావె యోనీను ॥మంద॥27

**3 . 1** ఇలాంటిదే మరో ఉదాహరణ :

అన్నమయ్య పదం :

"నీవే నేరవుగాని నిన్ను బండించేను నేను
దైవమా నీకంటె నీ దాసులే నేర్పరులు ॥నీవే॥

పట్టి భక్తి నీ మీఁద వలకు వేసి నిన్ను
బట్టి తెచ్చి మదిలోన బెట్టుకొంటిని
పుట్టెడు దుఃసి నీ పాదములపైఁ బెట్టి
జట్టి కొని మోక్షము జాణలు నీ దాసులు ॥నీవే॥

నీవు నిర్మించినవె నీకే సమర్పణ సేసి
సోవల నీ కృప యెల్లఁ జూరగొంటిని
భావించొక ముక్కి ముక్కి భారము నీపై వేసిరి
పావనపు నీదాసులే పంతపు చతురులు ॥నీవే॥

చెరువుల నీళ్లు దెచ్చి చెరువు నీపైఁ జల్లి
పరము వడసినయు పిలసినట్లు
యిరవై శ్రీ వేంకటేశ ! యిటువంటి విద్యలనే
దరిచేరి మించిరి నీ దాసులే పో ఘనులు ॥నీవే॥[28]

(అధ్యాత్మ సంకీర్తనలు - సం. 8, పదం-89)

దీనికి అన్ని విధాల సమానమైన పురందరదాసు పదం :

"కెరెయ నీరను కెరెగె చెల్ల
వరవ పడెదె దవరం తెకాణిరో
హరియ కరుణ దోళాద భాగ్యవ
హరి సమర్పణె మాడి బదుకిరో
శ్రీ పురందర విఠలరాయన
చరణ కమల వనంబి బదు కిరో"[29]

(గాన కళాబోధిని)

-ఇలాగా అన్నమయ్య పురందరుల భావాల్లో చక్కటి సాదృశ్యం స్పష్టమవుతుంది.

**4 . 0** ఇంతేగాక ఈ మహానుభావులు ఇద్దరి భావనల్లో శృంగారం భక్తి, మధురభక్తి, జ్ఞానం, వైరాగ్యం, నీతి మొదలైన వాటి వివరణల్లో అత్యంత సాదృశ్యం గోచరిస్తుంది. తాము సంలీనం చెంది, తమ పదాల వల్ల ఇతరుల్ని సైతం సమ్మోహ పరచి, పరవశుల్ని గావించి, ఆనందాబ్ధిలో ముంచి తేల్చిన మహాభక్తాగ్రేసరులు. తన్మూలకంగా తాము తరించి తదితరుల శరణో పాయార్థం అనేక పదరచన చేసి మార్గోపదేశం గావించిన మహనీయులు.

## అ థో జ్ఞా పి క లు

1. చూడుడు : నా వ్యాసం అన్నమాచార్య పురందరదాసుల సమాగమం.
2. అన్నమాచార్య చరిత్ర పీఠిక-పుటలు 57-58
3. పురందరదాసర పదగళు - పదం - 102, పుట 46-47
4. శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు - ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము. పు. 144-145
5. శ్రీ ఎం. చిదానందమూర్తి - ఉగాభోగగళు మత్తు వచనగళు : ప్రబుద్ధ కర్ణాటక : సం-46, క్రోధి సం॥ చైత్ర సంచిక-1. 1984-85
6. శృంగార సంకీర్తనలు - సంపుటం 24, పు. 247-248
7. పురందరదాసర పదగళు - పదం 71
8. పురందరదాసర పదగళు - పదం 134
9. అన్నమాచార్య చరిత్ర పీఠిక - పుట 66-68
10. పురందరదాసర పదగళు - పదం 71
11. అన్నమాచార్యుల సంకీర్తనలు - పదం 27 (అన్నమాచార్య అధ్యాత్మ సంకీర్తనలు - సం XI, పుట 17)
12. పురందరదాసర పదగళు - పదం 72
13. తాళ్ళపాక కవుల పద కవితలు - పుట 78
14. పురందరదాసర పదగళు - పదం 228
15. అన్నమాచార్యచరిత్ర పీఠిక - పుటలు 4, 5
16. పురందరదాసర పదగళు - పదం 193
17. పురందరదాసర పదగళు - పదం 35.
18. అన్నమాచార్య శృంగార సంకీర్తనలు - సం XII, పదం17
19. పురందరదాసర పదగళు - పదం 7
20. అన్నమాచార్య చరిత్ర పీఠిక - పు. 61 - 62
21. పురందరదాసర పదగళు - పదం 58
22. అన్నమాచార్య సంకీర్తనలు - సం. XII, పదం-18
23. పురందరదాసర పదగళు - పదం - 352
24. అన్నమాచార్య శృంగార సంకీర్తనలు - సం III, పదం227
25. పురందరదాసర పదగళు - పుట 312
26. అన్నమాచార్య అధ్యాత్మ సంకీర్తనలు - సం. X,పదం176,
27. పురందరదాసర పదగళు - పదం 160
28. తాళ్ళపాక కవుల పద కవితలు - పు. 556-557
29. శ్రీ ఎం. మరియప్పభట్ట : సంక్షిప్త కన్నడ సాహిత్య చరిత్ర - పు. 224



# క ల గూ ర గ ం ప

## అప్సరోజాతుల జన్మస్థానములు

అప్సరశ్శబ్దమునకున్న అనేక వ్యుత్పత్తులలో 'అద్భ్యః సరంతీతి అప్సరసః'-జలమందు పుట్టినవారు- అనునదొకటి. ఇది వారి పుట్టుకకు సంబంధించినది. జలముకాక మరి పదమూడు జన్మస్థానములు బాణుని కాదంబరిలో అప్సరసల జన్మ వృత్తాంతమున చెప్పబడినవి.

"యథా విబుధ సద్మన్యప్సరసో నామకన్యకాః సంతీతి తాసాం చతుర్దశకులాని. ఏకం భగవతః కమలయోనే ర్మనసః సముత్పన్నమ్, అన్యద్వేదేభ్యః సంభూతమ్, అన్యదగ్నే రుద్భూతమ్, అన్యత్పవనాత్ప్రసూతమ్, అన్యద మృతాన్మథ్యమానాదుత్థితమ్, అన్యజ్జలా జ్జాతమ్, అన్యదర్క కిరణేభ్యో నిర్గతమ్, అన్యత్ సోమ రశ్మిభ్యో నిష్పతితమ్, అన్యద్భూమేరుద్భూతమ్, అన్యత్సౌదామినీభ్యః ప్రవృత్తమ్, అన్యన్మృత్యునా నిర్మితమ్, అపరం మకరకేతునా సముత్పాదితమ్, అన్యత్తు దక్షస్య ప్రజాపతే రత్రిప్రభూతానాం సుతానం మధ్యే ద్వే సుతే మునిరరిష్టాచ బభూవతుః తాభ్యాం గంధర్వైః సహకులద్వయం జాతం, ఏవమేతాన్యేకత్ర చతుర్దశ కులాని."

ఇది 1935 లో వావిళ్ళవారచ్చు వేసిన కాదంబరి ప్రతిలోని పాఠము (పుట 131, 132).

కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రిగారు ఈ విషయమై కాదంబరి బొంబాయి ముద్రిత ప్రతిలోని పాఠము నొక వ్యాసమున (సారస్వత వ్యాసములు. అకాడమీ ప్రచురణ. మూడవ సంపుటము పుట. 384) ఉదాహరించిరి. వావిళ్ళ ప్రతిలోని 'అన్యద్వేదేభ్యః సంభూతమ్' అన్న వాక్యమునకు బదులుగా బొంబాయి ప్రతి పాఠమున 'అన్యద్దేవేభ్యస్సంభూతమ్' అని కలదు. వావిళ్ళ ప్రతి ఈ పాఠాంతరమును సూచించలేదు.

పాండురంగ మాహాత్మ్యమున తెనాలి రామకృష్ణుడు అప్సరసల జన్మస్థానముల నిట్లు చెప్పినాడు.

స్మర శశి-శటి దజ పవమా
న రవి సుధా సలిల మునిజన క్ష్మా రిష్టా
సుర మృత్యు జ్వలన జలగు
సురవేశ్యలు........1-187 (అకాడమీ ప్రచురణ)

దీనిని గూర్చి అధస్సూచికలో పరిష్కర్తలిట్లు వ్రాసిరి :

"బాణుని కాదంబరియందు మహాశ్వేత, చంద్రాపీడునకు అప్సరోజాతుల పుట్టుకకు మూలములను వేరు వేరుగ తెల్పినది. దానికిని ఇచ్చటి దానికిని కొంత భేదము గలదు. ఇచ్చటి 'సుర' శబ్ద బలముచే, కాదంబరిలోని 'వేదేభ్యః' అనునది 'దేవేభ్యః' అనుటకు మారుగ పడి యుండుననియు, కాదంబరిలోని దక్షప్రజాపతి కూఁతురగు 'ముని' యను నామెను దెల్పుఇందలి మునిజన శబ్దమునకు 'మునియనుస్త్రీ' యని అర్థము చెప్పుకోఁదగునని యును కీ॥ శే॥ వేదము వేంకటరాయశాస్త్రిగారు సూచించినారు. చూ. 'విమర్శ వినోదము' పుట 50. ఇది యింకను విమర్శింప వలసియున్నది.''

వేంకటరాయశాస్త్రిగారు పాండురంగ మాహాత్మ్యమునందలి పై పద్యములోని 'మునిజనక్ష్మారిష్టా' అను భాగమునకు 'మున్యనంతారిష్టా' అను పాఠాంతరమును చూపిరి. ఎట్లయినను, పాండురంగ మాహాత్మ్యము కాదంబరి బొంబాయి ప్రతినే అనుసరించినది.

రామకృష్ణుని కంటె ముందు శ్రీనాథుడు అప్సరసల జన్మస్థానముల నిట్లు చెప్పియున్నాడు.

జలజగర్భుని మానసంబు వేదంబులు
దక్షప్రజాపతి దర్పకుండు
సౌదామినీ వల్లి చంద్రికాలోకంబు
సప్తజిహ్వా జ్వాల సప్తకంబు
రవి మయూఖములు నీరవని దుగ్ధాంభోధి
మృత్యుదేవత నోరి మొఱఁగుఁబండ్లు
ముని కరిష్టాదేవికిని సంభవించిన
దివ్య గంధర్వ జాతి ద్వయంబుఁ
గారణంబులుగాఁ బుట్టినారు పదియు
నాల్గుకోట్లప్సరసలు... [శివరాత్రి మాహాత్మ్యము 3-88]

శ్రీనాథుడు 'వేదంబులు' అని స్పష్టంగా చెప్పటచేత కాదంబరి ప్రతులలో కొన్నిట 'వేదేభ్యః' అని, మరి కొన్నిట 'దేవేభ్యః' అని పాఠభేదములు శ్రీనాథుని కాలము నాటికే కలవని తెలియుచున్నది. ఈ అప్సరసల జన్మస్థానములను చెప్పటలో శ్రీనాథుడు కాదంబరిని పూర్తిగ అనుసరించలేదు. కాదంబరిలో చెప్పబడిన 'పవనము'ను శ్రీనాథుడు చెప్పలేదు. దాని స్థానమున దక్షప్రజాపతిని పేర్కొనినాడు. కాదంబరి పేర్కొనని 'మృత్యువు'ను

శ్రీనాథుడు 'మృత్యుదేవత నోరి మెఱుఁగుఁ బండ్లు'గా చిత్రించినాడు. ఇక కాదంబరి 'అమృతము'ను చెప్పగా శ్రీనాథుడు అమృతమునకు షట్టిదైన 'దుగ్ధాంభోధి'ని చెప్పినాడు. క్షీరసాగర మథనమును శ్రీనాథుడు హరవిలాస, భీమఖండము లలో వర్ణించినాడు.

హరవిలాసమున 'ఎ. గీ...అనఁగ మందర కందరవ్యాప్తిచలిత
వార్ధికల్లోల వీచికా వర్తితుల
నుద్భవిల్లిరి రంభా తిలోత్తమాదు
లప్సరస్త్రీలు దేవవేశ్యాజనములు'6-89

అనీ, భీమఖండము (4.93)న "వెండియుఁ దరువంబ దరువఁ గల్ప తరువును నప్సరస్సతులును... ఉద్భవించి"రని అప్సరసలు క్షీర సాగరమందే పుట్టినట్లు తానే వర్ణించుటచేత శివరాత్రి మాహాత్మ్య మున 'దుగ్ధాంభోధి'ని పేర్కొనుట సమంజసమే. కాని 'మదనము'ను విడిచిపెట్టి 'దక్ష ప్రజాపతి'ని చెప్పుటకు కారణము కనపించదు.

అప్సరసల పుట్టుకను గూర్చి రామకృష్ణుని కాదంబరిని యథాతథముగా అనుకరించగా శ్రీనాథుడీ మార్పులను చేయుటకు గల కారణములను పరిశీలించి ప్రకటించవలసినదిగా విద్వాంసులను ప్రార్థించుచున్నాను.

శ్రీ సూర్యదేవర రవికుమార్

దుత్తనూరు

# వేదాధికారం : తగాదా తీర్పు

శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు "విశ్వ బ్రాహ్మణకవులు" అనే శీర్షిక క్రింద 'భారతి' (మార్చి, 82) లో ఒక చక్కని వ్యాసం వ్రాసినారు. "వీరికి వేదాధి కారము, అందులో ఏ వేదమందు అధికారముండినదో తెలియదు" అన్నారు. ఈ దిగువ సమాచారము వారి వ్యాస సమగ్రతకు తోడ్పడగలదని ఆశిస్తున్నాను.

ట్రైనియల్ కేటలాగు (తెలుగు) ఆర్. నెం. 186 లో "కమసాలిమతము" అనే శీర్షిక క్రింద కొన్ని ఆసక్తికర విషయాలను పేర్కొన్నారు. తాళపత్రాలపై రచించిన ఒక తీర్పుప్రతి ఇది. క్రీ. శ. 1913-14లో శ్రీ ఆత్మూరి జగన్మోహనరావు (మచిలీపట్నం) వద్ద దీనిని ఖరీదు చేసి నారు. ఇది ఒక కంసాలి గురువు వ్రాయించి పెట్టు కొన్నది. దీనిలో కంసాలులకు ఉపయోగకరమైన విష యాలు అనేకం ఉన్నాయి. ఒకప్పుడు కృష్ణ, గోదావరీ మధ్య దేశంలో కలతలు పుట్టి కంసాలివారి "ఫణము" సాగక పోగా అప్పుడు అక్కడ కంసాలి గురువుగావున్న కనుపర్తి బసువాచారి, నాటి బ్రాహ్మణులను ఆశ్రయించి సామదానాలచే వశపరచుకొని తమ అయిదు తెగలమీద తన "బణా" బాగా సాగేటట్లు, తన కులం వారికి బ్రాహ్మణత్వం ఉందనే "సభ్యనుజ్ఞ" (?) కలిగేటట్లు ఈ ఒడంబడిక (క్రీ. శ. 1756) వ్రాయించుకొన్నారట.

తీర్పు ప్రారంభం "స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశక వర్షంబ్బులు ౧౬౭౮ అగునేటి ధాతనామ సంవ్వత్సర చయిత్రశుద్ధ తదియఆరంభించి కృష్ణా,గోదా వరీ మధ్యదేశములలో వివాదపడి విద్వాంసుల్లు దగ్గిరకు వడ్ర కమ్మరం మొదలైన పంచానన౦ వారికి ఆచార్యులైన కనుపర్తి బసువాచార్యులు వచ్చి విశ్వకర్మ యొక్క అధి కారం విశ్వకర్మ వంశజులు అయ్ని ఐద్దాయ పంచాననం వారికి కులాచార ధర్మశాస్త్ర పరిశీలనం చెప్పుమని చెప్పిరి గన్కు —"

తీర్పు అంతం : "ఈ లాగుననే శాస్త్ర శ్రౌత మంత్ర బ్రాహ్మణ సూత్ర స్మృతీతిహాస భారత భాగవత రామాయణ విష్ణుపురాణాది వ్యాఖ్యానమంద్దు బ్రహ్మ విద్వాంసుల్లు పరిశీలన చెయ్యంగా వడ్రంగికి కమ్మరం కంచ్చరం కాశ కంస్సాలవారికి వేదోక్తంగా ఉపనయనాది సంస్కారాలు సాఙ్గోఙ్గ వేదాధ్యయనము అధానము యజ్ఞము గృహాది నిర్మాణకాలమంద్దు పూజార్హత్వము ఉపనయనాది సంస్కారాలు కంసాలవారికి కంసాలవారే చేయించవచ్చును అని........ కనుపర్తి బసువాచార్యుల వశానను వ్రాశియిచ్చిన ధర్మశాస్త్ర నిర్ణయం. విశ్వ కర్మ వంశమంద్దు పుట్టినటువంట్టి నిర్వాహకులైన పంచ్చా ననం వారు ధర్మశాస్త్రం గ్రహించ్చేది. రాగిశాసనం మీద చెక్కించి పల్లకీలో పెట్టి వూరేగించ్చేది. బ్రాహ్మణులకు సంభావన యిచ్చేది. బసువాచార్యుల నిర్వాహకమై ప్రబంధం వప్పించ్చినంద్దుకు ౧౧౬ యివ్వమచ్చునంట్టె నూటపదహారువేలు యిచ్చి బంద్దరు వుండి చోటి పంప్పిం చ్చేది. యీ పంచ్చాననం వారికి వఖ్ఖణ వ్రాసుకునేది. వారికి ఈశ్వరుడు యిచ్చిన మాత్రం కనుపర్తి బసువా చార్యులకు సంభావన ఇచ్చేది. కులాచారధర్మం తప్ప కుండ్డా నడుచుకునేది.

ముదిగొండ్ల అగ్రహారంలో ముక్కామల భవాని శాస్తుల్గారి కొమారుడు దక్షిణామూర్తి శాస్తుల్గ్రావాలు. కళ్ళేపల్లి అగ్రహారంలో మాలెమంద్ద అచ్యుతాచార్యులు వెంకటాచార్యులుగ్రావాలు....... గోధావరి తీరాన కారం చేటి అక్కన్ చేసులగ్రావాలు.''

శ్రీ బండ్లపల్లె ఓబుళరెడ్డి
అనంతపురం

# శిశుభాష ఉన్నదా ?

డాక్టరు హెచ్. ఎస్. బ్రహ్మానందగారి "శిశువాక్ లక్షణా వృత్తి" (భారతి, జనవరి 1982) వ్యాసము చదివితిని.

కుటుంబ సభ్యులు (శ్రీమతి, పిల్లలు, అల్లుడు) ద్వారానే ప్రాతిపదిక విషయము సేకరించగల్గినారు బ్రహ్మానందగారు. అట్టి యనుకూలత లేని నేను "విబుధవరులచేత విన్నంత కన్నంత, తెలియ వచ్చినంత తేటపఱతు."

"శిశువుల్లో సామ్యదర్శనం వున్నంతగా భేదపరిగణనం వుండదు" వారి పరిశీలనా సమాచారము.

శిశుభాషలో "అమ్మో ! ఆ అఫీసరు బకాసురుడు" వంటివి వచ్చేనియు

"ఆ! గొర్రెలు తినేవాడు పోయి బర్రెలు తినేవాడొచ్చాడు"

వంటివి లేవని వారన్నారు. ఇట్లనుటకు సాక్ష్యాధారములు ఇవ్వలేదు. మొదటిది సామ్యదర్శనము, రెండవది భేదపరిగణనమట ! ఒక చిన్నపిల్లవాడు, బడిలోని అయ్యవారల బదిలీగురించి చెప్పుచు (విద్యార్థీ, ఉపాధ్యాయుడూ సహజ శత్రువులు కనుక), "మిడిగుడ్లోడుపోయి, బింగిపండ్లోడు వచ్చినాడు" అని చెప్పుడు అది భేద పరిగణనము కాదా? కొన్ని ఎడల, సామ్యము కంటె భేదమే చప్పున తెలివిడిలోనికి వచ్చును. మరికొన్ని ఎడల పెద్దవారికైనను పోలిక తెలిసినంత సులభముగా, వారా తెలియదు. ఉప్పు కప్పురముల పోలిక తేలిక, కానీ వాని భేదము (రుచి) చూడ చూడ గానీ తెలియదు. అలంకార శాస్త్రమంతయు సాదృశ్య, సాధర్మ్యముల మీద నాధారపడి యున్నది. పై చర్చబట్టి తేలిన దేమన, సామ్యదర్శనము శిశుప్రవృత్తే కాదు-అనియు, సామ్యభేద దర్శనములు సాపేక్షములనియు.

యన్టి రామారావును చంద్రమోహన్ అని పిలుచుట, శిశువు లెందుకు పెద్దలకును సంభవించు ప్రమాదమే. అదే పిచ్చుకగూడు టోపను, అవే "ప్రక్క-వాతలు" అవే రొయ్యమీసాలు, అవే కట్టుడు పంళ్ళు, అదేబొజ్జ, అవే సన్నని కాళ్ళు, అవే "గోపబాలకుల" బ్రీచులు, అదే యస్పి బాలసుబ్రహ్మణ్యం ప్లేబాక్ గొంతు కలిగిన మన సినీ "బుల్లిబాబు"లు అందఱును సాదృశ్య, సాధర్మ్యములు కల్గి యుండుట దీనికి కారణము.

ఇటులనే వారిచ్చిన సుజాత (నటి), గోరింటాకు (సినిమ,) కుమారదేవి(యువతి), అప్పయ్య(బిచ్చగాడు) వంటి ఉదాహరణముల లోని సామ్యములను పరిగణింపవలెను. బొమ్మను ఒకసారి హనుమంతుడనియు, మరియొకసారి వినాయకుడనియు ననుటలో ఆశ్చర్యము లేదు. "గ్రోటెస్క్" (అందవికారం) విభాగమునకు చెందిన కళాఖండములు గందరగోళమును కలిగించును. పాము/ పల్లవారంల అభేదము సర్ప-రజ్జుభ్రాంతిగా అద్వైతవేదాంతులను ఉదరగొట్టుచుండగా శిశువులనన పనియేమి ?

చపాతి - పూరి, కాఫి - టీ, రేడియో - టేప్ రికార్డరు వంటి జంటల అభేదము ఏమి చెప్పుచున్నది ? వారికి అంతను పూర్తిగా పరిజ్ఞానము రాలేదని తెలుపుచున్నది. బహుద్ధాయి లయిన పెద్దవారికిని ఇట్లే తోచవచ్చును. ఒకే మాటను రకరకాల వస్తువులకు వాడుట శిశువాక్కు-కాదు. నానార్థములు ("హరి" అను పదము ఉదా), పర్యాయ పదములు ("కోకిల" అనుపదము ఉదా) పెద్దల వాక్కు-లోనివే. "ఆవును" "చెట్టు" అనుటయు కేవల శిశు వాగ్లక్షణము కాదు. పూర్ణముకు, దాని భాగమును వాడు అర్థాలంకారము. దీనిని ఇంగ్లీషున "సినెక్డెకి" అనెదరు.

"శిశువుల్లో మౌలికంగా సామ్యదర్శనమూ, బుద్ధివికసనంతో పాటుగా భేదపరిగణనమూ వృద్ధిపొందుతాయని నేను గుర్తించాను." అన్నది బ్రహ్మానందగారి పరిశోధనా ఫలితము. పిల్లలు పెరిగిన కొలది వారి విచక్షణ కూడ పెరుగును అని అర్థము. ఇది శిశు మనస్తత్త్వ శాస్త్రమో, శిశు వాగ్లక్షణా వృత్తియో యోచింపుడు.

తీయని వస్తువులపైని శిశువుల భావముల సంగతి. ఏది అభ్యాసమయిన, దానినే పాటించుట పిల్లల, పెద్దలనైజము. (చూ. "పాపంబులు కర్జములని, యేపునజేయంగ.." ఇత్యాది) అభ్యాసము కూసు విద్య. దీనినే "ఇంప్రింటు" అందురు. పిల్లలకెప్పుడును తీయని బండారముల నిచ్చుచుందురు. కనుక దేనినైనను ఎట్లున్నది యని యడిగిన, తీయగనున్నదందురు. కాకరకాయనే యిచ్చియుండిన, జిలేబీ కూడ చేదుగనున్నదందురు. ఇది వారి పరిమిత జ్ఞానము, ''ఇంప్రింటు''ల ఫలితమే కాని బ్రహ్మానందగారి అపర ఆర్కి-మెడీసు సూత్రవృత్తి సమర్థకముకాదు.

శిశువుల అల్లిబిల్లి లోకవిహారులగు బ్రహ్మానందగారికి, శిశువులు చేయు ప్రతి పనియును మహాశ్చర్య జనకము.

బొట్లు బొట్లుగా పడు కొళాయిని చూచి ఒక "చాలా చురుకైన" పక్కింటి పిల్లాడు "చూడు మామా, కొళాయి ఏడుస్తోంది" అనిన, బ్రహ్మానందగారికి సంవత్సరము తర్వాత ఆశ్చర్యము కలిగింది. ఇందులో నాశ్చర్యము కలిగించు అంశమేమయి యుండును? ఇందులో నొక అర్థాలంకారమున్నది. ఒక "ఇమేజరి" ఉన్నది. అందుకేనా? వారికాశ్చర్యమగుట! అంత చురుకైన పిల్లవాడా మాత్రము చమత్కారమును చిలుకరింపలేడా? ఒక మొద్దబ్బాయి వానవచ్చుచుండగ "దేవుడు ఒంటేలు పోస్తున్నాడు" అనును. ఇందులోను చురుకైన అబ్బాయి వాక్య సారస్యమున్నది. పెద్దలకు ఇమేజినేషన్ ఉండగా, పిల్లలకు ఫాంటసి ఉండును. పిట్టకతలు ఫెయిరీ గాథలు వారికి ప్రియమగుటకు కారణము మూలకముగనే. పరిమిత పద పరిజ్ఞానము శబ్ద వ్యుత్పాదు (అనిర్వాది) ఆటంకము కాజాలదు. దాదాపు 1000 పదముల "బేసిక్ ఇంగ్లీషు"లో సర్వ వ్యవహారము జరుపుకొనవచ్చునట!

"మెటఫరు" మానవ నైజములో నొకటి. మెటఫరు లేకుండ చెప్పినదే నిజమైన సాహిత్యము. సిసిల్ డే లాయి, శేషేంద్ర ఏమనుకొన్నాసరే.

నేను నా పూర్వపు వ్యాసములో లేవనెత్తిన వాదము, శిశుభాష అనునది ఒకటున్నదా అని. శిశుభాషకు చెందిన కొన్ని పదములనే తీసికొందము. ఉదా: ఉంగా ఉంగా, బ్రువ్వా, లాల, గొగ్గయ్య, బుజ్జగూసి. వీనిని సూక్ష్మముగా పరిశీలించినప్పుడు నాకు తోచినదేమన, పెద్దలే మాటలింకనురాని పిల్లలు చేయు కొన్ని శబ్దముల యాధారముగా, ఆయా సందర్భములలో ఇటువంటి పదములను సృష్టించి, పావ్‌లోవ్ యొక్క కండిషన్డ్ రిఫ్లెక్సు ప్రకారం పిల్లల నెత్తిమీద రుద్దిరి అని. శిశువు నీళ్ళు తాగిన తర్వాత, పెదవులు కలిపి బ్రువ్ అని శబ్దము చేయును. దీని యాధారముగ పెద్ద, శిశువును చూచి "బ్రువ్ కావాలా" అని వేరే సందర్భమున అడుగును. శిశువు ఔనన్నట్లు తలయూచును. అప్పటినుండి "బ్రువ్వా" శిశుభాషలో 'నీరు'ని అర్థమని భాషా శాస్త్రజ్ఞులు సిద్ధాంతములు చేయుదురు. మాటలు, రా ప్రారంభించినప్పటి నుండియే, అన్వయ దోషములు లేకుండ, నెన్నియైనను వాక్యములను శిశువల్ల గలదని చొంస్కీ అనినాడు. అటువంటప్పుడు శిశుభాష వేఱుగ నుండనక్కఱలేదు. అందుకే "శిశుభాష" పదములంత తక్కువగా నుండుట!

చైల్డ్ ఈజ్ ఫాదర్ ఆఫ్ ది మాన్ అన్న "పదమూల్య" కవి పలుకు ఈసందర్భమున స్మరణీయము.

"త్రి"

# సవరణ

మార్చినెల భారతిలో - శ్రీమాన్ పండితమణి వేదము వేంకటరాయ శాస్త్రిగారు "విశ్వబ్రాహ్మణకవు"లన్న పేరున వ్రాసిన వ్యాసంలో అనేక దొసగులు పొసగినవి - వారిలో కొందరు విశ్వబ్రాహ్మణులే కారు. పైగా కొన్ని విషయములు శ్రీ శాస్త్రిగారి పరిశీలన లోపమని తెలియుచున్నది. ఆ పొరపాట్లు సవరణలిట్లుండ వలయును.

(1) "ఈరుద్రకవి...... నెల్లూరు జిల్లా కందుకూరు వాస్తవ్యుడు" అని. ఇతడు కందుకూరు వాస్తవ్యుడు కాడు సమీపమందలి చింతలపాళెం వాస్తవ్యుడు. ఇటనున్న స్కందసోమేశ్వర - శ్రీ జనార్దనుల భక్తుడు. పై కందుకూరు 1970 నుండి ప్రకాశంజిల్లాలో ఒక తాలూకా. కవి నాడు నెల్లూరుజిల్లా అయ్యెను- ఈ వ్యాసం వ్రాయు నాటికి ప్రకాశంజిల్లాయే కదా!

(2) బాణాలకోట కందుకూరు ప్రాంతమున గలదు. పే. 60॥ నేను పనిగట్టుకొని 10 సంవత్సరములుగా అనేక శాసనములు - వివిధ చరిత్ర గ్రంథములు పరిశీలించుచు "కందుకూరుసీమ" యన్న పేరుతో ప్రతిగ్రామ చరిత్ర యుండునట్లుగ వ్రాయుచున్నారు. ఈ గ్రామము నా కంటు కింత వరకు కనుపడలేదు. తాలూకాఫీసువారి లిస్టులోను లేదు.? ఇదెక్కడనున్నదో?

(3) ఈతని 'సుగ్రీవవిజయయక్షగానము' ఆంధ్ర వాఙ్మయములలోనే కాదు భారతీయ వాఙ్మయములలో కెల్ల మొట్టమొదటి యక్షగానము. ఇది వట్టి పొరపాటు. ప్రోలుగంటి చెన్నయశౌరి రచించిన "సౌబరి చరిత్రము" మొదటి యక్షగానమని వెల్లంకి తాతంభట్టు కవి చింతామణిలో నుదహరించియున్నారు. "లక్ష్మీకల్యాణము రేకు" రెండవదనియు, చక్రపురి రాఘవాచార్యుల "విప్రనారాయణ చరిత్ర" మూడవదనియు, నాల్గవది సుగ్రీవవిజయమని - ఆచార్య యస్వీ జోగారావు గారు తమ యక్షగాన చరిత్రమందు వివరించియున్నారు. పరిశీలింతురుగాక!

(4) ఆధునికులలో కొందరు కందుకూరి మల్లిఖార్జునాచారి.......వీరి మేనలుడు కాబోలు కీ. శే. జలదంకి కృష్ణస్వామిగారు క్రొక్కారు... వ్రాశారు, ఇది అసంగతము. శ్రీ కృష్ణస్వామిగారు ఆంధ్ర శ్రీవైష్ణవ సంతతికి చెందినవారు. - వీరు రెపిన్యూలో చాలాకాలము

పనిచేసినారు. శ్రీరామాయణమున రామనాటకముల పేరు వెలయించారు. నేను 1950 ప్రాంతము ఒంగోలులో వారి స్వగృహమున సందరిసించి వందనము సల్పినాడను. - వీరు శ్రీ విక్రాల శేషాచార్యులవారికి సమీప బంధువులు కూడా!

(5) ఇంకను వీరి వ్యాసంలో ప్రఖ్యాతులైన నవ భారతము - పార్వతీ పరిణయము - శ్రీశైల ఖండము - లక్ష్మీకటాక్షము - నందికొండచిలుక - మున్నగు బహుళ కావ్యకర్తలు చేరలేదు. శిల్పశాస్త్రమందేగాక - సంస్కృతాంధ్రసాహిత్యమందు - అనేక గ్రంథములు వ్రాసిన శ్రీ కొండూరి వీరరాఘవాచార్యులను, వినాయక శతి వంటివే గాక అనేక ఖండకావ్యములు - విమర్శలు వెలయించిన రాచగుండ్ల చెంచలరావును, గోపికాస్వాంతము - జక్కనవంటి కావ్యములను వ్రాసిన కన్నెకంటి ప్రభాకరశాస్త్రిగారిని .. ఎఱ్ఱోజు మాధవాచార్యులను - ఇట్లా ఎందరినో విస్మరించినారు. ఇంకను నిరంకుశోపాఖ్యానమున విపులమైన వ్యాఖ్య వ్రాసిన - శ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్య కవిగారిని గుర్తించలేదు.

11 4-82న ఒంగోలులో శ్రీనాథ జయంతి సందర్భమున - స్థానిక న్యాయవాదియొకరు పరిసరములు పరిశీలింపక - ఎక్కడో కూర్చుని పరిశీలనచేయుటను 'పడకకుర్చీ పరిశోధన' యందురని చమత్కరించారు. ఇది సర్వదా సత్యము.

పై గారుద్రకవి అష్టదిగ్గజములలో నొక్కడన్న విషయమును సందిగ్ధమే. శ్రీ కొండూరివారు, ''బాల్య చాపల్యము పెంపుర స్వామికి విన్నవించితి'' (నిరంకుశోపాఖ్యాన భూమిక-పేజి 57) అన్న వాక్యము ననుసరించి వారేరా . యల నాటికి - బాల కవియై యుండవచ్చునని యూహించిరి. కాన శాస్త్రిద్వయము యొక్క యూహ పరిశీలింపవలసి యున్నది.

నా కోరిక - నాటిచరిత్రకు నేటి చరిత్రకు పరిశీలనలో ననేకమార్పులు - సాక్ష్యములు లభించుచున్నవి కాన మార్పును గమనించి నేను పట్టిన కుందేటికి మూడే కాళ్ళను విమర్శకులు బల్లలు పగులగొట్టక, సత్యాన్వేషణ తత్పరులు కావలయును. పైగా డిగ్రీలు లేక పాండిత్యము వన్నెకురాని ఈ కాలంలో పొరపాట్లను సవరించి చూపుచున్న పెద్దల - పిన్నలను - సహృదయతతో చూచి తమ తమ సిద్ధాంతములను మార్పుచేసికొనవలయునని - పరిశోధన పరమేశ్వరులను - విమర్శక విద్యా స్వతంత్రులను - మరల నొకపర్యాయము వాఙ్మయమువైపు దృష్టి సారించుమని కోరుచున్నాను.

**విద్వాన్ కొమాండూరి రామానుజాచార్యులు**

కందుకూరు

## లేఖలు

# నూతిలోని కప్ప చందమే!

1982 ఏప్రిల్ భారతిలో జాతశ్రీగారి 'ప్రభంజనం' మీద పోలదుగు వెంకటేశ్వరరావుగారి సమీక్ష నాసిరకంగా వుంది భారతి వంటి సాహిత్య పత్రికలో అటువంటి సమీక్షవచ్చినందుకు బాధగానూవుంది. ఆ సమీక్షలోని చాలావాక్యాలు పోలదుగు వారికే వర్తిస్తాయి. అటువంటి వాక్యాలలో ప్రధానమైనది — "ఇష్టమయితే భుజాలమీదికి ఎక్కించుకొని పిచ్చిగంతులు వేయటం, అయిష్టమయితే నడుంవిరిగేలాగా క్రిందికి త్రోసిపారేసి నీచమయినదూషణలకి పాల్పడటం వీరి అలవాటు."

పోలదుగువారి సమీక్షని పరిశీలిస్తే అరసం మీద వారికి ఎంత విద్వేషం వుందో తేటతెల్లమవుతుంది. పోలదుగువారికి ఎంత అసహనం వుందో, ఎంత కుత్రకారుతనం వుందో అవగతమవుతుంది. పుస్తకంలోని అవకతవకలగురించి చెప్పవలసింది పోయి ఉపోద్ఘాతంతో అమూల్యమైన కాగితాల్ని దుబారా చేసారు. నిజానికి పుస్తకంలోని లోపాల్ని, అశ్లీలాన్ని చక్కగా ఉదాహరించారు. అనవసర ప్రేలాపన లేకుండా వుంటే సమీక్షకి వన్నె వచ్చేది.

115 పేజీలు వున్న పుస్తకం ధర అయిదురూపాయలు పెడితే అదే ఎక్కువంటున్నారు పోలదుగువారు. లైబ్రరీలకి కమీషను, పుస్తకాలషాపువాళ్ళకి కమీషను పోనూ రచయితకి ఎంత చేతికి వస్తుందో తెలుసుకోవాలి. క్రింది వాక్యాలతో ఏకీభవిస్తూ ఈ విమర్శను ముగిస్తాను—— "సంపాదకులూ, రచయితలూ, విమర్శకులూ ఆత్మపరిశీలన చేసుకొని నిజాయితీతో ఆలోచించవలసిన సమయం

అసన్నమైంది. ఆత్మావలోకనం కరువయినప్పుడు ఏదయినా నూతిలోని కప్పచందమే అవుతుంది. డంబాలే మిగులుతాయి."

శ్రీ ద్వా. నా. శాస్త్రి
అమలాపురం.

## కొత్తదికాదు

శ్రీ టి. ఎల్. కాంతారావుగారు రాసిన వ్యాసం "అభ్యుదయ ఉద్యమం - వచన కవిత" (భారతి సంపుటము : 59, సంచిక : 4, ఏప్రిల్ 1982) చదివి ఆనందించాను. అభ్యుదయోద్యమకారులు మరిచేపోతున్న విషయాలు కొన్నివున్నవి.

1. అభ్యుదయ కవులు మన ప్రాచీనకవుల కవిత్వాన్ని క్షుణ్ణంగా చదివి నరనరాన జీర్ణించు కోవటం వల్లనే, వారి కవిత్వం ఆనందాన్ని, స్ఫూర్తిని చదువరులకు అందిస్తున్నది. పెద్దనాది కవుల కవిత్వపు వాసనలేక కొత్తదారి తొక్కితే అరటిపండు తొక్కమీద కాలువేసినట్లే.

2. వచన కవిత్వం కొత్తదికాదు. పూర్వం వచన కవిత్వంద్వారా గ్రంథవాసనలేని ప్రజానీకానికి తత్వబోధ చేశారు.

ఎంత బతికినా కూటికే
ఎన్నాళ్ళు బతికినా కాటికే

యింకా యెన్నోవున్నాయి, ఎంతోవుంది. ఆ తత్వపుమత్తు నుండి రక్షించటానికే శ్రీ శ్రీ వంటివారు వచనకవిత్వాన్ని పీడితప్రజలను మేల్కొల్పటానికి వేదవచనంగా, పీడించే వాళ్ళపట్ల సింహగర్జనగా మలిచారు.

3. చిన్నయ సూరిమీద, గణఛందోబద్ధులైన కవుల మీద కత్తిగట్టటం కర్తవ్యవిముఖత్వం, మూర్ఖత్వమే అవుతుంది.

శ్రీ చతుర్వేదుల ఉదయశంకర్
సికిందరాబాద్

# గ్రంథ విమర్శలు

## కెరటం

[బులెటిన్. ఎడిటర్ : ఎ. రాంబాబు. వెల : రు. 0_50 పై. వివరములకు : సాహితీ మిత్రులు, కేరాఫ్ : ఎ. రాంబాబు, విజయనగరం - 531202]

ఈ కరపత్రంలో సృజన 99వ సంచిక నుండి శ్రీ శ్రీ తో ఇంటర్వ్యూ, బి. వెంకట్రావ్‌గారి మినీకథ, ఎ. ఎమ్. వెంకట్రావ్ గారి వ్యాసం, కృష్ణన్, దిక్సూచి, జి. అప్పారావుగార్ల కవితలు మొదలైన రచనలున్నాయి. "జనం నుండి జనం కొరకు సాగే సాహితీ సాంస్కృతికోద్యమంలో తన వంతు కర్తవ్యాన్ని నెర వేర్చేందుకు మా సాహితీ మిత్రులు సంస్థ వెలువడింది" అని సంపాదకులు చెప్పారు. ఈ సంస్థ మంచి సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాలు చేబడతారని ఆశించవచ్చు.

## దివ్యదృష్టి

[రాధేయ. వెల : రు. 8_00 లు. ప్రతులకు : రాధేయ, ప్రెసిడెంటు, సాంస్కృతీ సమాఖ్య, కడపజిల్లా శాఖ, ప్రొద్దుటూరు-516 360.]

సాంస్కృతీ సమాఖ్య కడపజిల్లా విభాగంవారు ప్రచురించిన శ్రీ రాధేయగారి కవితా సంకలన మిది. ఈ సంకలనానికి అద్దేపల్లి రామమోహనరావుగారు దృష్టిపథం అనే పేరుతో విశాలమైన పీఠికను రాశారు. పీఠికలో ఈనాటి కవిత్వ ప్రయోజనం, రాధేయగారి కవిత్వ మహత్వాలను గురించి చర్చ చేశారు.

ఈ కవితా సంకలనం రాధేయగారి కవిత్వ భవితవ్యానికి నిదర్శనం. సమాజంలో నిత్యం జరుగుతున్న అనేకానేక అన్యాయాల పట్ల ఆయనకు గల వేదన ఈ కావ్యమంతా విస్తరిం చింది. కవిత్వం చెప్పడంలో మంచినేర్పు, కూర్పు ఈ కవికి ఉంది. 'అన్నీ ఉన్న నా దేశంలో ఏమీ లేని వాళ్ళే కనిపిస్తారు' అంటూ ఒక పాదంలో దేశ సౌభాగ్యాన్ని, వెంటనే దాని క్రింది పాదంలో దేశ జనాభా దౌర్భాగ్యాన్ని చమత్కారంగా ధ్వనింప జెయ్యడంలోనే కవికి గల శక్తి అర్థం అవుతోంది.

"మొన్న మొన్నటిదాకా
పేదన్న కామందులూ
బలమున్న రాబందులూ
ఆ గుడిసెను పావనం చేస్తూ
ఆ యవ్వనాన్ని ఆహారంగా
ఆ కన్నీళ్ళను పానీయంగా సేవించేవారు"

పై నాలుగు పాదాలలో సమాజంతోపాటు సమాజంలోని దిక్కూ మొక్కూ లేని అసహాయ స్త్రీల యవ్వనాన్ని కూడా దోపిడీ చేసే వర్గ స్వభావం వెల్లడవుతోంది. క్రింది రెండు పాదా ల్లోని కవితాశక్తి యువతరం కవుల్లో చాలా తక్కువమందికి ఉంది.

ఒకడి కష్టం మరొకడికి సుఖం, ఒకడి చీకటి మరొకడికి వెలుతురు. ఇది దోపిడీ సమాజ లక్షణం. ఈ లక్షణాన్ని మినీ కవితలో చక్కగా చెప్పారు.

"చీకటి పేదోళ్ళకు
వెల్తురు పెద్దోళ్ళకు
జీతం పాలేరుకు
జీవితం కామందుకా ?"

ఈ వ్యవస్థతో రాజీ లేని పోరాటం సాగించమని అనానికి చెబుతూ తానీ వ్యవస్థకు శత్రువునని నిశ్చింతగా ప్రకటిస్తు న్నారు రాధేయగారు.

"మత భేదాలకీ, కుల భేదాలకీ
అంకితమైన నా దేశంలో
ఉన్నవారూ, లేనివారూ అంటూ
రెండే రెండు తెగలు
వీరు ఎప్పుడూ - ఎక్కడా
కలుసుకోలేని సమాంతర రేఖలుగా
నిర్ణయించిన ఈ వ్యవస్థకు
నేనెప్పుడూ బద్ధ శత్రువునే"

సమాజంతో సాగించవలసిన పోరాటం పట్ల మరింత స్పష్ట మైన అవగాహనతో ముందు ముందు కవిత్వం రాస్తారని ఆశిస్తాను.

## శ్రీశ్రీ కవిత్వం - వస్తువు - సంవిధానం

[డా॥ మిరియాల రామకృష్ణ. వెల :- రు. 60_00 లు. ప్రతులకు : శ్రీమతి ఎమ్. లక్ష్మీదేవి, 10-4-23, కాకినాడ-4]

ప్రభవ, స్వర్గదేవతలు, మహాప్రస్థానం కావ్యాలను పరిశోధించి ఆంధ్ర విశ్వవిద్యాలయం వారిచే పిహెచ్. డి. పట్టం పొందిన మిరియాల రామకృష్ణగారి సిద్ధాంత గ్రంథమిది. ప్రతికావ్యఖండికను ప్రత్యేకంగా అనుశీలించడం ఈ సిద్ధాంత గ్రంథంలోని ప్రత్యేకత.

ఏ పరిశోధకుడైనా ఒక మహాకవి కవిత్వాన్ని మనోనేత్రంతోనూ, మామూలు నేత్రంతోనూ దర్శనం చేసుకొనేటప్పుడు ముందుగా బుద్ధిస్థం చేసికొనవలసింది, ఆ కవి యొక్క కవితా చైతన్యంలోని వివిధ పరిణామ దశలు. వీటిని సక్రమంగా బోధపరచుకుంటే తప్ప కవిత్వ తత్త్వం బోధపడదు.

ప్రసిద్ధుడైన ప్రతి కవికీ ఒక జీవన దృక్పథం ఉంటుంది. ఆ జీవన దృక్పథం అతని కవితా ప్రస్థానంలో అవిచ్ఛిన్నస్రవంతిలా ప్రవహిస్తూ ఉంటుంది. ఆ దృక్పథంతో సంపూర్ణంగా ఏకీభవించే విమర్శకుడైతేనేగాని ఆ కవికి సంపూర్ణన్యాయం విమర్శలో చెయ్యలేడు. మిరియాల రామకృష్ణగారు,కవిత్వం-వస్తువు-సంవిధానం అని వారి సిద్ధాంతగ్రంథానికి పేరు పెట్టారు. కవిత్వం-వస్తువు-సంవిధానం ఈ మూడూ అవిభాజ్యాలు. ఒక దానినుండి మరొక దానిని విడదీయటం కష్టసాధ్యం. వస్తువు అంటే కవి దృక్పథం, సంవిధానం అంటే కావ్య శిల్పం. వస్తువు ఎప్పుడూ రూపాన్ని అన్వేషిస్తుందని ప్రపంచ మార్క్సిస్టు సాహిత్య మేధావులందరూ ఏకగ్రీవంగా ఆమోదించిన సత్యం.

ఆధునిక తెలుగు కవితా యుగానికి స్వాగత గీతం పలికిన తొలి వైతాళికుడు గురజాడ అయితే - దానిని ఒక మహాయుగంగా విస్తరింపజేసి ఏతన్మహాయుగానికి యుగలక్షణాలను నిర్దిష్టం చేసిన పథనిర్దేశకుడు శ్రీశ్రీ. తనప్రక్రియ సంప్రదాయంగా, తనదృక్పథం ప్రాపంచిక దృక్పథంగా, తన చైతన్యం జన చైతన్యంగా వ్యాపింపచేసిన మహాకవి శ్రీశ్రీ అతని కవిత్వాన్ని 'ఎనలైజుచేసి, ముక్కలు క్రింద విభజించి', ఇదీ కవిత్వం అని చెప్పడానికి ఉత్త ఆలోచనే చాలదు, హృదయం ఉండాలి.

ప్రభవ, స్వర్గదేవతలలోని కావ్యఖండికలను విశ్లేషించడానికి 183 పేజీలు కేటాయించారు. ఈ 183 పేజీల్లోనూ వారు పరిశోధనాపరంగా సాధించినది చాలా అల్పం. సంప్రదాయ మార్గంలో శ్రీశ్రీ రాసిన కవిత్వమంతా విశ్వనాథకు, కృష్ణశాస్త్రికి అనుకరణే తప్ప మరేం కాదని శ్రీశ్రీయే చెప్పాడు. అదీగాక రామకృష్ణగారు ఖండికా విశ్లేషణలో ప్రతిపదార్థతుల్యమైన తాత్పర్యాలు తప్ప సాధించిందేమీలేదు. కాగా కావ్య విమర్శ, పరిశోధనా ఈ రెండూ వేరని మన విమర్శకులు, పరిశోధకులు తెలుసుకోలేకపోతున్నారా? తెలుసుకుని అలక్ష్యం చేస్తున్నారా? అన్నది ప్రశ్న. ప్రభవ, స్వర్గదేవతలు మేరకు శ్రీశ్రీ నవ్యకవి. ఆధునికుడుకాడు. నవ్యతకు, ఆధునికతకు, సమకాలీనతకు గల మౌలిక భేదాన్ని మనం గుర్తించాలిగదా; తన సొంత గొంతును వినిపించేందుకు అవసరమైన సాధన సంపత్తిని శ్రీశ్రీ సంప్రదాయంనుండి సముపార్జించుకోగలిగాడు. ఈ కావ్యఖండికలలో రామకృష్ణగారు చేసిన పరిశోధనలో చాలాభాగం అర్థరహితమైనది. ఉదాహరణకు 'అగ్నిహోత్రము' ఖండికతీసుకుంటే-

'సాంధ్యకాలారుణ గభస్తి సముదయమున
ప్రస్ఫురించెడు విజయపురైభవమ్ము
ఉదిత మానసికోత్సాహ ముజ్జ్వలింప
అమరు లనిమేష నయనులై అరయునప్పుడు'

అన్నచోట 'అనిమేష నయనులు' అనే పదాన్ని సార్థకంగా వాడాడని చెబుతున్నారు. అమరులే అనిమేషులుగదా; ఇంకా ఆ పదానికి సార్థకత ఏమిటి? దాంట్లోనే-

'జగతి పాపాంధకార విచ్ఛిన్న మగుచు
పుణ్యమనుమాట పూజ్యమై పోవునపుడు
దారుణ దురంత కలుషవర్తన మచేత
మానవ చరిత్రమున కస్తమయము కలుగ'

అన్నచోట అస్తమయము అనేపదాన్ని వాడటంలో భావుకత్వం చూపించాడని అంటున్నారు. ఇక్కడ భావుకత ఏమిటో వారికే తెలియాలి. ఇట్లాగే రామకృష్ణగారి విమర్శనాత్మక వ్యాఖ్యకు మరో ఉదాహరణ.

'ఉరుమహీధరసాను నిర్ఝరనికాయ
నిర్మలాంబు ప్రవాహ నిర్ణిద్రవృత్తి'

'అనే పదబంధంలో 'మహీధరలోని ఓంకారదీర్ఘత కొండ ఎత్తునీ, నిర్ఝరనికాయ నిర్మలాంబు శబ్దాలు సెలయేటి గలగలలనీ వ్యక్తంచేసి ఆ అనుభూతిని కలిగిస్తున్నాయి' అని చెబుతున్నారు. 183 పేజీల పరిశోధన శ్రీశ్రీ సంప్రదాయక కవిత్వంపై ఇట్లాగే సాగింది.

'మహాప్రస్థానం' ఆధునిక కవిత్వ మహాయుగానికి సింహద్వారం కదా; దానిలోని ప్రతి ఖండికను రామకృష్ణగారు వారి పరిధిలో వ్యాఖ్యానించారు. ఈ వ్యాఖ్యానంకూడా సరైన పద్ధతిలో, అవగాహనతో సాగలేదు. ఒక కావ్యఖండికను విశ్లేషించేటప్పుడు ఇతర కావ్యఖండికల ప్రస్తావన, వాటిపదబంధాలు, ఛందో నిర్మాణం మొదలైన అంశాల వివరణ అనివార్యమయింది. దానివల్ల పునరుక్తులు, స్వీయాభిప్రాయ వైరుధ్యాలు తప్పనిసరి అయినాయి.

మహాప్రస్థాన కావ్యాన్ని మొత్తంగా వస్తువు, శిల్పం, ఛందస్సు, అలంకారాలు మొదలైన ప్రత్యేక అంశాలుగా విడగొట్టుకొని పరిశోధించి ఉండే. ఫలితం బాగుండేదేమో! రామకృష్ణగారికి ఫ్యూడల్, బూర్జువా, పీడితుడు, పీడకుడు, సామ్యవాదం మొదలైన ప్రాథమిక శబ్దాలు తప్ప మార్క్సిస్టు దర్శనం బోధపడలేదేమో అనే సందేహం ప్రతి పాఠకునికి కలిగే అవకాశం రామకృష్ణగారు కలిగించారు. శ్రీశ్రీ అనంగానే ప్రతి ఖండికను మార్క్సిస్టు పరిభాషలోనే విశ్లేషించాలనే దురూహ ఒకటి రామకృష్ణగారికి ఉన్నట్లు అర్థం అవుతోంది. 'ఆః' ఖండికను ఆయన విశ్లేషించిన పద్ధతి అట్లాగే ఉంది.

"నిప్పులు చిమ్ముకుంటూ
నింగికి నే నెగిరిపోతే
నిబిడాశ్చర్యంతో వీరు
నెత్తురు కక్కుకుంటూ
నేలకు నే రాలిపోతే
నిర్దాక్షిణ్యంగా వీరే...."

ఇక్కడ శ్రీ శ్రీ సమాజంలో ఉన్న ఒక మానసిక స్థితిని చెప్పాడు. నిప్పులు చిమ్ముకుంటూ ఎగిరి పోయేవాడు కార్మికుడే కానక్కరలేదు. 'భిక్షువర్షీయసి' ముగింపు ఇట్లా ఉంది.

"ఎముక ముక్క కొరుక్కుంటూ
ఏమీ అనలేదు కుక్క
ఒక ఈగను పడవేసుకు
తొందరగా తొలిగె తొండ
క్రమ్మె చిమ్మచీకట్లు
దుమ్ము రేగె నంతలోన
ఇది నా పాపం కాదనె
ఎగిరివచ్చి ఎంగిలాకు"

దీనికి రామకృష్ణగారి వ్యాఖ్య ఇది. "వెర్రి గాలి వేసిన ప్రశ్నకు సమాధానం ఇవ్వడానికి కుక్కకుకానీ, తొండకుకానీ ఖాళీ లేకపోవడాన్ని శ్రీశ్రీ సూచించాడు. ఆ ఖాళీ ఎంగిలాకుకు మాత్రమే ఉంది. ఎముకముక్క కొరుక్కునే కుక్క మాంసాహార మత్తుడైన ఒక బలవంతుడిని ప్రతిబింబిస్తుంది. బలవంతులు బలహీనులను ఏ విధంగా కొరుక్కు తింటారో ఈ పదచిత్రం సూచిస్తుంది. ఒక ఈగను పడవేసుకు తొందరగా తొలగిపోయే తొండ అన్నం తినడంకన్నా అత్యవసరపు వ్యాపారాలున్న సంపన్నుణ్ణి ప్రతిబింబిస్తుంది. ఎగిరి వచ్చిన ఎంగిలాకుకు అటువంటి తొందర లేవీలేవు. చిమ్మచీకటి క్రమ్ముటం, దుమ్ము రేగటం నాటకీయమైన సంకేతాలుగా ముసల్దాని చావును సూచించాయి." ఎముక ముక్క కొరుక్కుంటూ ఏమీ అనని కుక్క తన అన్నంతో తాను తృప్తిపడి ప్రక్కవాణ్ణి గురించి పట్టించుకోని ఏకాకిని, ఈగను పడవేసుకు తొందరగా తొలిగే తొండ బలహీనుణ్ణి దోపిడి చేసే బలవంతుణ్ణి ధ్వనిస్తున్నాయి. ఎగిరివచ్చిన ఎంగిలాకు ఎవడో తిని పారేసింది. రామకృష్ణగారి వ్యాఖ్య విపరీత వ్యాఖ్య. అట్లాగే మహాప్రస్థానం అనే గేయంలో-

"ఎగిరి ఎగిరి ఎగిరి పడుతున్నవి
ఎనభై లక్షల మేరువులు
తిరిగి తిరిగి తిరిగి సముద్రాల్
జలప్రళయ నాట్యం చేస్తున్నవి"

అనే పాదాలకు భయంకరమైన వ్యాఖ్య చేశారు. ఎనభై లక్షల మేరువులు అసంఖ్యాక ధనస్వాములకు, జలప్రళయ నాట్యం చేసే సముద్రాల్ ఘర్మ సముద్రాలైన శ్రామికులకు ప్రతీకలని అంటున్నారు. అంతటితో ఆగక "మేరువులు ఎగిరి పడుతున్నాయని చెబుతూ ముమ్మారు ఎగిరి పడినట్లు చెప్పడంలో ఎగిరి అనే క్రియలోని గిరి శబ్దం మేరువుల గిరిత్వాన్ని సూచిస్తుంటే వెంటనే సముద్రాలు తిరిగినట్లు చెబుతూ ఆ అభినయానికి అనుగుణంగా తిరిగి తిరిగి తిరిగి అని శబ్దావృత్తి చెయ్యడంలో శ్రీ శ్రీ చిత్ర కవితా ధోరణి చూపించాడు. ఎగిరిలోని గిరి తిరగబడి 'తిరిగి'లో చేరి మేరువులను అపహసిస్తోంది" అని కూడా అంటున్నారు. మహాప్రస్థాన గేయంలోని ఈ ప్రతీకలు తాను చెప్పదల్చుకున్న విప్లవ భావానికి దోహదం చేసేవేకాని రామకృష్ణగారు అనుకున్నట్లుగా కాదు. ఇట్లాగే అవతారం మొదలైన ఖండికలకు కూడా దోష భూయిష్టమైన వ్యాఖ్యానం చెయ్యడం జరిగింది.

"గ్రుడ్డిగా ఎడ్మైర్ చేసే వాళ్ళను కావ్యస్రష్ట ఎంత ఈసడించుకుంటాడో మూడవ కంటితో చూసే క్రియేటివ్ క్రిటిక్ కోసం అంత తహతహలాడతాడు" అని శ్రీ శ్రీ మాటలను ఉటంకించారు. కువ్యాఖ్యానం కంటె గ్రుడ్డిగా ఎడ్మైర్ చెయ్యడం చాలా గొప్పవిషయం. పోగా శ్రీ శ్రీ కవిత్వాన్ని ఈనాడు చాలామంది వ్యక్తివాదుల దగ్గరనుంచి, అరాచకవాదులదాకా బాహాటంగా ఎడ్మైర్ చెయ్యడం ఆధునిక కవితా యుగంలో తమ అస్తిత్వానికి గుర్తింపు కోసమే కాని అన్యం కాదు.

"శ్రీ శ్రీ మహాప్రస్థానం గీతాలు దేనికదే ఒక మహా కావ్యమంత లోతూ, ఎత్తూ గల శిల్పఖండం. పరిమాణంలో అది చిన్నదేగాని గుణంలో గొప్పది. అందుకే వాటిని విడి విడిగా పరిశీలించి నూతనత్వాన్ని వివరిస్తాను. శ్రీ శ్రీ కవితా రహస్యాలను

బయల్పెడతాను : ఇంద్రజాలానికి తెరదీస్తాను'' అన్న రామకృష్ణ గారు శ్రీ శ్రీ కవిత్వాన్ని మరింత ఇంద్రజాలం చేశారు. అహంకారం ప్రతి రచయితకు ఉంటుంది. దురహంకారం క్షేమం కాదు.

ఈ సిద్ధాంత గ్రంథాన్ని రాయడానికి వారెంత శ్రమపడ్డారో గ్రంథ బాహుళ్యతే తెలియజేస్తున్నది. కవి ఆత్మీయతను అన్వేషించడంలోనే విమర్శకుడి ప్రతిభ ఉంటుంది. గ్రంథం గెటప్ చాలా బాగుంది. అచ్చు తప్పులు అట్టే లేకపోవడం, ఖరీదైన కాగితాన్ని వాడటం, సబ్ హెడింగ్సు పెట్టడం ఇత్యాదులైన బాహ్య విషయాల్లో రామకృష్ణగారు ప్రత్యేకమైన శ్రద్ధ తీసుకొన్నారు. అచ్చు చూడముచ్చటగా ఉంది.

## క్రీస్తు శతకము

[దినకర్. వెల : రు. 1-00 ప్రతులకు : శ్రీమతి డి. రాహేలమ్మ, 21-96ఎ, మున్సిపల్ కాలనీ, నంద్యాల - 518 501.]

ఇది క్రీస్తు పై రాసిన 130 పద్యాల శతకము. ప్రపంచం అంతా పాపంతో నిండిపోయిందనీ, భక్తి శూన్యమయిందనీ, భుక్తి కరువైందనీ, మానవ సమాజమంతా మతకలహాల మయమయిందనీ కనుక ఈ లోపాలను సరిచేసి మానవుణ్ణి మానవుడుగా బతికే ఏర్పాటు చెయ్యమని క్రీస్తును ప్రార్థిస్తూ దినకర్‌గారు ఈ శతకాన్ని రాశారు.

## శ్రీ వేంకటేశ్వర సుప్రభాతము

[ఆంధ్ర పద్య తాత్పర్య సహితము. ఆంధ్రీకర్త : మెండా చిన సీతారామయ్య. వెల: రు. 2-00 లు. ప్రతులకు: మెండా వేంకట సత్య దుర్గా ప్రసాదరావు, పండితరాజ వీధి, తణుకు, ప. గో. జి.]

ఇది భక్తి కావ్యం. ప్రజల్లో భక్తిని ప్రచారం చెయ్యడానికి, వారికి సులువుగా అర్థంగావటానికి వేంకటేశ్వర సుప్రభాతాన్ని చిన సీతారామయ్యగారు ఆంధ్రీకరించారు. వారి అనువాదం ఇట్లా ఉంది.

ఉత్తిష్ఠోత్తిష్ఠ గోవింద ఉత్తిష్ఠ గరుడ ధ్వజ
ఉత్తిష్ఠ కమలాకాన్త త్రైలోక్యం మంగళంకురు

లెమ్ము లేలెమ్ము గోవింద : లెమ్ము వరద :
లెమ్ము ఖగరాజకేతన : లెమ్ము దేవ :
లెమ్ము కమలా మనోహర : లెమ్ము లే వి
హాన తల్ప : త్రైలోక్య కల్యాణ మొసగ.

## పాలవల్లి

[మినీ కవితా సంకలనం. వెల: రు. 2-00 లు. ప్రతులకు: ఎక్సురే పబ్లిషర్సు, కొల్లూరి హౌవుస్, అమలాపురం - 533 202]

సాంస్కృతీ సమాఖ్య ఇటీవల పుస్తక ప్రచురణలో ముందంజ వేస్తోంది. ఇది అమలాపురం తూర్పు గోదావరిజిల్లా శాఖవారు ప్రచురించిన మినీ కవితా సంకలనం. ద్వా. నా. శాస్త్రి గారు, కొల్లూరి దీనికి సంకలన కర్తలు. ద్వా. నా. శాస్త్రిగారి ఆత్మీయం ఆత్మీయంగానే ఉంది. ఇందులోని కవులందరికీ 'సామాజిక స్పృహ' ఉన్నట్లుగా తెలుస్తోంది. మినీ కవితలో ఉండవలసిన చమత్కారం, కొస మెరుపు ఇందులో గౌణమే. మొత్తంమీద కవితా చైతన్యం అమలాపురంలో హెచ్చుగా ఉండటం ఆనందించ తగ్గ విషయం.

## వేసవి

[కవితా సంపుటి. కిరణ్. వెల : రు. 6-00 లు. ప్రతులకు: స్పందన సాహితీ సమాఖ్య (రిజిష్టర్డు), 26/162, బుట్టాయిపేట, మచిలీపట్నం-521001]

వేసవి నేటి వ్యవస్థకు ప్రతీక. ప్రకృతిలో ప్రతి కదలికను నేటి జీవితానికి అన్వయిస్తూ కిరణ్ కవిత చెప్పారు. వర్తమాన జీవితమంతా వేసవిలాగ 'వేడి'గా ఉందనే కవి భావుకత స్వాభావికతకు దగ్గరగా ఉంది.

'టియర్ గాస్ తత్తరలో
చెదిరి బెదరిన జనంలా
కొలిమి పొగల ధూళిలో
వేడి సెగల గాలిలో
తేలుతోన్న ఆకులు.'

ఇలా ఉపమించడంలోనే వెచ్చనైన కవితానుభూతి వెల్లడవుతోంది. ఇతని శైలిలో ప్రత్యేకత స్పష్టంగా గోచరమవుతుంది.

నాచుట్టూ రమణీయ కేదార వేదిక
హరిత లావణ్య మనోజ్ఞ మాలిక
జీవాన్ని చిందుతూ....
గుండెల్ని నింపుతూ....

అంటున్న కవి భావంలో మార్పు వచ్చే సరికి

నా చుట్టూ
వేల హృదయాల
వేల చూపుల

వేల చేతుల చైతన్యం
ఘన జనతా వైప్లవ్యం

అంటారు.

కిరణ్‌గారి ఊహలో, అభివ్యక్తీకరణంలో ఒక వ్యక్తిత్వం కనబడుతుంది. అయితే కావ్య పరమార్థం అవగాహన కొచ్చేకొలదీ ఈ వ్యక్తిత్వం ఇంకా వికసిస్తుందని ఆశించవచ్చు.

# ప్రజా సాహిత్యం కళలు ఎలా ఉండాలి?

[వర్గీస్ వ్యాసాలు. వెల : రు. 2.00 లు. ప్రతులకు : (1) సృజన, హనుమకొండ – 506 001, (2) పీస్ బుక్ సెంటర్, 3-4-74/3, హైదరాబాదు – 500 027]

ఈ వ్యాస సంకలనంలో ప్రజా కళల స్వరూప స్వభావాలను వర్గీస్ చర్చించారు. ప్రజా రచయిత అలవరచుకొనవలసిన ప్రవర్తనను గురించి ఎక్కువగా చర్చించారు. ప్రజా సాహిత్యంలో పాట కున్న స్థానాన్ని గుర్తించి పాట రాసే కవి తీసుకొనవలసిన జాగ్రత్తల్ని గురించి హెచ్చరించారు. నాటక కళను ప్రజలవద్దకు తీసుకుపోయే పద్ధతులను వివరించారు.

సామాజిక విప్లవంలో సాంస్కృతిక సైన్యానికున్న ప్రాధాన్యతను గుర్తించే ప్రతి పాఠకుడు, రచయిత విధిగా చదవవలసిన వ్యాస సంకలన మిది.

# నిప్పు రవ్వలు

[కవితా సంపుటి. నల్లా నరసింహమూర్తి. వెల: రు. 2–50లు ప్రతులకు: నల్లా నరసింహమూర్తి, బి. కాం., జర్నలిస్టు, ఎస్. ఒ. అప్పలరాజు, ఆపోజిట్ ఎస్. కె. బి. ఆర్. కళాశాల, అమలాపురం-533201.

ఈ కవిగారికి ఈనాటి యువతరం మీద, వారు తెచ్చే సామాజిక మార్పుమీద మంచి నమ్మకం ఉంది. సమాజం మారే దాకా కవులు అగ్ని సంగీతం వినిపించక తప్పదని వీరి విశ్వాసం. 'యువతరం సూర్యరశ్మిత నిప్పురవ్వలై చైతన్యంతో మరో ప్రపంచాన్ని సృష్టించాలి. అప్పటిదాకా నాలో నా కళ్ళలో నా కలంలో అంతా నిప్పురవ్వలే' అని ప్రకటించు కొంటున్నారు నరసింహమూర్తిగారు. ఈ నిప్పురవ్వలు దీపావళి పూల పట్టాలలో రవ్వలవలె క్షణం మెరిసి అంతరించేవా లేక సమాజ దుష్టాంగాల్ని దగ్ధంచేసే అగ్నిజ్వాలలా? అన్నది కవి అంతర్ముఖుడై ఆలోచించవలసిన సంగతి. 'పడుపు కత్తెలు కుళ్ళినశరీరాంగాలకు, సుగంధాలు పూస్తూ లేని అందాన్ని అందంగా అలంకరిస్తున్నారు.' ఇది పెట్టుబడి దారీ వ్యవస్థ, వ్యాపార నాగరికతల లక్షణం. దీనిని ధ్వంసం చేసే పరిష్కార మార్గంపై కవులకు స్పష్టమైన అవగాహన ఉండటం మంచిది. నరసింహమూర్తిగారు ఆయన పరిధిలో సమకాలీన సామాజిక వేదనను తన వేదనగా తన కవిత్వంలో పలికించారు. భవిష్యత్తులో ఇంకొంచెం ముందు చూపు చూస్తారని ఆశ.

# మినీ కవితా విప్లవం

[రెండు వందల మంది కవుల మినీ కవితా సంకలనం. వెల : రు. 10–00 లు, ప్రతులకు : ఎక్సురే పబ్లిషర్సు, కొల్లూరి హౌస్, అమలాపురం – 533 201]

అభ్యుదయ యుగంలో మాత్రా ఛందస్సుల తరువాత వచ్చిన విశిష్ట ప్రయోగం వచన కవితా ప్రక్రియ. మాత్రా ఛందస్సులపై వచన కవిత విప్లవంకాదు, ఒక ప్రయోగం మాత్రమే. ఒకనాటి ప్రయోగం ఈనాటి సంప్రదాయంపై ఈనాడు మనం మినీ కవితగా భావిస్తున్నది విప్లవంకాదు. విప్లవం ఎప్పుడూ వస్తుసంబంధి, రూప సంబంధి కాదు. ఈ ప్రాథమిక సత్యాన్ని విస్మరించి, ఇదొక విప్లవమని, దీంట్లోంచి మహాకవిత్వం ఉద్భవిస్తోందని ప్రచారానికి పూనుకొనడం హాస్యాస్పదమైన విషయం. మినీ కవితను నిరసించే వారు, సమర్థించేవారు అని రెండురకాలుగా సాహిత్య పరిశీలకులను విభజించ నక్కరలేదు. కవిత్వమనే పదార్థం ఉన్నప్పుడు మినీ కవిత్వమైనా, మాక్సీ కవిత్వమైనా ఒకటే. వచన కవిత్వంలో వినాదాలు ఎక్కువ అవడం వల్ల నినాద రహితంగా మినీ కవిత పుట్టిందనడంలో సమంజసంలేదు. ఏ కవితా ప్రక్రియలోనైనా తాలు తప్ప ఎప్పుడూ ఉంటుంది. మన పరిశీలనకు తాలూ తప్ప తీసుకోం గద. మినీ కవితలో మాత్రం అన్ని కవితలు కవితాత్మకంగా ఉన్నాయా? ఈ సంకలనంలోనే వలసినంత చెత్త ఉన్నది. అంత మాత్రంలో మినీ కవిత కవిత కాదనడం అన్యాయమే అవుతుంది గదా! మినీ కవితకు క్లుప్తత ప్రాణమే కాని క్లుప్తతే మినీ కవిత కాదు. అట్లా అని ఈ సంకలనంలోని చాలా ఖండికలు బుజువు చేస్తున్నవి. ఈ సంకలనానికి అద్దేపల్లి రామమోహనరావు గారు పదునాలుగు పేజీల పరిచయం రాశారు. ఆయన చెప్పిన ప్రతి అంశం ఖండనార్హమైనదే. ఇది చర్చకాదు సమీక్ష కనుక ఆ అంశాన్ని వదలివేయ వలసివచ్చింది. మంచి మినీ కవితకు ఉదాహరణ ఒకటి ఇస్తున్నాను. అలిశెట్టి ప్రభాకర్ 'వేశ్య' ఖండిక.

"తను శవమై
ఒకరికి వశమై
తనువు పుండై
ఒకరికి పంటై
ఎప్పుడూ ఎడారై
ఎందరికో ఒయాసిస్సై"

ఇట్లాంటి ఖండికలు దీంట్లో కొన్ని ఉన్నాయి. అవన్నీ ఇక్కడ ఉదహరించలేను. అయితే మినీ కవితతో ఆరంభమైన యువత సాహిత్య పరంగా ఇంకా ఉపలబ్ధిని సాధిస్తారని ఇంతటితోనే ఆగిపోరని ఆశిద్దాం!

# కృష్ణశాస్త్రి కవితా వైభవం

[వివిధ రచయితల వ్యాస సంకలనం. వెల : రు. 3-00లు ప్రతులకు : ఎక్స్‌రే పబ్లిషర్స్, కొల్లూరి హవుస్, అమలాపురం-533 202]

కృష్ణశాస్త్రిగారి ప్రథమ వర్ధంతి సందర్భంగా సాంస్కృతీ సమాఖ్య, యువసాహితీ వికాసవేదిక, ఆంధ్రప్రదేశ్, అమలాపురం, తూర్పుగోదావరిజిల్లా శాఖ వారు ప్రచురించిన వ్యాస సంకలనమిది. ఈ వ్యాసాలతోపాటు కృష్ణశాస్త్రిగారిపై కొంత మంది కవులు వెలయించిన కవితలు కూడ ఇందులో ఉన్నాయి. డా॥ బాలాంత్రపు శ్యామలరావు, సర్వశ్రీ కొల్లూరి, ద్వానాశాస్త్రి, బులుసు వెంకట కామేశ్వరరావు, పి. డి. ఎ. రామచంద్రుడు, కృష్ణస్వామి, శ్రీమతి కె. పుష్పలత, డా॥ కస్తూరి గారల వ్యాసాలు - రేకపల్లి శ్రీనివాస మూర్తి, మంతెన సూర్యనారాయణరాజు, నందుల వెంకటేశ్వర రావు, డా॥ వాసా ప్రభావతిగార్ల కవితలు కృష్ణశాస్త్రిగారి కవితా తత్త్వాన్ని గూర్చి రాసినవి. ఈ వ్యాసాలలో లోతైన పరిశీలనగాని, గాఢమైన చింతనగాని లేవు. ఎసోసియేషన్ లాంటిది. ఫలిత మెట్లున్నా కృషి మెచ్చదగినది.

# గీతా యుధం

[కె. అంజయ్య. వెల: రూ. 4-00 లు. ప్రతులకు : చైతన్య సాహితి, ఇంటి నెం. 62-85, పారేపల్లి వీధి, సిద్ధిపేట-502103]

వచన కవిత్వంతో పరిచయమున్న ప్రతి పాఠకునికి అంజయ్యగారి పేరు తెలిసే ఉంటుంది. ఆయన రాసిన కావ్యానికి గీతాయుధం అని పేరు పెట్టుకొన్నారు. తెల్ల కాగితపు జీవితానికి ఎర్రసిరాతో బంధం వేసి వాస్తవాన్ని కళ్ళకద్దుతానంటూ తన కవిత్వ పరమోద్దేశాన్ని చెబుతున్నారు. అంజయ్యగారికి ఈ అసమాజ వ్యవస్థమీద అసహనం, అసహ్యం ఎక్కువ పాళ్ళలోనే ఉంది.

"ఆకలి నీడల్లో ఆపకుంటూ
శ్రామిక జీవితాన్ని
కన్నీటనాన్ని నంజుకుంటూ
దేశం సస్యశ్యామల మనడం
తాననుభవిస్తున్న నాలుగ్గోడలమధ్య
కేళీ విలాసాలే
దేశ ప్రగతికి గీటు రాళ్లుగా చిత్రించడం
నియంతల అనవాయితీగా
సృష్టిస్తున్న గొర్రె తోక చరిత్ర అయితే"

ఈ పాదాల్లో వర్తమాన రాజకీయ వ్యవస్థ ధ్వనించబడు తోంది. ఈ వ్యవస్థ నశించిపోయి సర్వమానవ సమతా వ్యవస్థ ఆవిర్భావానికి పీడిత జీవులు సమిష్టిగా పోరాడాలని, ఆ పోరాటానికి గీతంకూడా ఆయుధంగా ఉపయోగపడుతుందని అంజయ్యగారి అభిప్రాయం. ఇది ఈనాటి తరం కవులందరిలో ఉన్న అభిప్రాయమే.

"ఎత్తిన చేతులే ఎరుపెక్కిన గండ్ర గొడ్డళ్లై
ముద్దరేసిన చేతులే ముడిచిన నిప్పు పిడికిళ్లై
చేతులు ఆయుధాలై, అమరిన పండాలై
నిన్నూ, నీ జాతిని
నామరూపాల్లేకుండా నలిపి పారేస్తుంటే
ఉరకలేస్తున్న జనానికి
ఉప్పెన వచ్చుకొచ్చినట్లు"

అని రాబోయే సామాజిక విప్లవాన్ని ఈనాడు స్వాగతిస్తున్నారు అంజయ్యగారు.

# రస్తా

[కె. హనుమంతరెడ్డి. వెల. రు. 2-50 లు ప్రతులకు : "విమోచన", ఇంటి నెం. 2-1-402/బి/1, నల్లకుంట, హైదరాబాదు 500 044.]

హనుమంతరెడ్డిగారు ఈ కవితాసంకలనంలో తమమార్గాన్ని స్పష్టంగా చూపించారు. రాబోయే సామాజిక విప్లవాన్ని స్వాగతించడమే కవితా ధ్యేయంగా వారు ఋజువు చేశారు. పీడితులకు, పీడకులకు మధ్య సంఘర్షణకు సాయుధ పోరాటమే మార్గమని ఈకవి

హృదయదఘ్నంగా విశ్వసించినట్లు ఈ సంకలనంలోని ప్రతి గేయమూ ఋజువు చేస్తోంది.

"భూమిరెడ్డి ప్రతి నెత్తురు చుక్క
ఒక్కొక్క కిరణంగా ధరించి
వుదయించ నున్న విజేత సూర్యునికై
విప్లవ స్వప్నాలు కంటున్నా
స్వప్నాల సాఫల్యం కోసం
అవసరమైతే అర్పించడానికే
నా రక్తమూ సిద్ధంచేస్తున్నా''

అనే నిబద్ధత ఈ కవిది. తన అక్షరాలు ఎంత శక్తివంత మైనవో చెబుతూనే పూర్వ కవులను (తిలక్ మొదలుగా గలవారు) తిరస్కరించడం జరిగింది.

''మా అక్షరాలు ఆకాశ పారిజాతాలు కాదు
కన్నీళ్లు తుడుచుకునే కర్చీఫ్ ముక్కలుకాదు
ప్రియుల పాద పీఠాలు తుడిచే తల నీలాలు కాదు
ప్రయోగశాలలో వధింపబడే గినీపిగ్స్ కాదు
వెన్నెట్లో ఆడుకోడానికి వాటికి తీరిక లేదు
బంగారు రంగు అట్టలు కప్పుకుని
లైబ్రరీ గదుల్లో నిద్దరోవాలన్న కోరికాలేదు
మా అక్షరాలు జీవితం ధనస్సుకు సంధించిన బాణాలు
తాము కరిగిపోతూ వెలుగునిచ్చే కొవ్వొత్తులు''

కవిత్వం కేవలం ఆనంద ప్రధానం కాదు. ఆ ఆనందానికి కారణ భూతమవుతున్న అదృశ్య విషాదం ప్రథమ స్థానం ఆక్రమించాలని కవి భావం.

"పువ్వుల గురించి కూడా రాస్తా, కాని
పూలను నలిపేసిన
పాపిష్టి చేతులను గురించి
రాయడం మరువను'' అంటున్నారు కవి.

దేశం అస్తవ్యస్తంగా ఉంది. న్యాయం కోసం పోరాడే ప్రతి వీరుడూ నేల కొరుగుతున్నాడు. అయినా అంతిమంగా న్యాయం గెలువక తప్పదు. అప్పుడు ఆవిర్భవించే సమాజం కోసం కవి తపన పడుతున్నాడు.

''ప్రతి ఊరేగింపూ ఒక యుద్ధరంగమవుతోంది
నేలకొరిగే సూర్యుని ప్రతి కిరణం
ఒక్కో సూర్యుడుగా తిరిగి ఉదయిస్తోంది.
ఈ కాళరాత్రిని అసహ్యించుకుని నా దేశ భూభాగం
ఉదయం వైపు తిరుగుతోంది. పురుకులతో-పరుగులతో"

ఆ ఉదయం కోసమే ఈ కవితా సంకలనం.

# జ్వాల - జ్యోతి

[చిల్లికంటి మల్లారెడ్డి, ఎం. ఎ. మూల్యం : రు. 3-50 లు. ప్రతులకు : 1) మెదకు మండలి రచయితల సంఘం, సదాశివపేట-502 291. మెదకుజిల్లా, ఆం.ప్ర. 2) శ్రీపతి నరసమ్మరెడ్డి, గ్రామం అండ్ పోస్టు ఎలకుర్తి, వయా జోగిపేట-502302. తా॥అందోలు, జి॥ మెదకు. 3) బి. మల్లారెడ్డి. ఇం. నెం. 4-8-405, గౌలిగూడ, హైదరాబాదు - 500 012.]

ఇది మెదకు మండల రచయితల సంఘం ప్రచురించిన పంథొమ్మిదవ ప్రచురణ. ఇది కవితా సంకలనం. కవి చిల్లి కంటి మల్లారెడ్డి. 'కులోన్మాదులకు/మతోన్మాదులకు/ధనమదాంధులకు/దగా కోరులకు/శ్మశానవాటికలతి/జ్వాలను నేను/మూఢాచారాల/ గాడాంధ కారాల/దారి తెలియక తడబడు వాళ్ళను /అరుణోదయానికి నడిపే/ ఆశాజ్యోతిని నేను/' అని రెడ్డిగారు జ్వాల-జ్యోతిగేయంలో వారిని గురించి వారి కవితాతత్త్వాన్ని గురించి చెప్పుకొన్నారు. అయితే కవితా రచనలో, భావాభి వ్యక్తీకరణలో రెడ్డిగారు ప్రాథమిక దశలోఉన్నారు. వచనత్వం కవిత్వంకాదు. రాసినప్రతిగేయం కల్పితంకాదు. ఈ సంకలనంలో 'గులాబి పువ్వు' ఒక్కటి ధ్వన్యాత్మక గేయం. వర్తమాన సమాజంలో జరుగుతున్న మానభంగాలకు ఈ గేయం గొప్ప ప్రతీక. గులాబి మానభంగం కావింపబడిన స్త్రీకి, కందిరీగలు కిరాయి మూకలకు ప్రతీకలు.

'గులాబి శీలం బలియైన వార్త
జాము పొద్దెక్కక ముందే
తోటంతా తెలిసింది.
బొట బొట కన్నీరు కార్చి
వాడి పోయి నిట్టూర్చాయి ఉద్యాన
వ నాంతర ఇలాంతర కుసుమాలు'

ఇది గేయం ముగింపు, ఈ కవిగారికి నేటి అమానుషత్వం మీద, రేపటి మానవత్వంమీద అసహ్యం, విశ్వాసం ఉన్నాయి. కొంచెంసిం దల్లా కవితా సాధన. భవిష్యత్తులో మంచి కవిత్వం రాస్తారని ఆశించవచ్చు.

శ్రీ టి. ఎల్. కాంతారావు

# మధుర మీనాక్షి

[కథల సంపుటి. రచన: ఆర్. ఎస్. సుదర్శనం, ప్రచురణ శ్రీమతి ఆర్. వసుంధరాదేవి, 8-211, సువిశేషపురం, రాజమండ్రి పేజీలు : 138, వెల : ఎనిమిది రూపాయలు.]

ఈ సంపుటిలోని కథలు ఎక్కువగా మనస్తత్వాలకు సంబంధించినవి. కథ ఏమిటి అనుకుంటే, సమీక్షించటానికి ఏమీ దొరకదనిపిస్తుందిగానీ, కథనం మాత్రం చక్కగా సాగుతుంది. కథలన్నీ చదివాక, వాటిల్లో వచ్చిన పాత్రల మనోవిశ్లేషణ అర్థం చేసుకోడానికి మరొక్కసారి చదవాలనిపిస్తుంది. పైపైన వేగంగా చదువుకునే కథలు మాత్రం కావివి. శిల్పంలోనూ, శైలిలోను ప్రత్యేకతను సంతరించుకున్న కథల సంపుటి యిది.

ఇందులోని మొదటి కథ మధుర మీనాక్షి. కథలో అతని పేరు సూచించలేదు. అతను నెల్లూరులో వ్యాపారస్థుడు. నలుగురు పిల్లల తండ్రి. భార్య రెండేళ్ళ క్రితం చనిపోయింది. వ్యాపారంలో పడిపోయి ఒంటరితనాన్ని మరచిపోతాడు. కానీ, అప్పుడప్పుడు అతని మనసులో ఏదో దిగులు ప్రవేశిస్తూ వుంటుంది. ఎక్కడి కయినా ఒంటరిగా కొన్ని రోజులు తిరిగిరావాలనుకొని బయలు దేరతాడు. 'మధుర'కు బయలుదేరి అక్కడొక లాడ్జిలో దిగుతాడు. దేవాలయ ప్రాంగణంలో ఒక సౌందర్యవతి అతని కళ్ళల్లో పడు తుంది. ఆమె ఆకర్షణ అతనిమీద ఎక్కువవుతుంది. ఇద్దరికీ పరి చయమవుతుంది. ఆమె పేరు మీనాక్షి. అక్కడ కాలేజీలో లెక్చరర్. భర్త నాలుగేళ్లుగా అమెరికాలో వుంటున్నాడు. భర్త రమ్మని రాసినా ఆమె వెళ్ళలేదు. పిల్లలులేరు. ఒకనాటి సాయంకాలం అతని ఆరాధనకు ప్రతిఫలంగా ఆమె ఆనందానుభూతిని ప్రసాది స్తుంది. అదేరోజు రాత్రి మీనాక్షి స్టవ్ వెలిగిస్తూ చీర అంటుకొని దగ్ధమైపోయిందన్న సంగతి అతనికి మరునాడు తెలుస్తుంది.

అతను భార్యలేనివాడు. ఆమె భర్తకుదూరమైనమనిషి. ఇద్దరి జీవితాల్లోనూ వెలితివుంది. ఇద్దరూఒకరై వెలితిని పోగొట్టుకున్నా, ఆడదానిగా ఆమె నిలబడలేక ఆత్మహత్య చేసుకున్నదనిపిస్తుంది.

రెండోకథ, 'ప్రతిబింబం'. బస్సుదిగిన ఒక యువకునికి ఒక ముసలి ముష్టివాడు తారసపడతాడు. జ్యోతిష్యంమీద నమ్మకం పెట్టకోక బాబూ, మనస్సుకు ఏదో తాత్కాలికమైన ఉపశమనమే తప్ప, దాన్ని నమ్ముకోవడం తెలివితక్కువ. మనిషికి కావలసింది మనశ్శాంతి, తృప్తి. పెంచుకున్న మమకారాలవల్ల, ధనసంపాదన వల్లా, అది సమకడదు అని చెప్తాడు. మరొక ముష్టివాడివల్ల తను ఎలా ముష్టివాడయ్యిందీ చెప్తూ, ఆ యువకునికి మనశ్శాంతి కొరకు మంత్రోపదేశం చేయబోతాడు. జీవితంలో అలసిపోయిన వాళ్ళకు మనశ్శాంతి కావాలి, నేను యువకుణ్ణి, నాకు అక్కర్లేదు అని వెళ్ళిపోతాడు.' ఆ మంత్రోపదేశంవల్ల తనుకూడా ముష్టివాడయి పోతాడేమోనన్న భ్రాంతివల్ల.

మూడోకథ, 'కొండమెట్లు'. అతను అరవై దాటినవాడు. ఉద్యోగ విరమణ తర్వాత, లోకల్ లైబ్రేరియన్‌గా చేస్తుంటాడు. కూతురు వర్ణాంతర వివాహం చేసుకోబోతే అడ్డుపడతాడు. ఆమె ఆత్మహత్య చేసుకుంటుంది. కొడుకు అమెరికా అమ్మాయిని చేసు కున్నాడని అతన్ని వదులుకుంటాడు. లైబ్రరీ అటెండరు జానకి అనే అమ్మాయి పేర ఉత్తరం వస్తే, చదివి దాస్తాడు. ఆమెను ఈ ప్రేమ పిలుపోనుండి రక్షించాలనే తాపత్రయంలో. ప్రేమికుని దగ్గ ర్నుంచి జవాబు రాలేదని ఆమె విరక్తితో ఆత్మహత్య చేసు కుంటుంది. అతనిలో సంఘర్షణమొదలవుతుంది. దేవుని దర్శనార్థం కొండపైకి బయలుదేరతాడు. నీరసంతో పడిపోగా ఒక డాక్టరు రక్షిస్తుంది. ఆమె 'హరిజన' యువతి అని తెలిసి క్షోభ పడతాడు. చివరకు తను దూరం చేసుకున్న కొడుకుతో, తనకు అగ్ని సంస్కారం చేసిపొమ్మని అడుగుతాడు.

కాలంతోపాటు, మనుషులతో జీవితాన్ని సర్దుకుపోలేని ఒక వ్యక్తి కథ ఇది.

నాలుగోకథ 'పాపజాతి'. చిన్నతనం నుండి తల్లిదండ్రుల దగ్గర కాకుండా, తాతయ్య దగ్గర రక్షణలో పెరిగిన మనవడి కథ. 'తాతయ్య పామును ద్వేషించినంతగా లోకంలో మరెవ్వరూ దేన్నీ ద్వేషించలేరు, అలాంటి తాతయ్య పాముకాటుకు చనిపోతే, మనవడు ఎంతో ప్రశాంతత ననుభవిస్తాడు. అతనిలోని కసి పాము పగలాంటిదనిపిస్తుంది.

ఐదోకథ 'ఏంకాంతం'. జైలులో వున్నాకూడా సిగరెట్లు తాగకుండా వుండలేని ఆనందరావు కథ. సిగరెట్ మానెయ్యలేక పోవడానికి కారణం, ఇట్లా అనుకుంటాడు, "చీకటిలో మెరుస్తూ తన వూపిరితోపాటు స్పందించే ఈ సిగరెట్ కొస, ఈ నిప్పుకణిక, వికసించి ముకుళించే యీ ఎర్రగులాబీ మొగ్గ, ఇది తన ఏకాంతం !"

'వికసించి ముకుళించే...' భావాన్ని చక్కగా తెలియ జేసారు రచయిత.

ఆరోకథ 'కన్నుల వెలుగు'. తనలోని ప్రత్యేకతని చూపుకోడానికి భర్త విజయ్‌కు విసుగు కలిగించే ధోరణిలో ప్రవర్తించే ధర్మవేణికి, దీపావళిరోజున వెలుగురవ్వలు కళ్ళల్లోపడి చూపు పోతుంది.

గతంలో, విజయ్ పిరికితనంతో ప్రేమలతను పెళ్ళి చేసుకోలేకపోతాడు. ఆమె తర్వాత పెద్ద డాక్టరవుతుంది. పెళ్ళిచేసుకోకుండా వుండిపోతుంది. ఆ ప్రేమలతే మళ్ళా ధర్మవేణికి చూపురావడానికి కారణభూతురాలవుతుంది. అందమైన ప్రేమకథ.

ఏడోకథ 'ఎడుపు'. సోధి క్షయవ్యాధిగ్రస్తుడు. భార్య పురుడు పోసుకుందుకు పుట్టింటికి వెళుతుంది. ఆమెకు ఇతని వ్యాధి గురించి తెలియదు. ఎదురుగుండా కనిపించే గుడిసెలోని స్త్రీ అతన్ని ఆకర్షిస్తుంది. అతని వ్యాధి తగ్గు ముఖం పడుతున్న సమయంలో ఆస్త్రీతో సంపర్కం పెట్టుకుంటాడు. మళ్ళీ అతనికి రోగం ఎక్కువవుతుంది. ఆమె భర్తతో కలిసి ఆ వూరు విడిచిపెట్టి వెళుతున్నానని చెపుతుంది. వెళ్ళొద్దని ప్రాధేయపడతాడు. కానీ ఆమె ఒప్పుకోదు. తన కౌగిలిలో మైమరచి వుండగా, ఆమెను చంపేస్తాడు. వూహించని ముగింపు గల కథ.

'కళ్యాణోత్సవం' చివరి కథ. సువర్చల చిన్నతనం నుండి దైవభక్తి గలది. ఎప్పుడూ ఉపవాసాలతో గడుపుతూ వుంటుంది. భర్త ఆమె చెప్పినట్టే వింటాడు. ఆమె పూజామందిరం నుంచివచ్చి అభయమిస్తేగానీ, అతను ఏ కార్యక్రమానికీ పూనుకోడు. గడించిన ఎంతో నల్లధనం పూజామందిరంలోనే వుంటుంది. ఆమె దైవభక్తి గలదైనా, డబ్బువిషయంలో చాలా ప్రీతి గలది. చివరకు ఆ నల్లధనం ఇన్‌కంటాక్సు వాళ్ళచేతిలో పడుతుంది. దైవాన్ని కేవలం డబ్బుకోసం కొలిచే భక్తురాలి కథ.

అచ్చు బాగుంది. ముఖచిత్రం ఆకర్షణీయంగా వుంది. కానీ, ముఖచిత్రాన్ని బట్టి ఈ పుస్తకం 'మదుర మీనాక్షి' పుణ్యక్షేత్రానికి సంబంధించినదనిపిస్తుంది, చూసేవారికి. పైన 'కథల సంపుటి' అని వ్రాస్తే వ్యాపారరీత్యా బావుండేది.

# స్పృహ

[కథల సంపుటి. రచన : విహారి. ప్రచురణ : స్పందన సాహితీ సమాఖ్య, బుట్టాయిపేట. మచిలీపట్టణం. పేజీలు : 104 వెల : అయిదురూపాయలు ]

ఈ సంపుటిలో తొమ్మిది కథలున్నాయి. మొదటి కథ స్పృహ. ఏ విషయంలోనైనా అదృష్టం అతని గుమ్మం వరకూ వచ్చి ఆగిపోతుంది. తాను గొప్ప దురదృష్టవంతుడనుకుంటాడు–అంతకంటే దురదృష్టవంతుడు ఎదురు పడేవరకు.

పల్లెటూళ్ళో ఎప్పుడూ పెళ్ళికూతురిలా కళ కళలాడుతూ, సమారాధనలూ, సంతర్పణలూ, సప్తాహాలు జరుగుతూ వుండిన పెద్దలోగిలి, ఇప్పుడు గోడలు బీటలువారి, సున్నం చవుడు బట్టి, పెంకులురాలి, కోతకొచ్చిన కూలీలు, పిల్లులూ, కుక్కలు—మరి కొందరు నిర్భాగ్యులకు నివాసమవుతుంది. ఒక తరంలోని వెలుగు ఈ తరంలో చీకటి–ముందు చూపు ఎరగని పాత తరంవారు, నేటి తరం వారికి మిగిల్చిన కష్టాలు తెలిపే కథ–'తీసుకోని నిర్ణయాలు'

సామాన్య కుటుంబంలోని పిల్లలకు ఎన్నెన్నో కోర్కెలు. బాగా చదువుకోవాలనీ, బాగా బ్రతకాలనీ....ఇట్లాంటి కోర్కెలు తీర్చలేని తల్లిదండ్రులు, ఆ కోర్కెలను తీర్చే దయగల తండ్రికి అప్పజెప్పడానికి వెనకాడరని చెప్పేకథ–చేతిలో వెన్న.

కేవలం ఒక అమ్మాయికోసం, తనవారికి దూరమై, వెలివేయబడి, తర్వాత ఆ అమ్మాయి అతన్ని వదిలి వెళ్ళిపోయినా, మళ్లా తనకోసం తిరిగివస్తే, స్వీకరించడానికి వెనుకాడని విశాలహృదయం గల వ్యక్తి కథ 'చలనం'. అతడు ఆమెపట్ల చూపించిన కరుణ పాఠకుడ్ని చలింపజేస్తుంది. ఈ కథ ఆంధ్రసచిత్ర వారపత్రిక నిర్వహించిన కథల పోటీల్లో బహుమతినందుకున్నది.

శారద లెక్చరర్. ఆమె బావ శంకరం కారు మెకానిక్. పెద్దవాళ్ళకు ఇష్టంలేకుండా పెళ్ళి చేసుకుని సుఖంగా వుంటారు. వాళ్ళ కాపురం సరిగ్గా వుండకపోతే బాగుణ్ను, ఆనందిద్దాం అన్న పెద్దవాళ్ళ ధోరణిని చిత్రించిన కథ 'నీడలు'. రచయిత చెప్పినట్టు ఇదొక తమాషా కాంప్లెక్స్. పరికిస్తే చాలా మందిలో వుంటుంది.

నువ్వే నాకు చదువు చెప్పించాలి బాబాయ్ అంటూ సీతాపతి బాబాయి పంచన చేరతాడు. అతని డబ్బుతో చదివి పెద్దవాడవుతాడు. డబ్బు గడిస్తాడు. కానీ బాబాయ్‌కి అవసరమైన డబ్బు ఇవ్వకుండా, తనకు ఎన్నివేల డబ్బు అవసరమో ఏకరువుపెట్టే కృతఘ్నుని గురించి కథ 'కోటి విద్యల్లోనూ చేరనిది'.

తనకున్న సమ్మకాల ప్రచారంకోసం ఇతర్లను ఉపయోగించుకోవాలనుకునే ఒక కాలేజీ ప్రిన్సిపల్ వలలో పడని వనిత కథ 'అద్దంలో నువ్వూ నేను.'

పరాయి రాష్ట్రంనుంచి కూటికోసంవచ్చి చిన్నహోటలు పెట్టుకుని జీవితాల్ని సాగిస్తున్న ఓ కుటుంబం కథ 'వెల్లువలో పూచికలు'. ఆ పూరిజనం ఆ కుటుంబంలోని ఆడవాళ్ళ పొందు కోసం తాపత్రయపడతారుగానీ, వాళ్ళను ఆదుకునే సంస్కారం మాత్రం వారికి వుండదు.

కష్టపడేవాడికి కూటికి కరువులేదు అని తెలిపే కథ 'ఓ సూర్యుడి కథ'.

ఈ సంపుటిలో విషయ ప్రధానంగా 'ఓ సూర్యుడి కథ', 'కోటి విద్యల్లోనూ చేరనిది' భావప్రధానంగా 'స్పృహ', 'చలనం' మంచి కథలుగా చెప్పుకోవచ్చు.

# పొన్న

[కథల సంపుటి. రచన, ప్రచురణ : జయంతి వెంకట రమణ. పేజీలు : 152. వెల : ఆరు రూపాయలు.]

ఈ సంపుటిలో అయిదు పెద్దకథలు వున్నాయి. వాటిల్లో మొదటిది పొన్న. ఓ మారుమూల పల్లెటూరు వెళ్ళి, ఉచితంగా వైద్యం చేస్తూ జీవితాన్ని సాగిస్తున్న ఒక యువ వైద్యుని కథ. అతని నిజాయితీకి ఆకర్షితురాలయి, అతనికి చేదోడుగా వుండాలని తాపత్రయపడుతుంది పొన్న అనే గొల్లపడుచు. వారిద్దరి స్నేహానికి అందమైన రూపమే పొన్న కథ.

యామిని పెళ్ళి, పీటలమీదఆగిపోతుంది-కట్నం విషయంలో. అతనిది, పరిస్థితి ఎదుర్కోలేని చిన్నవయసు. ఆమె మళ్ళీ పెళ్ళి మాట తలపెట్టదు. తోబుట్టువులు పెళ్ళిళ్లు చేసుకుని ఎవరిదారిన వాళ్ల వెళ్ళిపోతారు. ఆమె తండ్రికి బాల్యస్నేహితుడైన ఒకపురోహితుడు ఆమెను చేరదీస్తాడు.

మళ్లా ఎంతోకాలానికి యామిని వున్న వూరికి వస్తాడు అతడు. ఆమె యింకా పెళ్ళి చేసుకోకుండా వుందని తెలిసి ఎంతో పశ్చాత్తాపపడతాడు. బదులుగా ధనసహాయం చేయబోతాడుగానీ, ఆమె స్వీకరించదు. ఇది రెండో కథ 'ఆకాశదీపాలు'.

అందాన్ని చూడాలే తప్ప అనుభవించరాదు అన్న ధోరణిలో తను ప్రేమించిన ప్రియురాల్ని కేవలం స్నేహితులుగా ఒకరినొకరు చూసుకుంటూ వుండిపోదాం, పెళ్ళి కామ సంబంధమైన బంధాలు లేకుండా, అంటాడు చిత్రకారుడైన చంద్రం. ప్రియురాలు కమల అతని వింతధోరణిని హర్షించలేక మరొకర్ని పెళ్ళి చేసుకుని వెళ్ళిపోతుంది. పద్దెనిమిదేళ్ళ తర్వాత ఒక అమ్మాయిని చూసి 'కమల' అని భ్రమిస్తాడు. కానీ ఆమె కమల కూతురని, కమల చనిపోయిందనీ తెలుసుకుని, తానెంత మూర్ఖుడో అర్థం చేసుకుంటాడు. ఇది శిల్పం కథ.

'కొడిగట్టిన దీపాలు' పట్టెడన్నం కోసం పడిగాపులుపడే జీవులకథ. ముసలి తల్లీ, అవిటి అన్నకోసం, కాయం కష్టంచేస్తాడు కాసులు. అటువంటి కాసులు తుపానుకు బలి అయితే, ఇక ఆ జీవులకు దిక్కెవ్వరు ? అవిటి వాడ్ని నన్నుతీసుకెళ్ళి, నాతమ్ముడ్ని బ్రతికించకూడదా అని వాపోతాడు అన్న.

ఒక అమ్మాయి ఇంట్లో చెప్పకుండా తను ప్రేమించిన వాడి కోసం బయలుదేరుతుంది. స్టేషనుకొచ్చి రైలుకోసం ఎదురు చూస్తూ వుంటుంది. ఆ స్టేషను మాస్టరు, ఆమె పరిస్థితి గ్రహించి, ఆమెకు ప్రేమికుని కోసమై వెళ్ళి, సుఖపడని ఒక అభాగ్యురాలికథ చెప్పి, ఆమె మనసుమార్చి, ఆమెను తిరిగి ఇంటికి పంపిస్తాడు.

ఇందులో శ్రీ పురిపండా అప్పలస్వామిగారు 'ఓ మాట' అంటూ కథా ప్రక్రియ గురించి, రచయిత గురించి చెప్పారు.

ఈ కథల్లో గమనం బాగుంది, కొన్నిచోట్ల నిడివి ఎక్కువ అనిపించినా కథల్లో సృష్టించిన వాతావరణం పాఠకుణ్ని కథలో లీనమయ్యేట్టు చేస్తుంది. మంచి కథకు అంతకంటే ఏంకావాలి ?

— బాబు

# బాణుని కాదంబరి : దాని వైశిష్ట్యము

[రచయిత : శ్రీ వేదము వేంకటరామన్, ఎం. ఏ, ఆంగ్లశాఖాధ్యాపకుడు వెంకటగిరిరాజు కళాశాల, నెల్లూరు. డెమ్మీ - 22+104+14 పేజీలు. వెల : రు. 32-00 లు. ప్రకాశనము: శ్రీమతి వి. ఆర్. సంయుక్త, 1032, పొగ తోట, నెల్లూరు. ప్రతులకు : అరుణా బుక్ స్టాల్, ట్రంకు రోడ్డు, నెల్లూరు.]

సంస్కృత సాహితీ ప్రపంచంలో బాణమహాకవి స్థానం అత్యుత్కృష్టమైనది. సంస్కృత గద్య వాఙ్మయంలో అతనికి గల పేరు మరొకరికి లేదు. బాణుని



1

కృతులు రెండూ - కాదంబరి, హర్షచరిత్ర అసమగ్రాలయినా శాశ్వతమైన కీర్తిపతాకలు. కాదంబరిని అతని కుమారుడు పూర్తిచేసి సమగ్రత్వం చేకూర్చాడు.

అద్భుత కథా సన్నివేశాల కాకరమైన కాదంబరిని మొన్న మొన్నటి వరకూ చక్కగా పరిశీలించి వెలువరించిన విమర్శ గ్రంథాలు తెలుగులో రాలేదు. ఈ మధ్యనే కొందరు పరిశీలకులు అపనికి పూనుకొని పరిశీలన గ్రంథాలను వ్రాసి ప్రకటిస్తున్నారు. అట్టి విమర్శ గ్రంథాలలో ఈ "బాణుని కాదంబరి - దాని వైశిష్ట్యము" ఎన్నదగినది.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు గ్రంథ పరిశోధనను ప్రోత్సహిస్తూ పోటీల నేర్పాటుచేసి, విలువైన గ్రంథాలు వెలువడడానికి దోహదం చెయ్యడం ఎంతో ప్రశంసనీయం. అకాడమీవారు 1977 లో పోటీకి నిర్ణయించిన పై విషయాన్ని గురించి యీ గ్రంథాన్ని రచించి రచయిత ప్రథమ బహుమతిని అందుకొన్నారు. అదే యిప్పుడు చక్కని అకృతితో వెలువడింది.

వారి అపులలో ఒకరన్నట్లు పుదూరు ద్రావిడులైన వేంకట రామన్‌గారు ఇంటిలో వ్యవహరించేభాష తమిళం. ఆయన ఆంగ్ల భాషాధ్యాపకులు - విషయం సంస్కృతానికి సంబంధించినది. రచన ఆంధ్రభాషలో. ఇట్టి పరిస్థితిలో దీనికి ప్రథమ బహుమతి లభించడం రచయిత వైశిష్ట్యాన్ని తెలియజేస్తున్నది.

రచయిత ప్రఖ్యాత విద్వత్కుటుంబంలో జన్మించినందున ఆయనకు సంస్కృతం మొదలైన భాషలపైని ఎక్కువ ఆదరం. ఆయన సంస్కృత ప్రాకృతాలలో తీవ్రకృషిచేసి గట్టి పాండిత్యం సంపాదించారు. అందువల్ల ఆయనకు అకాడమీవార పోటీకయి గ్రంథాన్ని తయారు చేయుటకు కడచిన శతాబ్ది చివరి దశలో పీటర్స్ పీటర్సన్ అనే పాశ్చాత్య సంస్కృత విద్వాంసుడు సంస్కరించి ప్రకటించిన "కాదంబరి" ఆధారంగా ఇది రచించబడినది. ఆ మహా విద్వాంసుని విపుల పీఠిక, గ్రంథంచివరి ఆంగ్ల వ్యాఖ్యానం వీరికి ఎంతో సహాయపడినవి. ఆయన యెడల కృతజ్ఞతను తెలుపుటకే యీ గ్రంథం పీటర్స్ పీటర్సన్ పండితునికే కృతి యీయబడింది.

వేంకట రామన్‌గారు ఆంగ్ల భాషావేత్తలగుటవల్ల ఈ విమర్శ గ్రంథం పాశ్చాత్య విమర్శ పద్ధతిలో సాగింది.

ఇందలి శీర్షికలలో ముఖ్యమైనవి - బాణప్రశస్తి, బాణునికాలం, రచనలు, జీవితం - గీర్వాణ గద్య కావ్య వికాసం - గద్య కావ్యరూపములు - గద్య కావ్యరీతులు, అలంకారిక నిర్వచనములు, కాదంబరి ముద్రణాల - వ్యాఖ్యానాలు - కావ్య విపర్యయాలు - కథ - కథా మూల విచారం - కథా కథన ప్రకారం - భాషావిశేషాలు అలంకార విశేషాలు - రసచర్చ - వర్ణనలు - పాత్రలు - సమకాలీన సమాజం - సందేశమున్నూ. పరిశిష్టాలలో శుకశారికా కలహ వృత్తాంతం. దండి - బాణుల తులనాత్మక పరిశీలన తెలుగు కవులపై బాణుని ప్రభావం, కాదంబరిలోని సంభాషణలు వున్నవి.

చివర ఉపయుక్త గ్రంథాల పట్టిక, పద్యానుక్రమణిక, నామాద్యనుక్రమణిక చేర్చబడినవి. గ్రంథ శీర్షికలనుబట్టి రచయిత యీ గ్రంథ రచనకు ఎట్టి గట్టి కృషి చేసినదీ తెలుస్తూ ఉన్నది. "బాణ ప్రశస్తి" లో అతనిని ప్రశంసించిన ప్రాచీన సంస్కృత గద్య కవులతోపాటు ఈకాలపు తెలుగు కవులు కొందరు పేర్కొనబడ్డారు. బాణుని జీవితాన్ని గురించి తెలిపినప్పుడు హర్ష చక్రవర్తితో అతని కేర్పడిన పరిచయం జీవితంలో ఎట్టి మార్పును కలిగించినదీ వివరించబడింది. గద్య కావ్యాల క్రమ వికాసం, కథాఖ్యాయికల భేదం, గద్యరీతులు, వివరంగా చూపబడినవి. చిత్రవిచిత్రమైన కాదంబరిలోని కథ సులభ గ్రాహ్యమయేటట్లు విపులంగా చెప్పడం జరిగింది. దీనికి మూల కథయేది? అనే చర్చలో రచయిత పరిశీలన ప్రశంసనీయం. ఇలా ప్రతి విషయంలోనూ దీని విశిష్టత కానవస్తుంది. గ్రంథం చివరి అనుక్రమణికలు పాఠకులకు ఎంతో ఉపయోగిస్తాయి,

వేంకట రామన్‌గారు పీటర్స్ పీటర్సన్ పండితుని జీవిత చరిత్రను చాలా సంగ్రహంగా తెలిపారు. కళాప్రపూర్ణ మరుపూరి - కోదండ రామిరెడ్డిగారు మాత్రం వేంకట రామన్‌గారి జీవిత చరిత్రను చాలా విపులంగా చెపుతూ, పుదూరు ద్రావిడ బ్రాహ్మణుల పాండితీ ప్రకర్షను ప్రశంసించారు. అందులో తమ అనుభవాలను కొన్నింటిని చేర్చారు.

ఇంతవరకూ వెలువడిన కాదంబరీ పరిశీలన గ్రంథాలలో ఇది విశిష్టమైనది. ఇది సాహితీ వేత్తల ఆదరాభిమానాలను అందుకోగలదని నా భావన.

"ఆంగీరస"

## ఆంధ్రదేశ చరిత్ర - ఆధునిక యుగం

[రచన : జి. వెంకట రామారావు. వెల : రూ. 25-00 డెమ్మీ 250 పుటలు. ప్రాప్తిస్థానం : రచయిత, ఇం. నెం : 18-7-739/2, అవుట్ సైడ్ గౌలీపూర, హైదరాబాదు - 500253.]

ప్రాచీన ఆంధ్రదేశచరిత్రకు ఆధారాలు తక్కువ. అయినా చాలా గ్రంథాలు వచ్చాయి. ఆధునికాంధ్రదేశ చరిత్రకు ఆధారాలు ఎన్నో దొరుకుతున్నప్పటికీ, గ్రంథాలు తక్కువే వెలువడ్డాయి. ఇప్పుడిప్పుడే కొన్ని మంచి పుస్తకాలొస్తున్నాయి. అందులో ఇదొకటి.

ఆంధ్రభూమి, ఆంధ్రప్రభ, ఆంధ్రప్రదేశ్, మూసీ మొదలైన పత్రికల్లో వ్రాసిన వ్యాసాలకు మరికొన్ని జోడించి రామారావుగారు ఈ గ్రంథాన్ని వెలువరించారు. ఇందులో 'నిజాం రాజ్య స్థాపన' దగ్గరనుండి ఆంధ్రప్రదేశ్ అవతరణకు వరకు అనేక ముఖ్య ఘట్టాలు కనబడతాయి. 'నవతకు నీరాజనం'తో ఈ పుస్తకం ముగుస్తుంది, మధ్యలో కొన్ని బొమ్మలున్నాయి.

ఈ పుస్తకం కేవలం ఒక చరిత్ర గ్రంథంగా కాకుండా ఆసక్తిదాయకమైన అనేక విషయాల సంకలన గ్రంథంగా కూడా కనబడుతుంది. 'చందూలాల్ దర్బార్' లాంటి మాటలకు అసలు అర్థాలేమిటో ఈ పుస్తకంలో వివరించబడ్డాయి. ఇలాగే నైజాం నవాబుల మనస్తత్వాలు మొదలైన విషయాలెన్నో ఈ పుస్తకంలో సోదాహరణంగా వర్ణింపబడటం విశేషం. బక్రీద్ పండుగనాడు గోవధ నిషేధించే శాసనాన్ని నిజాం ప్రభుత్వంచేత జారీచేయించిన భాగ్యరెడ్డివర్మ మొదలైన మహామహులను రచయిత స్మరించడం ప్రశంసనీయం.

'జస్టిస్ పార్టీ రాజకీయాలు' దగ్గరనుండి ఈ పుస్తకం అత్యంత ఆసక్తిదాయకంగా ఉంటుంది. సందర్భాన్ని అనుసరించి రచయిత ఎన్నోమారుమూల విషయాలను పాఠకుల దృష్టికి తెస్తారు. 'పానుగంటి రాజావారి నివాసం' అందులో ఒకటి. గత చరిత్రలు తవ్వి వాటిని సరియైన విధంగా నేటి సమాజానికి తగ్గట్లుగా వ్యాఖ్యానించడంలో రచయిత మంచి నేర్పు చూపారు. ఆంధ్ర మహాసభలు అనే శీర్షికక్రింద గుంటూరులో ఎలా అంకురార్పణ జరిగిందో వివరిస్తూ "మేధావులుగా ప్రసిద్ధులు గుంటూరు వాసులు. అలాంటి మేధావి న్యాపతి నారాయణరావు అనే గుంటూరు ప్లీడరు 1911లో గుంటూరు సబ్ జడ్జి కుంభకోణంనుంచి వచ్చిన ఒక తమిళ అయ్యర్. ఆయన కార్యాలయంలో చిన్న అటెండరు పదవికి ఖాళీ ఏర్పడింది. అర్హులైన ఆంధ్రులు ఆ ఉద్యోగంకోసం దరఖాస్తు పెట్టుకున్నారు, అయినా జడ్జి కుంభకోణంనుంచి తన బంధువును రప్పించి ఆ ఉద్యోగం ఇచ్చాడు. నారాయణరావు దీన్ని ఆంధ్రుల అందరికీ జరిగిన అవమానంగా భావించాడు. ప్రత్యేక రాష్ట్ర ఉద్యమానికి అంకురార్పణ చేశాడు. ప్రత్యేక రాష్ట్ర ఉద్యమమనే మహావృక్షాన్ని ఆనాటి నుంచి ఈ నాటి వరకు పెంచుతున్నది ఉద్యోగులే!" అని వ్యాఖ్యానిస్తారు.

ఇప్పుడు కొత్తగా పార్టీలు పెట్టిన వారికీ పెట్టబోయేవారికి, పాత పార్టీలలోనే ఉండి ఆంధ్రదేశ చరిత్ర తెలియకుండానే పాలన చేద్దామనుకొనే వారికి ఇది తప్పక చదవదగిన గ్రంథం. విద్యార్థుల సంగతి సరే సరి! ఒక చోట రచయిత ఇలా అంటారు. "1917 మార్చిలో ప్రకాశం మంత్రివర్గంపై అవిశ్వాస తీర్మానం పెట్టించారు కామరాజ్. దాని వెనుక కాంగ్రెస్ అధిష్ఠానవర్గం వారి చేయి ఉంది. అధిష్ఠానవర్గం ఇష్టానిష్టాల ప్రకారం నడవని రాష్ట్ర ప్రభుత్వాలను పడగొట్టడం ప్రకాశం మంత్రివర్గంతోనే ప్రారంభమైనది."

## యాభై సంవత్సరాల జ్ఞాపకాలు

(1929 నుంచి 1977 వరకు)

[రచన : దేవులపల్లి రామానుజరావు, ప్రచురణ : సాహితీ బంధు బృందం, చైతన్య సాహితి, హనుమకొండ వరంగల్లు. ప్రతులకు : ఆంధ్ర సారస్వత పరిషత్తు, బొగ్గులకుంట, తిలక్ రోడ్, హైదరాబాదు - 500 001. 140 పుటలు, వెల : 15 రూపాయలు.]

శ్రీ దేవులపల్లి రామానుజరావు గారిని గురించి వ్రాయడం అంటే, అది తెలుగువారి సాంఘిక, సాహిత్య సాంస్కృతిక చరిత్ర గురించి వాళ్ళ వైజ్ఞానిక ప్రగతి

గురించి ప్రశంసించడమే అవుతుంది. అనే ఉద్దేశంతో సాహితీ బంధు బృందం ఈ పుస్తకాన్ని ప్రచురించింది.

స్వాతంత్ర్యం రాకముందు దేశంలో ఉన్న పరిస్థితులు తెలుసుకోవడానికి ఈ పుస్తకం బాగా ఉపయోగపడుతుంది. ప్రపంచ చరిత్రలోను, భారతదేశ చరిత్రలోను ఈ యాభై సంవత్సరాల కాలం అతి ముఖ్యమైనదని చెప్పవచ్చు. రామానుజరావుగారు మన సాహిత్యం యెడల, సంస్కృతిపట్ల మిక్కిలి గౌరవాభిమానాలతో ఈ గ్రంథం రచించారు. ఆచరణలో లోపాలు ఏమి ఉన్నప్పటికీ, మన ఆశయాలు మహోన్నతమైనవని చాటి చెప్పారు. గాంధి, నెహ్రూ మొదలైన జాతీయ నాయకుల ప్రసక్తి వచ్చినపుడు ఈ రచయిత మిగుల పూజ్యభావంతో వారిని గూర్చి వ్రాసి నేటి తరాల వారికి ఆ మహానాయకుల యెడల సరియైన దృక్పథం ఏర్పరచడానికి ప్రయత్నించారు. సందర్భాలను అనుసరించి కాళోజీ మొదలైన కవులనుండి కొన్ని కొటేషన్లు ఇచ్చారు. ఉర్దూ భాషను గూర్చి వీరుచేసిన వ్యాఖ్యానం సముచితంగా ఉంది. ఆంధ్రోద్యమం మొదట్లో ఎలా సాంస్కృతిక ఉద్యమంగా ప్రారంభమైందో చక్కగా వివరించారు.

ఈ పుస్తకం పుణ్యమా అని తెలుగు జాతిలో జన్మించిన మహామహులెందరో స్మరింపబడ్డారు. దేవులపల్లివారు పెద్దలయెడ గౌరవంతోనూ, సమకాలీనుల యెడ స్నేహభావంతోనూ జ్ఞాపకాలు వ్రాశారు. ఆధునిక తెలంగాణా చరిత్ర నిర్మించడానికి పనికి వచ్చే విషయాలెన్నో ఈ జ్ఞాపకాల్లో దాగివున్నాయి. మాతృభాషపై రామానుజరావుగారికి ఉన్న అభిమానం ఈ గ్రంథంలో ఎల్లెడలా పాఠకులకు గోచరిస్తుంది. సి. వి. రామన్ గారు తమకు తెలుగు స్వాగత పత్రం నచ్చిందని చెబడం మొదలైన జ్ఞాపకాలను రచయిత తమ మనసులో ఇన్నాళ్ళూ భద్రపరచుకొని ఈ గ్రంథంలో ఇప్పుడు వెలువరించారు.

"జిన్నా పాకిస్తాన్ నిర్మాత, ముస్లిం నాయకుడు కాని ఆయనకు ఉర్దూ, ఫారసీ, అరబ్బీలు రావు. వచ్చినవి రెండు భాషలు. ఇంగ్లీషు, గుజరాతు"—

అలాంటి విచిత్ర సత్యాలెన్నో ఈ గ్రంథంనిండా విస్తరించి పాఠకులకు అత్యంతాసక్తిని రేకెత్తిస్తుంటాయి.

మహాత్మాగాంధీగారిని గూర్చి పరిజ్ఞాపకం —

"అది ఒక ఋషి ఆశ్రమంవలె మాకు కనిపించింది. దూరం నుండి అసంయమీంద్రుని సందర్శించినాము. భవ్యమైన ఆవేశం కలిగినది. పులకాంకిత గాత్రులమైనాము. ఆరోజు సాయంత్రం వార్ధా రైల్వేస్టేషన్‌లో బొంబాయి రైలు ఎక్కడానికి వచ్చిన ఆయనను రెండవ పర్యాయం చూచినాము. ఓవర్ బ్రిడ్జిపైనుండి ఆయన క్రిందికి దిగుతుండగా ఆయన మాకొక మహాసేనానాయకునివలె గోచరించినాడు. ఆకారంలో చిన్నవాడైననూ పంచగట్టుకొని పైన ఒక ఉత్తరీయం వేసుకొని చేతిలో కర్రపట్టుకొని మెట్లుదిగుతుండగా ఆయన ముఖముపై మాకొక దివ్యతేజస్సు కనిపించినది. ఆయన వక్షస్థలము ఒక మహాపురుషుని వక్షస్థలమువలె కనిపించినది."

ఇందులో సగభాగం సాహిత్య సంబంధం. దీని కారణం రామానుజరావుగారి జీవితంలో ఎక్కువభాగం సాహిత్యంతో ముడివడి ఉండటమే !

ఈమధ్య వెలువడిన మంచి పుస్తకాల్లో ఇదొకటి.

## కుటుంబరావు సాహిత్యం

[మొదటి సంపుటం]

[ప్రచురణ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, చంద్రం బిల్డింగ్స్, విజయవాడ-520 004. డెమ్మీ, ఉపోద్ఘాతాలూ ఫోటోలూ + 421 పుటలు. వెల : రు. 25-00 లు.]

రచనలతోనే జీవితం అంతా గడిపిన ఆధునిక రచయితలలో కొడవటిగంటి కుటుంబరావుగారొకరు. వీరు రచనలను సామాజిక దృష్టితో తీర్చిదిద్దిన కొద్దిమందిలో ముఖ్యులు. ఈ గ్రంథ సంపాదకుల అంచనా ప్రకారం కొడవటిగంటి యాభైయేళ్ళ కాలంలో పది పన్నెండు వేల పేజీలకు మించిన సాహిత్యం సృష్టించారు.

ఆధునిక తెలుగు సాహిత్య ప్రక్రియలలో కొ. కు. స్పృశించనిది స్వల్పం. గల్పిక అనగానే ఆయనే గుర్తుకువస్తారు. జీవితవాస్తవాన్ని వ్యాఖ్యానించడంలో కొ. కు. కృతకృత్యులయ్యారు. ఆయన రచనలను ఆరు సంపుటాలుగా ప్రచురించాలని ఈ ప్రచురణాలయం తలపెట్టి ఈ మొదటి సంపుటాన్ని వెలువరించారు. ఏవో కొన్ని నిబంధనలు పెట్టుకొని కొ. కు. రచనలను విభజించి, కొన్నింటిని ఏర్చి కూర్చి ఈ సంపుటిని వెలువరించారు. అభ్యుదయ ప్రాపంచిక దృక్పథం ఏర్పడటానికి ఈ సంపుటి తోడ్పడుతుందని సంపాదకుని విశ్వాసం.

ఆధునికాంధ్ర సాహిత్యంలో ప్రక్రియలకు, రచయితల సంఖ్యకు లోటులేదు. ఒకప్పుడు బాగా వెలిగిన రచయితల పేరులు గూడా ఈనాడు తెలియవు. అదృష్టవంతులైన రచయితలు కొందరు మాత్రం పేరు నిలబెట్టుకున్నారు. కానీ వాళ్ళ రచనలు మాత్రం దొరకడంలేదు. ప్రాచీన సాహిత్యంలో కొన్ని గ్రంథాలు కాల పరీక్షలో నెగ్గి నిలిచాయి. ఆధునిక సాహిత్యంలో ఎన్ని అలా నిలుస్తాయో చెప్పడం కష్టం, ప్రస్తుతానికి ఏదో ఒక వర్గాన్ని పట్టుకొని వేళ్ళాడే రచయితల్లో కొందరు మాత్రం కొంతకాలం నిలుస్తారనిపిస్తోంది. రచనల్లో ఏ దృక్పథం మంచిదో ఏది కాదో నిష్పక్షపాతదృష్టి వున్నవాళ్ళకు చెప్పడం కష్టమవుతోంది. ఏ వర్గం వాళ్ళకు ఆ వర్గాన్నిగూర్చి వ్రాసినవే మంచివనిపిస్తోంది. ఏ జనాన్ని దృష్టిలో ఉంచుకున్నా, ఏ భావాలను సమర్థించినా కళాత్మక దృష్టి వ్యంగ్యవైభవమూ, శిల్పమూ ఉన్న రచన నలుగుర్నీ ఆకర్షిస్తుందనడంలో సందేహంలేదు. కొ. కు రచనల్లో ఉత్తమ గుణాలకు కొరతలేదు. అందుకు ఈ సంపుటమే సాక్ష్యం.

ఇందులో సంపాదకులైన కేతు విశ్వనాథరెడ్డిగారి భూమిక, 'అందరికీ' అయిన తరువాత సొదుం రామ్మోహన్‌గారి 'పాఠకులతో కాసేపు' ఉంటుంది, ఇది పాఠకులకెంతో సాయపడుతుంది. కొ. కు. జీవితాన్ని గూర్చిన సంక్షిప్త చిత్రణ 'జీవితరేఖలు'. 'తన రచనల గురించి' కొ. కు. కొందరు మిత్రులకు వ్రాసిన లేఖల్లోంచి కొన్ని భాగాలు ఉటంకింపబడ్డాయి.

ఈయన రచనల్లో కంపోజిటర్లు, సంపాదకులు, ట్యుటోరియల్ కాలేజీవాళ్ళు, పాటగాళ్ళు, నాటకాలవాళ్ళు ఎక్కువగా కనబడుతుంటారు. ఈ తరం పాఠకుల్లో ఎంతమంది ఈ పాత్రల్ని ఇష్టపడతారో చెప్పడం కష్టం. "మధ్య తరగతి జీవితమనగానే సినిమా జీవులేనా ?" అని అనుమానం వచ్చేవాళ్ళకు "కథలలో సినిమాలను గురించి నేను తరచు రాసేమాట నిజమే. 23 ఏళ్ళగా నేను సినిమా వాతావరణానికి సన్నిహితంగా ఉండటం ఒక కారణం" అనికొ.కు. ఇచ్చే సమాధానం అభ్యుదయభావాలుగల పాఠకులకు రుచింపక పోవచ్చునేమో !

ఈ సంపుటంలో వారసత్వం, ఐశ్వర్యం, ఎండమావులు అనే నవలలున్నాయి. పీనుకథ, అద్దెకొంప, దైవాధీనపు జీవితం, కలిసిరావాలి. అట్టడుగు, సహోద్యోగం, నవ్వులాట-తెలకపిండి, అష్టకష్టాలు, ఉద్యోగం, నిరుద్యోగం, పనము వేమూ, మనుషులకు గల స్వేచ్ఛ, షావుకారు సుబ్బయ్య, పైకివచ్చినవాడు. మహాయిల్లాలు, దాలిగుంటలో కుక్కలు, శీలపరిశీలన, ట్యూలర్, పానకంలో పీచు, కొత్తజీవితం, అనే కథలున్నాయి. భక్త్యాగ్రేసరుడు, ధనలక్ష్మి నేరం, ఎన్నికల ప్రచారం, నంది కొక్కులు, ఉద్ధరింపు, భూతదయ. విప్లవమేధావి, రాజుగారి తలనొప్పి, ధర్మయుద్ధం, చదరంగం, భాషాసేవ అనే గల్పికలూ, అనగా అనగా. నడమంత్రపుసిరి అనే నాటికలూ ఉన్నాయి.

నేటి రచయితలు తప్పక చదవనగిన ఈ సంపుటిని అందంగా వెలువరించిన ప్రచురణకర్తలు అభినందనీయులు.

## శ్రీ పులిచెర్ల సాంబశివరావు

# గ్రంథ స్వీకారాలు

★ కృష్ణదేవరాయల నాటి రెండు చాటుపద్యములు - హోసూరు వేపనపల్లి ప్రాంతములలో దొరికిన తాళపత్రములలో రాయలనాటి అపూర్వములను రెండు చాటు పద్యములను గూర్చిక వివరణకలదు. వివరములకు శ్రీ కె ఎస్. కోదండరామయ్య, హోసూరు తాలూకా ఆంధ్ర సాంస్కృతిక సమితి, హోసూరు (ధర్మపురిజిల్లా, తమిళనాడు.)

★ తనికెళ్ళవారి పంచాంగము పంచాంగకర్తలు: శ్రీ తనికెళ్ళ సూర్యనారాయణ సిద్ధాంతి. వీరి పుత్రులు, ప్రతులు క్రింది చిరునామాకు రూ. 3/75 యం. ఓ. చేసి, బుక్ పోస్టద్వారా పొందగలరు. తనికెళ్ళ వేంకట రమణశాస్త్రి, తెలుగు పండిట్, సంస్థానం హైస్కూలు, బొబ్బిలి (విజయనగరం జిల్లా)

★ రజితోత్సవ గేయాలు. రచన : సి. ఆర్. దాస్, 54 పేజీలు గల ఈ పుస్తకం వెల రూ 3/ ప్రతులకు : 'బాలవి' పి. ఆర్. దాస్, గుడివాడ-52 301

★ ఆర్యచాణక్య. రచన. వి. వి. ఆర్. కె. ప్రసాద్ (రాధశ్రీ) 8 పూజీలు గల ఈ పుస్తకం వెల రూ. 1-50 ప్రతులకు రచయిత పేర ఓడుపలళ్ళు (పోస్టు) గుంటూరుజిల్లాకు వ్రాయాలి.

★ కవితలు. ఎక్సరే (ఆధునిక కవితా వేదిక) లోంచి ప్రచురించిన కవితలుగల 1! పేజీల ఈ పుస్తకం సాలు చందా రూ. 6/- ప్రతులకు : ఎక్సరే పబ్లిషర్స్, కొల్లూరి హవుస్, అమలాపురం-533 212

★ మరో కెరటం-(ఆధునిక సాహిత్య బులిటన్-2) ప్రచురణ: సాహితి మిత్రులు, విజయనగరం. ఆంధ్ర రాజ్య రజతోత్సవము శ్రీ కృష్ణదేవరాయల 4 2వ పట్టాభిషేకోత్సవము. పేజీలు : 24, వివరములకు శ్రీ కె. ఎస్. కోదండరామయ్య, మాజీ శాసన సభ్యుడు, హోసూరు, (ధర్మపురి జిల్లా, తమిళనాడు).

Printed and Published for Nageswara Rao Estates (Private) Ltd , by S Radhakrishna at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada-3. Editor: S. Radhakrishna, Vijayawada. Phones: 75667 & 61247.

